# చతుర

నవంబర్ 2002 ✿ రూ. 7/-




## స్పందన

షేక్ రఫి

## సచిత్ర విచిత్రం

# ఆరోగ్యానికి సంకేతం అకితా



జపాన్‌కు చెందిన ఈ కుక్క పేరు అకితా. దాన్ని ముద్దుగా ఎలుగుబంటి అని కూడా పిలుస్తారు. 5 వ శతాబ్దంనుంచీ జపాన్‌లో ఈ శునకజాతి ఉంది. అప్పట్లో వివిధ రకాల పందాలతోపాటు కుక్కల పందాలు కూడా ఉండేవి. ఈ కుక్కలు హోరాహోరీ పోరాడుకుంటుంటే... వీటినుంచి కొత్త పాఠాలు నేర్చుకుని తమ శత్రువులపై ప్రయోగించేవారు సైనికులు. 1931 వ సంవత్సరంలో జపాన్ ప్రభుత్వం అకితాను తమ జాతీయ శునకంగా ప్రకటించింది. దాని గౌరవార్థం అకితా చిత్రంతో స్టాంపును కూడా విడుదల చేసింది. ఆ కుక్కను పెంచేవారు ఆర్థిక ఇబ్బందుల్లో ఉంటే ప్రభుత్వం సాయం చేసేది. మంచి ఆరోగ్యానికి చిహ్నం ఈ అకితా. జపాన్‌లో వ్యాధిగ్రస్థులకు వారి బంధువులు తొందరగా కోలుకోవాలని ఆకాంక్షిస్తూ అకితా బొమ్మను పంపేవారు.

# చతుర కథలు

## హోమ్లీ డాక్టర్!

ఆ కాంప్లెక్స్‌లో ముప్పయి రెండు ఫ్లాట్లు వున్నాయి. గ్రౌండ్ ఫ్లోర్‌లో మూడవ నెంబర్ ఫ్లాట్‌లో వుంటున్న నీరజని ఆ కాంప్లెక్స్‌లో ఎరగనివారు లేరు. నీరజది ఎవరికయినా స్వచ్ఛందంగా ఉపకారం చేసే స్వభావం. అయితే అన్ని ఉపకారాలు ఒక ఎత్తు వైద్యసంబంధమైనవి ఒక ఎత్తు.



నీరజ డాక్టర్ కాదు. నీరజ బంధువులలో, స్నేహితులలో డాక్టర్లు లేరు. అయినా నీరజ మెడికల్ నాలెడ్జి అంతా ఇంతా కాదు.

ఫస్ట్ ఫ్లోర్‌లో వుంటున్న అన్నపూర్ణమ్మ గారు కడుపునొప్పి వచ్చినా, కాలు నొప్పి వచ్చినా నీరజ దగ్గరకే వస్తారు. వచ్చి బాధ వివరాలు. అన్నీ నీరజకు చెప్తారు. నీరజ అన్నీ విని తన బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి పదినిమిషాల తర్వాత తిరిగి వచ్చి అన్నపూర్ణమ్మగారు తీసుకోవలసిన మందులు, జాగ్రత్తలు చెప్తుంది. అన్నపూర్ణమ్మగారు అవి పాటించి రెండురోజుల్లోనే రైట్ అయిపోతారు.

రెండవ ఫ్లోర్‌లో వుంటున్న సీతాలక్ష్మి తన మూడేళ్ళ కూతురికి నీళ్ళ విరోచనాలు అవుతున్నాయనీ, తనకి భయంగా వుందని నీరజ ఫ్లాట్‌కి వచ్చి చెప్తుంది. నీరజ అన్నీ క్షుణ్ణంగా తెలుసుకుని తన బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి పదిహేను నిమిషాల తర్వాత తిరిగి వచ్చి ట్రీట్‌మెంట్ సీతాలక్ష్మికి చెప్తుంది. సీతాలక్ష్మి ఆ మర్నాడు సాయంత్రం పాపకి బాగా నయమయిందని నీరజకి థాంక్స్ చెప్తుంది.

ఆ వీధిలోనే వుంటున్న వైష్ణవి తనకి జలుబూ, తలనొప్పి వదలకుండా పట్టిపీడిస్తున్నాయనీ, నిద్ర కరవయిందనీ వచ్చి నీరజతో చెప్పుకుంటుంది. "కూర్చోండి, ఏమీ ఫరవాలేదు" అని చెప్పి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి





కొద్దిసేపటి తర్వాత తిరిగివచ్చి 'ఏమి తీసుకోవాలో, ఏమీ తీసుకోకూడదో' నీరజ చెప్తుంది. మూడు రోజుల తర్వాత వైష్ణవి నీరజకి ఫోన్‌చేసి జలుబు, తలనొప్పి పూర్తిగా మాయమయిపోయాయనీ, బాగా నిద్రపడ్తోందనీ, రుణం తీర్చుకోలేననీ చెప్తుంది.

ఒకరోజున మధ్యాహ్నం పదిమైళ్ళ దూరంలో వుంటున్న ప్రభ ఫోన్‌చేసి మోకాళ్ళనొప్పులు తగ్గడంలేదనీ, కూర్చుంటే లేవలేననీ, లేస్తే కూర్చోలేననీ చెప్తుంది.

"కంగారుపడకు. పావుగంట తర్వాత ఫోన్ చేస్తాను. ఏది రాసుకోవాలో, ఏది వేసుకోవాలో చెప్తాను" అంటుంది నీరజ. అలాగే ట్రీట్‌మెంట్ గురించి చెప్తుంది. వచ్చి నీరజకి థాంక్స్ చెప్తుంది ప్రభ.

అలా ఎందరో ప్రతిరోజూ నీరజ దగ్గరకు వచ్చి, ఫోన్‌లో సంప్రదించీ వైద్యసలహాలు, సహాయం తీసుకుంటూ డాక్టర్ దగ్గరకు వెళ్ళకుండా స్వస్థత పొందుతున్నారు.

నీరజ నాకు మేనత్తకూతురు. చిన్నప్పటి నుంచీ కలిసిమెలిసి వున్నాము. కలిసే చదువుకున్నాము. నేను పెళ్ళయ్యాక వేరే ఊరు వెళ్ళిపోయాను. నీరజ పెళ్ళిచేసుకోక మానవసేవలో నిమగ్నమయిపోయింది. నీరజ నాకు ఆరాధ్యదైవం. అయితే మెడిసన్ చదవకుండానే, ఇంటిపట్టునే కూర్చుని సత్ఫలితాలు ఇచ్చే వైద్యసేవలు నీరజ అందించడం నాకు ఆశ్చర్యం కలిగించింది. ఆమె కీర్తి మా ఊరిదాకా పాకింది. ఆమె 'ప్రతిభ'ను స్వయంగా చూడాలని నాకు అనిపించింది.

ఆ అవకాశం నాకు రానే వచ్చింది. ఎండలునుంచి తప్పించుకుని, నీటి కరువునుంచి బయటపడి పదిరోజులు తన దగ్గర వుండమని నీరజ నన్ను ఆహ్వానించింది. టూ అండ్ ఫ్రో టిక్కెట్లు రిజర్వ్ చేసుకుని నీరజ ఊరు వెళ్ళాను. డబుల్‌రూమ్ ఫ్లాట్‌లో గెస్ట్‌రూమ్‌గా వుంచిన రూమ్ నాకు యిచ్చింది. భరించలేనంత ఆప్యాయతతో నన్ను చూసుకోవడం మొదలుపెట్టింది.

నన్ను అలా చూసుకుంటూనే తన కోసం వచ్చేవారినీ ఏమాత్రమూ నిర్లక్ష్యం చేయలేదు. ఎవరి దగ్గరా పైసా తీసుకోకుండా, ఏమీ ఆశించకుండా అందరికీ వైద్యసలహాలు, సూచనలు ఇస్తూవుంటే వారు తిరిగి వచ్చి కోలుకున్నామని థాంక్స్ చెప్తూవుంటే నా కళ్ళు ఆనందంతో చెమర్చేవి.

అయితే నీరజ అంత మెడికల్ నాలెడ్జి ఎలా సంపాదించింది. ఈ నా సందేహాన్ని నేను వచ్చిన తొమ్మిదో రోజున నీరజ ముందు పెట్టాను.

ఎవరికీ చెప్పనని చేతిలో చేయివేయించుకుని నీరజ తన బెడ్‌రూమ్‌లోకి నన్ను తీసుకువెళ్ళి బైండ్ చేయించిన రెండు పుస్తకాలు చూపించింది. వివిధ పత్రికలలో వెలువడే వైద్యసలహాల శీర్షికలలో అనుభవజ్ఞులైన డాక్టర్లు ఇచ్చిన సమాధానాలు కట్‌చేసి వాటిని 'వివిధ రోగాలు విభిన్న చికిత్సలు' అని వర్గీకరించి సంపుటి 1, సంపుటి 2లుగా నీరజ బైండ్ చేయించింది. వాటి సహాయంతోనే హోమ్లీ డాక్టర్‌గా నీరజ మారిందని అర్థంచేసుకోడానికి నాకు ఎంతోసేపు పట్టలేదు. నీరజని మనసులోనే అభినందించుకున్నాను. ఆమె సేవలకి వెలకట్టలేమనుకున్నాను.

ఆ మర్నాడే మా ఊరు వెళ్ళిపోతూవుంటే నీరజ నాతో "నైపుణ్యా, యస్.టి.డి. ఛార్జీలు బాగా తగ్గాయి తెలుసా? పగటిపూట ఫోన్ చేసినా ఫరవాలేదు" అంది.

"ఔను. అయినా ఆ ప్రస్తావన ఇప్పుడు ఎందుకు" అన్నాను.

"నీకు కంటినొప్పి వచ్చినా, కాలు నొప్పి వచ్చినా, కడుపునొప్పి వచ్చినా నాకు యస్.టి.డి. కాల్ చెయ్యి. మీ ఊళ్ళో డాక్టర్‌కి ఇచ్చే ఫీజుకన్నా యస్.టి.డి. ఛార్జీ తక్కువగానే వుంటుంది" అంది నీరజ.

– అడవికొలను నైపుణ్యా



# గిఫ్ట్

"ఏమిటోయ్ రామేశం దీర్ఘంగా ఆలోచిస్తు న్నావ్"?

"ఏంలేదు. మా మిత్రుడి పెళ్ళికి ఏం గిఫ్ట్ ఇస్తే బాగుంటుందా అని. అసలే నెలాఖరు రోజులాయె"

"ఇందులో ఆలోచించడానికేముంది ఇలాంటి సమయంలో మా తాతగారు చెప్పిన సలహా ఎప్పటికీ పాతపడిపోదు"

"ఇంతకీ ఏం సలహా చెప్పారేం మీ తాత గారు" ఆతృతగా అడిగాడు రామేశం.

రామేశం చెవిలో రెండునిమిషాలపాటు గుసగుసలాడాడు రంగనాథం. అంతే. వేయి వాట్ల బల్బులా వెలిగిపోతున్న ముఖంతో అన్నాడు. రామేశం "అయితే నేను కూడా మీ తాతగారు చెప్పిన ఆ సల హానే పాటిస్తాను"

* * *

ఆఫీసవంగానే అలా మార్కెట్‌కి వెళ్ళి కావలసిన కూరగాయలు వగైరాలు తీసు కొని ఇంటిముఖం పట్టాడు రామేశం. ఉద యమనగా ఇన్ని మెతుకులు కతికి వెళ్లడం, మధ్యాహ్నం లంచ్ ఓ బ్రెడ్, టీతో సరిపె ట్టుకుంటాడు. అలసట కొట్టొచ్చినట్టు కన్పి స్తోంది అతని ముఖంలో. "పదేళ్లుగా పని చేస్తున్నా గొర్రెతోక బెత్తెడేనన్నట్టు ఎదుగూ బొదుగూ లేని ఉద్యోగం. చాలీచాలని జీతం. ఏమిటో ఈ జీవితం"

"ఇంతేలే నిరుపేదలబతుకులూ" ఘంట సాలవారిపాట అసంకల్పితంగా పెదవుల మీంచి బయటకొచ్చింది. చర్య ఈజ్ ఈక్వల్టు ప్రతిచర్య అన్నట్టుగా అదే పెదవు లమీద నుండి చిరునవ్వు పుట్టుకొచ్చింది తన ఆలోచనలకి.

సైకిలు అలవాటుపడిన రోడ్డులో అతి మామూలుగా వెళ్ళిపోతోంది. అంతలో



"ఒరే రామేశం" అన్న పిలుపుతో సడెన్ బ్రేకుతో ఆపాడు సైకిలుని. "ఎవరబ్బా పిలి చిందీ" అనుకుంటూ చుట్టుపక్కలంతా చూశాడు. పక్కసందులోంచి పరుగులాంటి నడకతో వస్తున్నాడు రామారావు.

దగ్గరకు వచ్చీ రావడంతోనే "మీ ఇంటికే బయల్దేరాన్రా" అన్నాడు రామారావు.

"ఏమిటి విశేషం" అడిగాడు రామేశం.

"విశేషమే మరి. ఇంకో ఎప్పుడ్రా... ఎప్పుడ్రా అంటూ నన్ను నిలవనియ్యడంలే దుగా మీరందరూ. అందుకే మీ పోరుపడే





కన్న ఇంటిలోని పోరు పడడమే నయం అనుకొని సంబంధం ఖాయం చేసుకున్నాను. ముహూర్తాలు కూడా పెట్టడం అయిపోయింది. ఇదిగో... ఈ శుభలేఖ నీకిద్దామని బయల్దేరాను" నాన్‌స్టాప్‌గా చెప్తూ చేతిలో వున్న బ్యాగ్‌లోంచి రామేశం పేరు రాసివున్న శుభలేఖని బయటకు తీసి రామేశానికి అందించాడు రామారావు.

నవ్వుముఖంతో శుభలేఖని అందుకున్నాడే కాని రామేశం గుండెలు గుభిల్లుమన్నాయి. "అసలే నెలాఖరురోజులు. అప్పు చేద్దామన్నా ఇచ్చేనాథుడు దొరకద్దూ! అందరికీ నెలాఖరేనే..." ఆలోచనల్తోనే శుభలేఖ తెరిచి తేదీ, సమయం చూశాడు. మరోసారి గుండెలు గుభిల్లుమన్నాయి. ఇరవై తొమ్మిదో తారీఖు, ఉదయం పదిగంటలకి. 'హతవిధీ!' అనుకున్నాడు మనసులో "ఓరోజు సెలవు కూడా ఖర్చయిపోతోంది కదా!" అని.

"సరేరా. ఇంకా కార్డులు చాలామందికి పంచాలి. మా అక్కయ్యకి కూడా చెప్పు. ఇద్దరూ తప్పకుండా రావాలి చంటాణ్ణి తీసుకొని. వీలుచేసుకొని ఇంటికొచ్చి అక్కయ్యక్కూడా చెప్తాలే" అంటూ అదే పరుగులాంటి నడకతో ముందుకి సాగిపోయాడు రామారావు.

నీరసంగా సైకిలెక్కాడు రామేశం. 'మిత్రుడి పెళ్ళి గండం' ఎలా గడపాలో అర్థంకాక సతమతమవుతూండగా వచ్చాడు రంగనాథం. మంచి సలహా ఒకటి అతడి చెవిలో పడేశాడు ఉచితంగా!

"హమ్మయ్య" అనుకుంటూ నిట్టూర్చాడు రామేశం. "ఎప్పుడు పెళ్ళిరోజు వస్తుందా" అని ఎదురుచూడడం మొదలుపెట్టాడు హుషారుగా. ఈలోపు ఆఫీసులో ఆరోజుకి శెలవు చెప్పేశాడు. మిత్రుడికివ్వాల్సిన గిఫ్టుకి ప్రయత్నాలు మొదలుపెట్టాడు రామేశం.

మిత్రుడి పెళ్ళికి వెళ్ళి వచ్చి హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు రామేశం. అందరికన్నా పెద్ద గిఫ్ట్ బాక్స్‌నే పెళ్ళిలో అందరిముందూ కనువిందుగా మిత్రుడి చేతిలో పెట్టాడు. ఫొటోగ్రాఫర్‌ని పిలిచి మరీ ఫొటో తీయించుకున్నాడు. ఘనంగా జరిగిన పెళ్ళిలో కుటుంబంతోసహా పసందుగా విందుభోజనం ఆరగించి ఇంటికి తిరిగివచ్చాడు.

ఆనక తీరుబాటుగా గిఫ్ట్స్ లెక్కచూసుకొనే రామారావు రామేశం గిఫ్ట్ బాక్స్‌లో ఏముందో చూసి ఒక్కసారిగా తెల్లబోయాడు. ఏముందంటారా...

"కానుకల్లోకెల్లా అతి విలువైనది మంచి సలహా. అది నీకెప్పుడు కావాలన్నా మిత్రుడిగా నన్నడుగు. నీ రామేశం"

– సూరిపండు

---

## ట్రింగ్ ట్రింగ్

ఫోన్ మోగుతోందదేపనిగా. అలవాటు చొప్పున చెయ్యి రిసీవర్ మీదకి పోయింది. 'కెవ్వు' మని గావుకేక. రివ్వుమంటూ ఇంకో చెయ్యొచ్చి రిసీవర్ లాగేసుకుంది. సదరు చెయ్యి తాలూకా శాల్తీ ఎవరో కాదు. మా అమ్మాయి మానస... మనిషి మహా నస. ఫోన్‌లో అదేపనిగా నవ్వుతూ 'ట్రింగ్ ట్రింగ్... ట్రింగ్ ట్రింగ్' అంటూంటే వింటూ నివ్వెరపోవడం నావంతయింది.

ఐదునిమిషాలలా నసపెట్టి 'రాంగ్ నెంబర్' అని పెట్టేసింది నిరాశగా.

"ఎవడో యం.డి రాజుట" అంది పొడిగా.

ఉలిక్కిపడ్డాను. యం.డి.రాజంటే పొడక్షరాల్లో యం.ధర్మరాజు, మా యం.డి. రేపాఫీసులో ఆయన ఫేస్ చూడ్డం ఎలారా దేముడా? పొడిచేస్తాడేమో. 'ఎద్దులా పక్కనే ఉన్నాను కదా మొద్దూ, ఫోన్ నాకివ్వద్దా?' అని గావుకేకలేద్దామనుకునే లోపలే లోపలనుంచి చావుకేకలు వినపడ్డం మొదలెట్టాయి.

ఉలిక్కిపడి 'ఎవరన్నా పోయారా?' అని



గభాల్న లేవబోతున్న నన్ను ఆపి "ఎవరూ పోలేదులే. అవి సీతమ్మ శోకాలు" అంది నా కూతురు. "అమ్మా, బామ్మా వాచ్ చేస్తున్నార్లే" అంది మళ్లీ నా అయోమయం ఫేస్ చూసి.

అయినా వెలక్క "సీతమ్మెవరే? " అన్నాను.

"సీరియల్లో హీరోయిన్లే నాన్నా! నీకన్నీ విడమరిచి చెప్పాలి. పాతకాలం రేడియోలా చాదస్తం. ఇదిగో ఇదే చెబుతున్నా... సాయంత్రం అత్తమ్మొచ్చిందాకా ఫోనెత్తద్దు" అంది బెదిరింపుగా.

"అత్తమ్మెవరే? "

"టీవీ సీరియల్ డాడీ! సాయంత్రం ఏడున్నరకొస్తుంది. అందాకా ఫోనెత్తద్దని దానే దుపు" అన్నాడక్కడే ఉన్న మా చిన్నాడు గజ గజ వణుకుతూ.

"వంట్లో బాగాలేదా? అలా వణుకుతున్నావేంరా? " అనడిగాను వాణ్ణి.

"డాన్స్.డాన్స్ ప్రోగ్రాంకి ప్రాక్టీస్ చేస్తున్నాడు నాన్నా. చొక్కాలో ఐస్ ముక్కలేసుకున్నాడులే" అంది మానస.

"చెప్పులకింద ముళ్లుకూడా గుచ్చుకున్నాడు, స్టెప్పులు బాగా వస్తాయని" అంది మళ్లీ మోగుతున్న ఫోన్ కేసి పరుగెడుతూ.

"మా యం.డి అయితే నాకివ్వు" అన్న నా మాటకి...

"బోడి ఉద్యోగానికి రిజైన్ చేసిపారెయ్యండి డాడీ! రేపెల్లాగూ నాకు రెండు కోట్లు వస్తాయికదా! ఒకటి మీకిస్తాలే" అంది ధీమాగా ఫోన్‌లైన్ కట్‌చేసి.

"రెండు కోట్లు ఎవరిస్తారే నీకు? " అన్నాను ఆశ్చర్యపోతూ.

"టాపెస్ట్ మూవీ కాంటెస్టు లో పార్టిసిపేట్ చెయ్యడానికి కాంపిటీషన్ కార్డ్ పోస్ట్ చేశాను కదా! ఫోన్లో వాళ్లడిగే ప్రశ్నలన్నిటికీ సరిగ్గా సమాధానాలిస్తే రెండు కోట్లు మనవే. కాల్ వచ్చినప్పుడు 'హలో' అనకుండా 'ట్రింగ్ ట్రింగ్ ట్రింగ్ ట్రింగ్' అనాలి. అదీ కండిషన్. రెండుకోట్లొస్తున్నాయంటే క్వశ్చన్లెంత కష్టంగా ఉంటాయో? ..." అనుకుంటూ ఆలోచనలో పడిందది.

ఇంటర్ పల్టీ కొట్టిన పిల్ల ఏ కోచింగూ లేకుండా కోట్లెలా సంపాదిస్తుంది?

ఈసారి ఫోన్ మోగినప్పుడు 'కెవ్' మని కేకేసింది మానస. ఆనందంతో "లైన్ కలిసిందీ.. లైన్ కలిసిందీ" అంటూ ఇంట్లో అందరూ ఫోన్‌చుట్టూ గుమికూడారు.

"కంగ్రాట్యులేషన్స్. మీ ఎంట్రీ ఏక్సెప్టెడ్. ఇంటిల్లిపాదినీ ఫుల్‌గా ఎంటర్‌టైన్ చేసే మా టాపెస్ట్ మూవీ ప్రోగ్రాంని టాప్ టూ బాటమ్ .... బ్రేకుల్తో సహా బ్రేక్ లేకుండా వాచ్ చేసి చివర్లో మీ ఇంట్లో ఎవర్నైనా మేమడిగే క్వశ్చన్లకు కరెక్ట్ ఆన్సర్ ఇవ్వగలిగితే రెండు కోట్లు గ్యారెంటీగా మీవే. బెస్టాఫ్ లక్. మీ చిరునామా చెప్పడం మర్చిపోకండి. ఇంటిల్లిపాదీ కంపల్సరీగా చూడాల్సిన చక్కటి లక్కీ ప్రోగ్రాం. సండే సాయంత్రం సెవెన్ థర్టీ నుండీ..." అంటూ పూర్తి చేసింది అవతలి గొంతు.

ఆ క్షణం నుండీ మొదలైన సందడి సండే సాయంత్రం దాకా ఎడ తెగ కుండా సాగుతూనే ఉంది తెలుగు సీరియల్‌లాగా. ఊళ్లో తెలిసినవాళ్లందరికీ ఫోన్లెళ్లాయి. కాలనీ వాళ్ల ఇళ్లకెళ్లి బొట్టు పెట్టి మరీ చెప్పి వచ్చారు అమ్మా, కూతుళ్లు. దూరపు చుట్టాలకి ఎస్టీడీలెళ్లాయి.

"మీ మానస వాయిసు టీవీలో వస్తుందిట కదా! మా పిల్లలార్నెల్లనుండీ కాల్ చేస్తూనే ఉన్నారు. లైను కలవట్లా. యువార్ లక్కీ. రెండు కోట్లు" అన్నారాఫీస్ కొలీగ్స్ అసూయగా కంగ్రాట్స్ చెబుతూ.

అందరం ఎదురు చూసిన ఆరోజు రానే వచ్చింది. అందరం టీవీ ముందు కూర్చున్నాం. కె.బి.సి, బి.బి.సి, ఛప్పర్‌మార్‌కే టైప్ ప్రశ్నలు చాలా ప్రిపేరయ్యాం ఇంట్లో అందరం. ఆ టైమ్‌లో కరెంట్ పోకూడదని సుబ్బారాయుడికి కొబ్బరికాయ కొట్టొచ్చింది మా అమ్మ. మా అమ్మాయి ఇంటర్ పోయినప్పుడు కూడా ఇంట్లో ఇంత హంగామా లేదు. మరి సవాల్ కరోడ్‌కా!

రెండు కోట్లొస్తే ఏంచేయాలని తెగ తర్జన భర్జనలు పడిపోయి, ఎటూ తెగక, తాత్కాలికంగా తీర్మానాన్ని వాయిదా వేసేసుకునే వేళకి షో మొదలయింది. ఊపిరి పీల్చడం మర్చిపోయి టీవీ స్క్రీన్‌వంకే చూస్తున్నాము. ఏంకర్ వంకర్లుపోతూ ఒక్కొక్కళ్లనీ ప్రశ్నలేయడం మొదలెట్టింది.

"లాయర్లు, జడ్జీలు, కేసులు, శిక్షలూ లేని కోర్టేది?" అన్న ప్రశ్న వేసింది మమ్మల్ని.

"టెన్నిస్ కోర్ట్" అన్నాడు మా చిన్నాడు.

"కరెక్ట్. లైటెనింగ్‌కీ, లైటెనింగ్‌కీ తేడా ఏమిటి?"



"లైటెనింగ్‌కి కాంతొస్తుంది, లైటింగ్‌కి బిల్లొస్తుంది" అంది మా ఆవిడ.

"వెల్ సెడ్. 'వడదెబ్బ' చలికాలంలో తగులుతుందా?"

"తగులుతుంది. మా ఆవిడ చేసిన వడ నా మీదకి విసిరేసినప్పుడు" అన్నాన్నేను నెత్తి మీది బొడిపి తడుముకుంటూ

"బ్రహ్మాండం. కడుపునెప్పికి పిల్లలకి పట్టేదేంటి? 'గ్రైప్ వాటరా?' లేక 'ప్రైప్ వాటరా?'"

"గ్రైప్ వాటర్" అంది మానస.

ఒక్కక్షణమాలోచించి "కరెక్ట్" అని అరిచింది యాంకర్.

"కంగ్రాట్యులేషన్స్. రెండు కోట్లు ఏర్పాటు చేస్తున్నాము" అంటుండగానే కరెంట్ పోయింది.

కొవ్వొత్తులు వెలిగించడానికి గదిలోకి పోయిన మా ఆవిడ 'కెవ్వు' మని కేకేసింది. అందరం అటు పరిగెత్తాం. అప్పుడే కరెంటొచ్చింది. బెడ్‌రూంలో బీరువా బార్లా తెరిచుంది. బట్టలన్నీ చెల్లాచెదురయ్యాయి. బంగారం పెట్టుకునే బాక్సులు నోళ్లు వెళ్లబెట్టుకుని చూస్తున్నాయి. కంగారుగా లాకర్ తెరిచి చూశాను. బాంక్‌లో డిపాజిట్ చెయ్యాల్సిన ఆఫీస్ క్యాష్ హుష్ కాకీ... మొత్తం రెండు లక్షల దాకా గోవిందా. స్టేషన్‌కి కంప్లయింట్ ఇవ్వడానికెడితే

"బోడి రెండు లక్షలు. పోతే పోనివ్వండి సార్. రెండు కోట్లు రాబోతున్నాయిగా" అన్నాడు ఎస్సై చెయ్యి గీరుకుంటూ. వెయ్యి రూపాయలు ఆ చేతిలో పడితేగానీ గీకుడు ఆగలా.

నిజమే. రెండు రోజుల తర్వాత రెండు కోట్లు వచ్చాయి. ఒకటి మా మానస నాకిద్దామనుకున్నది. కానీ నేను తీసుకోలా. వేసుకోడానికి బావుండదు మరి. ఎందుకంటే అది పెట్టీకోటు.

—కర్లపాలెం హనుమంతరావు

# చతుర

సంపుటి: 25 సంచిక: 10 నవంబర్: 2002 298వ సంచిక

అప్పుడే రోడ్ క్రాస్ చేస్తున్న ఆ అమ్మాయిని తన కారుతో ఢీ కొట్టబోయి సడన్‌బ్రేక్ వేశాడాయువకుడు. అందులో ఎవరి తప్పూ లేకుండా కాకతాళీయంగానే అలా జరిగినా... ఆమె తోక తొక్కిన తాచులా బుస్సుమని అతన్ని పోలీస్‌స్టేషన్‌లో నిలబెట్టింది. అటుపైన కూడా అనూహ్య సంఘటనల్లో కలిసినప్పుడు అతడిని అందరిముందూ అవమానపరిచింది.

**కానీ ఆమె తన జీవితభాగస్వామి అవుతుందని అతడు, అతడే తన భర్త కాబోతున్నాడని ఆమె... ఊహించలేకపోయినా అనివార్య కారణాలవల్ల అలా జరిగిపోయింది.**

నవ మన్మధుడిలా అతడు, రతీదేవిలా ఆమె ప్రేమసామ్రాజ్యాన్ని ఏలవలసిన తరుణంలో ఏం చేశారు? బద్ధశత్రువులైన వారికి పెళ్ళి జరగడంలో గల రహస్యం ఏమిటి?

**చక్కని శైలి,**
**చిక్కని సంభాషణల మేళవింపు**

**షేక్‌రఫీ** నవల

# స్పందన

ఈ నెల చతుర సమగ్ర నవల.

**తే**దీ: మార్చి నెల ఫస్టు!
సమయం: సాయంత్రం అయిదు!
స్థలం: హైదరాబాద్‌లో ట్యాంక్‌బండ్!
వాతావరణం: ఆహ్లాదకరంగా ఉంది!
హుసేన్‌సాగర్‌కు అభిముఖంగా ఓ బెంచ్‌పై కూర్చుని ఉన్నారు వారిద్దరూ.

"ఎప్పుడూ గలగలమంటూ ఏదో ఒకటి మాట్లాడే దానివి ఏమైంది ఈ రోజు నీకు? అలా మౌనంగా ఉన్నావేంటి?" గంభీరమైన వదనంతో, నిర్వికారంగా నీళ్లవైపు తదేకంగా చూస్తూ ఆలోచిస్తున్న సుమతిని అడిగింది స్పందన.

సుమతి నుండి ఏవిధమైన సమాధానం రాకపోవడంతో "నిన్నే!" సుమతి కుడి భుజాన్ని తడిమి ప్రశ్నించింది స్పందన.

స్పందన కరస్పర్శతో స్పందించిన సుమతి, తల తిప్పి స్పందనవేపు చూసింది. అప్పుడే వీచిన గాలి తెమ్మెరకు సుమతి నుదురుపై వాలి ఉన్న ముంగురులు రెపరెపలాడాయి. ఆ ముంగురుల్లాగే సుమతి అంతరంగం కూడా అల్లకల్లోలంగా ఉంది. సుమతి కళ్ల లోకి సూటిగా చూసింది స్పందన. సుమతి కన్నుల్లో తడి.

"సుమతీ!" అంటూ సుమతి రెండు చేతుల్నీ తన చేతుల్లోకి తీసుకుంది స్పందన.

సుమతి కళ్లు సజలాలయ్యాయి. ఉద్వే గాన్ని కంట్రోల్ చెయ్యడానికి పళ్ల బిగువుతో పెదవుల్ని అదుముకుంటూ ఉంది సుమతి. స్పందనకు ఏమీ అర్థం కాలేదు. ఏం చెయ్యాలో పాలుపోని స్పందన సుమతి మెడ మీదుగా చేతులు వేసి

"సుమతీ! కంట్రోల్ యువర్‌సెల్ఫ్. డోన్ట్‌బి ఎమోషనల్" అంటూ ధైర్యం చెప్పింది.

తన ఫ్రెండ్ యొక్క మానసిక స్థితిని అంచనా వెయ్యడానికి ప్రయత్నించసాగింది స్పందన. చలాకీగా అందరితోనూ కలుపుగోలుతనంతో వ్యవహరించే సుమతిని ఆ విధంగా చూడటం స్పందనకదే మొదటి సారి. అందుకే ఆమెకీ పరిస్థితి దిగ్భ్రాంతిని కలిగిస్తోంది. 'ఏమై ఉంటుంది? ఏం జరిగుంటుంది?' అని మనసులో అనుకోవడమే కాదు, సుమతిని అదే అడిగింది స్పందన.

తుఫాను ముందు ప్రశాంతతలా కొన్ని క్షణాల మౌనం... మానవ సంబంధాలలో స్నేహం పోషించే పాత్ర అద్వితీయమైనదంటారు చాలామంది. ఏ బంధం నిలబడాలన్నా పరస్పరావగాహనే కదా పునాది! తనకేం జరిగిందో తన స్నేహితురాలితో చెప్పుకుని హృదయభారం తగ్గించుకోడానికి ఉద్యుక్తురాలయింది సుమతి.

ఉదయం పదకొండూ పదిహేనవుతోంది. అదో విశాలమైన ఆఫీస్ గది. ఎయిర్ కండీషనర్ ఆ గదిలోని ప్రతీదాన్నీ చల్లబరచినా సుమతి ఆందోళనని చల్లబరచలేకపోతోంది. అందువల్లే అంత చలిలోనూ సుమతికి చెమటలు పట్టసాగాయి.

'మనోహర్ అండ్ మనోహర్ ఎక్స్‌పోర్ట్స్ లిమిటెడ్' కంపెని యం.డి మనోహర్ విలాస్ ఎదురుగా నిలబడి ఉందామె. కుడి చేతిలోని పెన్నుతో తన గెడ్డంపై సుతారంగా కొట్టుకుంటూ సుమతి ఫైల్ చెక్ చేయసాగాడు మనోహర్ విలాస్. ఆ కంపెనీ ఇవ్వజూపుతున్న అయిదంకెల జీతం సుమతి మనసులో కదలాడుతోంది. 'కనీసం ఈ అవకాశం దక్కినా అక్క పెళ్లి కోసం తన తండ్రి చేసిన అప్పుని దశలవారీగా తీర్చవచ్చు' మనసులో అనుకుందామె.

ఫైలు చూస్తున్నవాడల్లా ఏదో స్ఫురించినట్టు తల పైకెత్తి సుమతిని "అరె... నేను మర్చిపోయాను. సిట్‌డౌన్... ప్లీజ్ టేక్ యువర్ సీట్. అయామ్‌సారీ" అన్నాడు మనోహర్ నొచ్చుకుంటున్నట్టు.

"ఫర్వాలేదు" కూర్చుంటూ అంది సుమతి.

సుమతి ఫైల్ క్లోజ్ చేసి టేబిల్‌పై కళ్లద్దాలు తీసి కర్చీఫ్‌తో తుడిచి మళ్లీ పెట్టు

కుంటూ "సో... యువార్ సెలెక్టెడ్" అన్నాడు మనోహర్ సుమతి కళ్లలోకి నవ్వుతూ చూస్తూ.

అతడికి సుమారు నలభై ఏళ్లుంటాయి. తెల్లగా, నున్నగా ఉన్నాడతను, ఫ్రిజ్‌లో ఉంచిన క్యాబేజీలా.

"థ్యాంక్యూ సార్... థ్యాంక్యూ మెరీమచ్" సుమతి గొంతులో సంతోషం ధ్వనించింది. కానీ ఆమె సంతోషం ఎంతోసేపు నిలవ లేదు.

"మీరు సెలెక్టుకావడం మీకెంతో ఆనందాన్నిచ్చిందని నాకు తెలుసు" సిగార్ వెలిగిస్తూ అన్నాడతను.

"ఎస్ సర్" చెప్పింది సుమతి.

"పది వేల రూపాయల జీతం. అది కల్గించే ఆర్థిక భద్రత" చెప్పసాగాడు మనోహర్ విలాస్.

"కానీ సుమ... మిస్ సుమతీ... యామై స్పీకింగ్ కరెక్ట్?" అర్థోక్తిగా మధ్యలో ఆగాడతను.

"ఎగ్జాక్ట్లీ సర్" చెప్పింది.

"ఐ మీన్ మిస్ సుమతీ... నేనేం చెప్పదలచుకున్నానంటే మీకో విషయాన్ని స్పష్టం చెయ్యదలచాను" అన్నాడు.

"వాట్సిట్ సర్" నుదురు చిట్లిస్తూ అడిగింది సుమతి.

లేచి నిలబడ్డాడతను.

"మీకంటే ఎక్కువ అర్హతలు, అదే... అడిషనల్ క్వాలిఫికేషన్స్ ఉన్న చాలా మంది అమ్మాయిల్ని తిరస్కరించడం జరిగింది. ఎందుకో తెలుసా?" అడిగాడు మనోహర్ విలాస్. సిగరెట్ దమ్ములాగుతూ విండో అవతల దృశ్యాన్ని గమనించసాగాడతను. కాదు... గమనిస్తున్నట్టు నటించసాగాడు.

"అయ్ డోన్ట్ నో సర్.... నాకు తెలీదు" లేచి నిలబడుతూ అమాయకంగా చెప్పింది సుమతి.

సుమతి జవాబుకి మందహాసం చేస్తూ "జస్ట్ వెరీసింపుల్. వాళ్లంతా నీలాగ సారీ మీలా అందంగా లేకపోవడమే" చెప్పాడు మనోహర్ విలాస్.

అతడి ఆలోచనల్లో ప్రమాదకరమైన ఓ కోరిక దాగుంది 'మానవుడి బుర్రలో ప్రమాదకరమైన జంతువులు నిత్యం సంచరిస్తూ ఉంటాయని' మనస్తత్వవేత్త సిగ్మండ్ ఫ్రాయిడ్ చెప్పినట్టు. మేనేజింగ్ డైరెక్టర్ మనోహర్ విలాస్ ఉద్దేశం అర్థం చేసుకోలేని అమాయకురాలు కాదు సుమతి.

"అంటే ఏమిటి మీ ఉద్దేశం?" గట్టిగా అడిగింది సుమతి.

"మంచి ఉద్దేశమే. చూడు సుమతీ... ఈ ప్రపంచం గురించి నీకు తెలీదు. ఇదొక విశాలమైన మార్కెట్‌లాంటిది. నా ఉద్దేశంలో ఇక్కడ రెండే వర్గాలున్నాయి. ఒకరు అమ్మేవాళ్లు, ఇంకొకరు కొనేవాళ్లు. కొన్నింటికి రేటు తక్కువగా ఉంటుంది, కొన్నిటికి ఎక్కువ రేటు ఉంటుంది. అంతే తేడా" క్రూరంగా నవ్వుతూ చెప్పసాగాడతను.

విలువల వలువల్ని ఊడదీసిన వినిమయవాదపు మత్తులో నిలువెత్తూ కూరుకుపోయి ఉన్నాడు మనోహర్ విలాస్. పచ్చకామెర్ల రోగికి లోకమంతా పచ్చగానే కనపడుతుందంటారు.

"అంటే..." ముక్కుపుటాలదరసాగాయి సుమతికి.

"అంటే ఏముంది? సర్కారువారి పాట పదివేలు... నీకిష్టమైతే ప్రతి నెలా జీతం పెరుగుతుంది ఎదిగే కన్నెపిల్లకు ఎదుగుతున్న అందాల్లా" అన్నాడు సింబాలిగ్గా.

ఫైలు చేతిలోకి తీస్కుని కళ్లు కన్నీళ్లు వర్షిస్తుండగా "యూ బాస్టర్డ్" అంటూ విసురుగా బైటికెళ్లిపోయిందామె.

"వాడి ముఖంపై ఉమ్మేసి, వాడి చెంపలు పగలకొట్టి, వాణ్ణి ఆఫీసు బయటికి లాక్కొచ్చి అందరి ఎదుటా జరిగింది చెప్పి వాణ్ణి పోలీసు స్టేషన్లో ఎందుకప్పగించలేదు నువ్వు. రాస్కెల్... ఇలాంటి రాస్కెల్స్‌ని షూట్ చేసి పడెయ్యాలి... షిట్" పెద్దగా

అరుస్తూ స్పందన సుమతితో అలా చెప్పేస రికి ఆ పక్కనుంచి వెళ్తోన్న కొంతమంది ఆగి వీరిద్దరినీ గమనించసాగారు. అస్తమిం చబోయే సూర్యుడు అందమైన అగ్నిగో ళంలా ఉన్నాడు.

"అంతేనంటావా? " అడిగింది సుమతి.

"కాకపోతే ఏమిటి? భూమికి భారమైనా తగ్గుతుంది. ఇడియట్స్... ఏం వాడికి అక్కాచెల్లెళ్లు లేరా? డబ్బుతో అన్నీ కొనగ లిగే మొనగాడా? " స్పందన తీవ్రస్వరంతో అనేసరికి ఈమె ఆ కోపంలో తమనెక్కడ కొడుతుందో అన్నట్టుగా భయపడి, నిలబడి చోద్యం చూస్తున్న వాళ్లంతా వడివడిగా ముందుకి వెళ్లసాగారు.

అందులో ఒకడు "చూడ్డానికి ఎంతో అందంగా ఉందా అమ్మాయి! నోరు విప్పితే మున్సిపాలిటీయే" అంటూ పక్కవాళ్లతో చెప్పుకుంటూ సాగిపోయాడు.

"వాడంత ధైర్యంగా, అంత డైరెక్టుగా అడు గుతుంటే కనీసం వాణ్ణి ఓ చెంప దెబ్బ యినా కొట్టకుండా ఎలా వచ్చావే? సుమతీ! నిన్ను... అసలు నీకు నా స్నేహితురాలిగా ఉండే అర్హత లేదు. ఎంతో పిరికితనంతో ప్రవర్తించి మన స్నేహానికే మచ్చ తెచ్చావు నీవు. వాడి ఆఫీసెక్కడో చెప్పు నాకు. వాడి పని చెప్తాను" స్పందన అలా కోపంగా అనే సరికి

"స్పందనా! పోనీ. ఫర్గెటిట్. జరిగింది ఓ పీడకల అనుకుంటాను" నిర్లిప్తంగా చెప్పింది సుమతి.

"నువ్వు అలా బేలతనంగా కన్నీరుమున్నీ రవుతుంటే ఏదో పర్సనల్ విషయమో లేక ఇంటి దగ్గర ప్రాబ్లమేమో అనుకున్నా కానీ ఇటువంటిదని నువ్వు చెప్పేదాకా ఎక్స్‌పెక్ట్ చెయ్యలేకపోయాను సుమీ" అంది స్పందన.

"వెళదామా చీకటి పడుతోంది" లేచి నిల బడుతూ అంది సుమతి.

"అప్పుడేనా? ఐస్‌క్రీమో, ఏ కూల్‌డ్రింకో, కొబ్బరినీళ్లో తాగెళ్దాం. చీకటంటే అంత భయమెందుకు? నిజంగా నీలాంటి పిరికి వాళ్లు ఉన్నంతకాలం ఆ గాంధీ మహాత్ముడు చెప్పింది ఓ స్లోగన్లాగే ఉంటుంది" అంది.



రాత్రి పన్నెండయినట్టు గుర్తు చేసింది అలారం. టేబిల్ లాంప్ వెల్తుర్లో తదేకంగా ఏదో పుస్తకం చదవడంలో లీనమై ఉంది స్పందన. పుస్తకాలు, నోట్‌బుక్కులు, పెన్నుల్తో ఆ టేబిల్ నిండి ఉంది. అది స్పందన ఇంటిలోని స్పందన స్టడీరూమ్.

బిఎస్సీ పూర్తి చేసిన స్పందవ కాంపిటీటివ్ పరీక్షలకు ప్రీపేరవుతోంది. తల్లిదండ్రులకు స్పందన ఒక్కతే అమ్మాయి. కొడుకైనా కూతురైనా స్పందనే అన్నట్టు స్పందన తల్లిదండ్రులు అన్నపూర్ణ, ప్రసాదరావులు స్పందనని ఎంతో గారాబంతో పెంచి పెద్ద చెయ్యడం జరిగింది.

ప్రసాదరావు కాంట్రాక్టు పనులు చేస్తుంటాడు. పుస్తక పఠనంలో లీనమవడంవల్ల తలుపు చప్పుడు గమనించలేదు స్పందన. అన్నపూర్ణ లోపలికొచ్చి "టైమెంతయిందో తెలుసా? " అంటూ కూతుర్నడిగింది కోపంగా.

"పన్నెండు" తలెత్తకుండానే పుస్తకం చదు

వుతూ చెప్పింది స్పందన.

"అంటే అర్థమేంటి?" అడిగింది అన్నపూర్ణ.

"భోజనం చేసే టైమయిందని అర్థం" తలెత్తక చెప్పింది.

"హవ్వ... ఎవరన్నా వింటే నవ్విపోతారే... రాత్రి పన్నెండు మనుషులు భోంచేసే టైమా?" అడిగిందామె.

"మరి..." అడిగింది స్పందన అర్థం కానట్టు.

"దయ్యాలు తినే టైము" చెప్పింది అన్నపూర్ణ.

"పో మమ్మీ... దెయ్యాలెక్కడైనా భోంచేస్తాయా?" పుస్తకం మూసి పక్కన పెడుతూ అంది స్పందన.

"లేకపోతే ఏమిటి? టైముకి తినకపోతే ఆరోగ్యం పాడవ్వదూ" చెప్పింది అన్నపూర్ణ.

"మీ అందరితో వచ్చిన చిక్కిదే... ఈ టైముకి తినడమేంటో నాకెప్పటికీ అర్థం కాదు. ఆకలేసినప్పుడు తినాలి కానీ టైముకి తినడమేంటి నాన్సెన్స్" విసుక్కుంటూ అంది.

"కరెక్టుగా చెప్పావమ్మా! ఇప్పుడు నువ్వు నా కూతురనిపించుకున్నావు" అప్పుడే స్పందన గదిలోకొచ్చిన తండ్రి ప్రసాదరావన్నాడు,

"అదీ సంగతి... సరిపోయింది. మీ వత్తాసుందిగా దీనికి. మీరిలాగే దీన్ని సపోర్టు చేస్తూ ఉండండి ఇది సంసారం సవ్యంగా చేస్తుందని నేను మాత్రం గేరంటీ ఇవ్వలేను' ' కోపంతో చెప్పింది అన్నపూర్ణ.

"నా పిచ్చి మమ్మీ... అసలు నేను పెళ్లి చేస్కున్నప్పుడుకదా సంసారాలు గట్రా చెయ్యడానికి" అన్నపూర్ణ మెళ్లో చేతులు వేస్తూ మురిపెంగా అంది స్పందన.

"పెళ్లి చేస్కోక ఇంకేం చేస్కుంటావు?" అన్నపూర్ణ అడిగింది.

"నేను మగవాళ్లని పెళ్లి చేస్కోను" తల్లిని ఆటపట్టిస్తూ అంది స్పందన.

"ఇది మరీ బాగుంది. మగవాళ్లని కాదని ఆడవాళ్లని చేస్కుంటావా?" అంది అన్నపూర్ణ.

ప్రసాదరావు వారిద్దరి సంభాషణ వింటూ నవ్వసాగాడు.

"దాని ఉద్దేశం అదికాదులేవే. ఏదైనా మంచి హోదా సంపాదించి తనకు నచ్చిన వ్యక్తిని చేస్కుంటుందిలే. అప్పుడే అమ్మడి పెళ్లికెందుకు తొందర? ఏమంటావమ్మా?" అన్నాడు కూతురితో.

"వెల్ సెడ్ డాడీ! అమ్మెప్పుడూ అంతే. పొద్దున నిద్ర లేచిందగ్గర్నుంచి రాత్రి నిద్రపోయేదాకా పెళ్లో పెళ్లో అని ఒకటే గోల. పెళ్లి చేస్కోడమేనా ఆడపిల్ల జీవిత లక్ష్యం? ఇంకేమీ లేదా?" చిరుకోపంతో అంది స్పందన.

"మీ అమ్మ అంతేలేగానీ అన్నం తినమ్మా. వెళ్లి అన్నం తిని హాయిగా పడుకో" అంటూ చెప్పి తన గదిలోకెళ్లిపోయాడు ప్రసాదరావు.

"నువ్వే పన్నెండు గంటలకు తింటే ఇక మొగుడికెప్పుడు పెడతావు భోజనం?" అన్నపూర్ణ అడిగింది కూతుర్ని.

"తెల్లవారుజామున నిద్రలేపి పెడతాగానీ ఇంతకీ ఏం కూర వండావ్ మమ్మీ?" స్పందన అడిగింది తల్లిని.

"దోసకాయ పప్పు" చెప్పింది అన్నపూర్ణ.

స్పందన ముఖం అదోలా పెట్టి "అమ్మా! ఆ దోసకాయలమ్మేవాడు ఉదయం ఈ వీధి గుండా ఎన్ని గంటలకు పోతాడు?" అడిగింది తల్లిని.

"ఎందుకే?" అడిగింది.

"మర్డర్ చెయ్యడానికి" చెప్పింది స్పందన.

★ ★ ★

"గుడ్‌మార్నింగ్ స్పందనగారూ!" వేణు స్పందనని పలకరించాడు.

అప్పుడు సమయం ఉదయం ఏడు గంటలవుతోంది. స్పందన క్లాస్‌మేట్ వేణు. స్పందనంటే వేణుకి చాలా ఇష్టం. పొద్దున్నే

స్పందన ముఖాన్ని దర్శించుకోనిదే వేణుకి తృప్తి ఉండదు. క్వార్టర్ టు సెవన్‌కల్లా వేణు, స్పందన కోసం చౌరస్తా దగ్గర కాపు వేసి స్పందన వచ్చాక ఆమెని కంప్యూటర్ సెంటర్‌దాకా వెంబడిస్తాడు.

కానీ వేణంటే స్పందనకు అసహ్యం. చదువు మానేసి ఇలా పోకిరీల మాదిరి తిరిగే వాళ్లంటే ఆమెకు ఇష్టం ఉండదు. దానికి తోడు స్పందన ఎటువంటి విషయమైనా తొందరగా రియాక్టవుతుంది. చాలా సెన్సిటివ్.

"మొదలైందా కాకిగోల. నువ్వు కనపడక పోతే కనీసం ఈ రోజైనా హాయిగా కంప్యూటర్ క్లాసుకి వెళ్దామనుకున్నాను. ప్చ్!" నిట్టూర్చుతూ అంది.

"సూర్యుడయినా తన డ్యూటీకి లేటవచ్చేమోకానీ నేను మాత్రం ఠంచనుగా నా దేవి కోసం హాజరవుతాను" అన్నాడు వేణు.

"ఈ శ్రద్ధ చదువుపై చూపిస్తే బాగుపడతావేమో ఒకసారి ఆలోచించు. కనీసం నీ తల్లితండ్రులు నీపై పెట్టుకున్న ఆశల్ని నిజం చేసిన వాడివి అవుతావు" చెప్పింది స్పందన.

"నిన్ను కళ్లనిండా చూసుకుని తృప్తి చెందడమే నాకు ఆనందాన్ని మిగుల్చుతుంది స్పందనా! రియల్లీ... నువ్వు తప్ప నాకు ఏ విషయం ముఖ్యంకాదు. నా చదువూ చివరికి నా పేరెంట్స్ కూడా" వేణు గొంతులో ఆవేశం...

"షటప్... బాధ్యతల్ని మరచిన నీలాంటి వాళ్లంటే నాకు పరమ అసహ్యం కృతఘ్నుడా! నీ పేరెంట్స్‌కన్నా నేను గొప్ప అని చెప్పడానికి నీకు సిగ్గనిపించడంలేదూ? ఈ విషయం నీ తల్లిదండ్రులు కనుక విని ఉంటే నీలాంటి కొడుకుని కన్నందుకు వాళ్లు తప్పకుండా సిగ్గుపడతారు" ఆవేశంగా చెప్పింది స్పందన.

"పోనీ నీ హృదయం గెల్చుకోడానికి నన్నేం చెయ్యమంటావో చెప్పు?" అన్నాడు వేణు స్పందనని బతిమాలుతూ,

"నా హృదయాన్ని గెల్చుకోవడం తర్వాత ముందు నీ హృదయాన్ని నీ స్వాధీనంలో ఉంచుకో" సలహా ఇచ్చింది స్పందన.

కొంచెం తలనొప్పిగా అనిపిస్తోందామెకు. ఏమిటీ న్యూసెన్స్? అనుకుందామె.

"దిస్ ఈజ్ టూమచ్ స్పందనా! నా క్లాస్‌మేట్‌వని నువ్వంటే నేను గౌరవిస్తాను. అంతకుమించి నువ్వంటే ఎంతో ప్రేమ నాకు. స్పందనా! నీవు నమ్ముతావో లేదో కానీ నీ ప్రేమని పొందడానికి ఏం చెయ్యడానికైనా నేను తయారుగా ఉన్నాను" అన్నాడు వేణు.

ఎప్పటికైనా తనని, తన ప్రేమని కనికరించకపోతుందా అని మనసులో వేణుకి ఆశగా ఉంది. ఏవిధంగానైనా స్పందన మనసుని గెల్చుకోవడానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడతను. స్పందన నాజూకైన అందం, ఆమె రెక్లెస్‌నెస్ అంటే వేణుకి చాలా ఇష్టం. కానీ ఇలా వన్‌వే లవ్ ఎన్నాళ్లు? ఎంతో అసహనంగా ఉందతనికి. అతని మాటల్నిబట్టి చూస్తుంటే తన ప్రేమ విషయం ఏదో ఒకటి ఈ రోజు తేల్చుకోవాలని నిర్ణయించుకున్నట్టు కనిపిస్తోంది.

"ఏమీ చెయ్యొద్దు. నా వెంటపడి ఇలా నన్ను వేధించకుండా ఉన్నావంటే నీకే ఎంతో రుణపడి వుంటాను నేను" చెప్పింది స్పందన.

"అది మాత్రం అడగొద్దు. అన్నం, నీళ్లయినా మానేస్తాకానీ నిన్ను చూడకుండా ఉండమంటే మాత్రం కుదరదు" అన్నాడు వేణు.

స్పందనలో విసుగు, అసహనం ప్రవేశించాయి. కంప్యూటర్ సెంటర్ దగ్గరవుతోంది.

"ఒక పని చెయ్యి.. అప్పుడు నీ ప్రేమని అంగీకరించి నిన్ను ప్రేమించడం మొదలు పెడతాను" చెప్పింది.

సంతోషంతో ఉబ్బితబ్బిబ్బయ్యాడు వేణు.




ఆనందం పట్టలేక "ఎ... ఏం చెయ్యమంటావు? " అడిగాడు.

ఆకాశం అందుకున్నట్టుంది అతనికి. స్పందన చెప్పింది నమ్మలేకపోతున్నాడు, నిజంగానా?

"అదే... ఇందాక నువ్వే అన్నావుగా. అన్నం తినడం, నీళ్లు తాగడం మానెయ్యి అప్పుడు నిన్ను ప్రేమిస్తాను" చెప్పింది స్పందన.

"అంటే ఏమిటి నీ ఉద్దేశం? " స్పందన అడిగిందాంట్లో ఏదో తిరకాసుందనిపించిందతనికి.

"ఏముంది? తిండి మానేస్తే కొన్నాళ్లకు చచ్చి ఊరుకుంటావు. కనీసం అప్పుడు నీ పీడ తప్పుతుందిగా నాకు" అంది కోపంగా.

"స్పందనా" కేకవేసినంత పన్జేశాడు వేణు.

తన ప్రేమని తిరస్కరించి విసురుగా వెళ్లిపోతున్న స్పందనవైపు అచేతనంగా చూస్తుండిపోయాడు వేణు.

"హాయ్ స్పందనా" ఫ్రెండ్ మాలతి విష్ చేసింది.

"హాయ్" జవాబిచ్చింది ముక్తసరిగా.

"అమ్మాయిగారు ఈ రోజు చాలా బిజీగా ఉన్నట్టుందే" రేవతి అడిగింది.

"అదేమీలేదు" చెప్పింది స్పందన.

"కూడా ఎవరో ఉన్నారు. బాయ్‌ఫ్రెండా? ' ' రేవతి ప్రశ్నలో క్యూరియాసిటీ.

"నీకా? " అడిగింది.

"యూ డెవిల్... నీ గురించి చెప్తుంటే నన్నడుగుతావేం? " ప్రశ్నించింది రేవతి.

"ఇప్పుడు నేనేమడిగాను? బాయ్‌ఫ్రెండ్ ప్రస్తావన తెచ్చింది నువ్వేగా"

"మహా తల్లీ! మాటల్తో నిన్ను గెలవడం కష్టం సుమా" అంది రేవతి.

"అంత సీన్లేదుకానీ లోపలికి నడు... వట్టి మాటల్తో సరిపెట్టుకోడమేనా? " అంది స్పందన.

"స్పందనా! సాయంత్రం నీ ప్రోగ్రామేంటి? " మాలతి అడిగింది.

"నా ప్రోగ్రాం ఏమీలేదు కానీ నీవనుకుంటున్న ప్రోగ్రామేంటో చెప్పు? "

"సంగీత్‌లో సిక్స్‌సెన్స్ చూడాలనుకుంటున్నాం. మన ఇండియన్ డైరెక్టరట. నాలుగ్గంటలకు షో. రేవతి, పద్మ, లేఖ వస్తున్నారు. నువ్వు రెడీ అంటే నీ కాల్షీటు బుక్ చేస్తాం" సినిమా భాషలో చెప్పింది.

"నన్నొదిలెయ్యండి. సాయంత్రం నాకు వేరే పనుంది" చెప్పింది.

"నువ్వేమనుకోకపోతే ఆ పనేంటో నేను తెలుసుకోవచ్చా? "

"వైనాట్? ఫెమినిస్టు రూపాదేవి గారిని కలవాలి"

"ఫెమినిస్టా? ఆవిడతో నీకేం పని? "

"డేటా తయారు చెయ్యటంలో అసిస్ట్ చెయ్యాలి"

"దేనిగురించి? "

"క్రైమ్ ఎగెయిన్స్ట్‌ విమెన్"

★ ★ ★

"గుడీవినింగ్ మేడమ్" రూపాదేవిని విష్ చేసింది స్పందన.

"గుడీవినింగ్... కమ్ కమ్" స్పందనని ఆహ్వానించి కూర్చోమని చెప్పిందామె.

"పురుషాధిక్య సమాజంలో స్త్రీ మనుగడ... ఈ అంశంపై మీరు చేసిన ప్రసంగం నన్నెంతగానో ఇంప్రెస్ చేసింది మేడం. నిజంగా ఆ రోజు రాత్రంతా మీ గురించే ఆలోచిస్తూ ఉండిపోయాను" చెప్పింది స్పందన.

"నా గురించా... నా ప్రసంగం గురించా? " రూపాదేవి అడిగింది నవ్వుతూ.

"మీరు చేసిన ప్రసంగం గురించి అనబోయి మీ గురించి అన్నాను. అయామ్ సారీ" నవ్వుతూ చెప్పింది స్పందన.

"ఇట్స్ ఓకే. ఇప్పుడు మీరేం చేస్తున్నారు? ఐ మీన్ స్టడీయా? లేక జాబ్ చేస్తున్నారా? " రూపాదేవి అడిగింది.

రూపాదేవికి సుమారు నలభై ఏళ్లుం

టాయి. జీన్స్‌పాంట్, సన్నటిగీతల లూజు షర్టు ధరించింది. హెయిర్‌కట్‌తో మోడర్న్‌గా ఉందామె.

స్పందన తన పంజాబీడ్రెస్‌ని ఒకసారి చూసుకుని 'గ్రాడ్యుయేషన్ కంప్లీటైంది. కంప్యూటర్ క్లాసులకు వెళ్తున్నాను. కాంపిటీటివ్ ఎగ్జామ్స్‌కు ప్రిపేరవుతున్నాను పి.జి. కూడా చెయ్యాలని ఉంది" చెప్పింది.

"వెరీగుడ్. కీపిటప్! స్వావలంబన అనేది ప్రతీ స్త్రీ సాధించాల్సిన విషయం. కానీ మనలాంటి పేద దేశంలో ఎంతమంది స్త్రీలు తాము కోరుకున్నది చెయ్యగలుగుతున్నారు? తామనుకుంటున్నది సాధించగలుగుతున్నారు? మీరు చెప్పగలరా?" అడిగింది రూపాదేవి.

"మీరు చెప్పింది నిజమే మేడమ్. పేదరికం సమాజం యొక్క అభివృద్ధికి శాపం లాంటిది" చెప్పింది స్పందన.

"కానీ జరుగుతున్నదేమిటి? మధ్యతరగతి, దిగువ మధ్య తరగతి కుటుంబాల్లో స్త్రీ హక్కులు దారుణంగా ఎక్స్‌ప్లాయిట్ చెయ్యబడుతున్నాయి. స్త్రీని ఓ చాకిరీ చేసే బానిసగా, ఏవిధమైన హక్కులూ లేని ఓ బాండెడ్ స్లేవ్‌గా చూడటం జరుగుతోంది. ప్రస్తుత సమస్య సంపన్న వర్గాల గురించి కాదు. గ్రామాల్లో ఇప్పటికీ అవేర్‌నెస్ రాలేదు.

ఆడపిల్లకు చదువెందుకంటారక్కడ. పెళ్లి చెయ్యక తప్పదు. ఎంత చదివించీ లాభమేంటి? అంటారు.

సో ప్రాపర్ ఎడ్యుకేషన్ లేకపోవడం... తినడానికి తిండి, ఉండటానికి గూడు, బట్టలు ఉన్న తర్వాతేకదా చదువు గురించి మనిషి ఆలోచించేది. మళ్లీ ఆ చదువులోనూ లింగ వివక్షత. ఆడపిల్ల టెన్త్‌వరకు చదివితే చాలంటారు. మగపిల్లవాణ్ణి కాలేజీలో చేర్పిస్తారు. వాడేదో చదివి సాధించి తమ కుటుంబాన్ని ఉద్ధరిస్తాడని. కానీ జరిగేదేమిటి? చెడు సావాసాలు చేసి అల్లరి చిల్లరగా తిరగడం, ఆడపిల్లల్ని ఏడిపించడం... రాగింగ్ వగైరాలు ఇవీ ఆ మగపిల్లవాడు చేసే నిర్వాకాలు.

అదే ఆడపిల్లలైతే ఎంత బుద్ధిగా చదువుకుంటారు! ఎంత బాధ్యతగా ప్రవర్తిస్తారు. ఆ తర్వాత డౌరీ ప్రాబ్లమ్. అసలు కట్నమివ్వడమేంటి? నాకు ఇప్పటిదాకా అర్థం కాని విషయమిది. ఏం? పెళ్లి అనేది స్త్రీ ఒక్కదాని అవసరమేనా? మగవాడికి పెళ్లి అవసరం లేదా? అదొక బయోలాజికల్ నీడ్. సృష్టిలో జీవరాశంతటికీ సెక్స్ అవసరముంటుంది. అప్పుడెప్పుడో జమిందారీ వంశాల్లో తమ ఆడపిల్లని పెళ్లి చేసి అత్తవారింటికి సాగనంపేటప్పుడు సంతోషంగా అవిఇవీ ఇచ్చి పంపేవారట. ఓకే! దానికి ఓ రీజనిం గుంది. కానీ ప్రస్తుతం పెళ్లి పేరిట జరుగుతున్నదేమిటి? పేదరికంలో మగ్గుతున్న ఆడపిల్లల తల్లిదండ్రులు ఈ భూమ్మీదే నరకాన్ని చవిచూస్తున్నారు. వరుల గొంతెమ్మ కోరికలు తీర్చలేక, వయసులో ఉన్న తమ కూతుళ్ల పెళ్లిళ్లు చెయ్యలేక భరింపశక్యం కాని మానసిక క్షోభని అనుభవిస్తున్నారు.

ఓ పవిత్రమైన పని వరకట్న ప్రవేశంతో వ్యాపారమైపోయింది. నిజానికి ఈ పెళ్లికొడుకులకు సిగ్గూలజ్జా రెండూ లేవు. లేకపోతే ఆడది తీసుకొచ్చే సొమ్ముకై ఎందుకు ఆశపడతారు? పోనీ వరకట్నమిచ్చాక సంసారం సవ్యంగా సాగుతుందా అంటే అదీలేదు. మళ్లీ ఎక్స్‌ట్రా డౌరీ కోసం, ఇతర వస్తువుల కోసం ఆడపిల్లని వేధించడం, కిరసనాయిలు పోసి చంపటం, ఈవిధంగా చెప్పుకుంటూ పోతే స్త్రీల కష్టాల గురించి ఓ పెద్ద గ్రంథమే తయారవుతుంది. అందువలన నేను చెప్పేదేమిటంటే..." కాసేపాగింది రూపాదేవి.

రూపాదేవి చెబుతోంది ఎంతో ఆసక్తిగా వింటోంది స్పందన. టీ, బిస్కెట్స్ టేబుల్‌పై అమర్చి వెళ్లింది పనిమనిషి.

"తీసుకోండి" రూపాదేవి బిస్కెట్స్ తిన





మంటూ స్పందనతో అంది.

ఒక బిస్కెట్ తీసుకుని కొరుకుతూ ఆ హాలంతా పరిశీలనగా చూసింది స్పందన. అంగ్‌సాన్‌సూకి, రవీంద్రనాథ్‌టాగూర్ చిత్ర పటాలు, ఇంకా ఓ కేప్షన్ "If you have a lot of time to waste, Dont waste here" అని రాయబడి ఉన్న బోర్డు ఉన్నాయి. ఆ కేప్షన్ చదివి ఉలిక్కి పడింది స్పందన.

టీ చప్పరిస్తూ రూపాదేవి వైపు తిరిగి, "మేడమ్ మీరు చెప్పడం ఆపేశారు" అంది.

రూపాదేవి గుర్తు తెచ్చుకుంటూ "ఆc కాబట్టి ఏమిటంటే మనం స్త్రీయొక్క స్వేచ్ఛ, స్వాతంత్ర్యాల కోసం ఉద్యమించాలి. చదువు యొక్క ప్రాముఖ్యత గురించి స్త్రీలకు తెలియజెప్పాలి. స్త్రీలు ఆత్మవిశ్వాసంతో తమ కాళ్లపై తాము నిలబడగలిగేట్టు వారిని చెయ్యగలగాలి.

భర్త అంటే మగవాడి సంపాదనపై అతని దయాదాక్షిణ్యాలపై ఆధారపడుతూ ఓ పేరసైట్‌లా, వ్యక్తిత్వం కోల్పోయిన బానిసలా స్త్రీ ఎప్పటికీ జీవితం వెళ్లదీయకూడదు. స్పందనా మీకు తెలుసా? ఇప్పటికే తన అజ్ఞానం వల్ల, భయంవల్ల పురుషానుకూలంగా తయారు చెయ్యబడ్డ ఈ సామాజిక కట్టుబాట్లవల్ల స్త్రీ ఎంతో నష్టపోయింది. కానీ జరిగిపోయిన దాని గురించి మనం బాధపడి ప్రయోజనం లేదు. జరగవలసిందేమిటో చూడాలి.

ధైర్యంగా మనమంతా పురుషుల దౌర్జన్యాన్ని, పురుషాహంకారాన్ని ఎదుర్కోవాలి. చట్టసభల్లో స్త్రీల ప్రాముఖ్యాన్ని ఇంకా పెంచాలి. ఉద్యోగాలు చేసే స్త్రీలపై తోటి మగ ఉద్యోగుల లైంగిక వేధింపులు అరికట్టడానికి ఓ ప్రత్యేక చట్టం రూపొందాలి. ఇవన్నీ మనం చెయ్యాలంటే మనలో సంఘీభావం కావాలి.

అభ్యుదయ భావాలు కలిగి, స్త్రీ విమోచన కోసం, చదువుకున్న మనమంతా ఒక వేదిక పైకి రావాలి. తోటి మహిళల కోసం, వారి హక్కులకోసం మనం నిరంతరం పోరాడాలి. మహిళల్లో అవేర్‌నెస్ తీసుకుని రావాలి. మాటిమాటికీ సిగ్గుపడటం, ఇన్‌ఫీరియర్‌గా ఫీలవడం, తలవంచుకుని నడవడం, నంగి మాటలు మాట్లాడ్డం, ప్రతీదానికి భయపడటం ఇటువంటి దుర్లక్షణాల్ని స్త్రీలు వెంటనే మానెయ్యాలి. ఇటువంటివి ఏ చదువుకోని మహిళలో చేస్తే ఫరవాలేదు. కానీ మన దురదృష్టం చూడండి. ఎంతో క్వాలిఫైడ్ అయిన స్త్రీలే ఈవిధంగా ప్రవర్తిస్తే ఎలా చెప్పండి?

అంతేకాదు. అండర్‌టెన్ వయసున్న బాలికలపై అత్యాచారాలీ మధ్య మితిమీరి పోయాయి. చదువుకునే అమ్మాయిల్ని రోడ్లపై, కాలేజీల్లో వేధించడం ఎక్కువైంది. స్త్రీని సినిమాల్లోనూ అడ్వర్‌టైజ్‌మెంట్లలోనూ ఓ వ్యాపారాభివృద్ధి సాధనంగా వాడుతున్నారు. ఈ సమస్యలన్నింటినీ సమర్థవంతంగా ఎదుర్కోవడంకోసం మనం ఉద్యమించాలి. స్త్రీ అంటే అబలకాదు సబల అని, స్త్రీ తననితాను నిరూపించుకునే విధంగా స్త్రీయొక్క వ్యక్తిత్వం, స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలకోసం మనం కలసికట్టుగా పోరాడాలి. దీనిపై మీ అభిప్రాయం ఏమిటి? నేను చెప్పింది ఐ మీన్ నా ఒపీనియన్ తప్పంటారా? " నుదుటిపైపడ్డ జుట్టుని వెనక్కితోస్తూ స్పందన ఫీలింగ్స్ కోసం చూస్తూ అడిగింది రూపాదేవి.

"మీరు చెప్పింది అక్షర సత్యం రూపాదేవిగారూ! అఫ్‌కోర్స్! నేను సైతం ఈ అనుభవాల్ని ఎదుర్కొన్నాను. నూటికి నూరుశాతం మీరు ఫాక్ట్ మాట్లాడారు. మీ అభిప్రాయాన్ని నేను గౌరవిస్తాను" కించిత్ ఉద్వేగంతో చెప్పింది స్పందన.

"రూపాదేవిగారూ నాకో డౌటు. స్త్రీలు అన్నివిధాలా ఎక్స్‌ప్లాయిట్ చెయ్యబడుతున్నారన్నది జగమెరిగిన సత్యం. మరి దానీ కోసం మాట్లాడితే ఫెమినిజం అంటూ ఫెమి

నిస్టంటూ ఒక లిమిటెడ్ వాదం కింద జమ కట్టి తీసి పడేస్తారేమిటి? ఎవ్విరిబడీ రీడ్స్ ద పేపర్, గోత్రూ ద ఇన్సిడెన్ట్స్. అయినా కూడా స్త్రీ సమస్యలంటే ఇంత చిన్న చూపెందుకు?" స్పందన ప్రశ్నలో ఆవేశం.

"ఎస్ మంచి ప్రశ్న అడిగారు. తెలుసు... అందరికీ తెలుసు స్త్రీలు వంచనకు గురవుతున్నారని, దారుణంగా హింసింపబడుతున్నారని. కానీ ఇక్కడ కూడా పురుషుడే గెలుస్తున్నాడు. ఒక ప్లానింగ్ ప్రకారం స్త్రీ సమస్యల్ని పురుషుడు మరుగున పడవేస్తున్నాడు. తన డామినేషన్‌తో సమస్యని తొక్కిపెట్టి హక్కులకోసం ఎలుగెత్తిన స్త్రీ సమాజానికి ఒక ఇజాన్ని అంటగట్టింది పురుషుడే. ఇలా స్త్రీ హక్కుల్ని అడుగడుగునా కాలరాస్తూ తన కుళ్ల మనస్తత్వాన్ని, దౌర్జన్యాన్ని, అహంకారాన్ని పురుషుడు నిరూపించుకుంటున్నాడు. ఒక్కోసారి విసుగొచ్చినపుడు ఈ మగవాళ్లందర్నీ కాల్చి పడెయ్యాలనిపిస్తుంది నాకు. నిజం స్పందనా. అరె అసలు వీళ్లు తినేది అన్నమేనా? అన్నం కాదేమో అని నాకనిపిస్తుంది. లేకపోతే ముక్కుపచ్చలారని రెండేళ్ల, మూడేళ్ల పసికందుల్ని రేప్ ఎలా చెయ్యగలుగుతారు? ఎలా మనసొప్పుతుంది?" రూపాదేవి మాటల్లో స్త్రీలపట్ల వేదన, ఆక్రోశాలు వ్యక్తమయ్యాయి.

"అవునండి, ఇట్స్ ఇన్‌హ్యూమన్! బ్రూటాలిటీ! పాపం! మనిషి యొక్క జీవించే హక్కుని కాలరాయడం" బాధపడింది స్పందన.

"రూపాదేవిగారూ మీరేం అనుకోకపోతే ఓ ప్రశ్నడుగుతాను. మీకు పెళ్లయిందా? మీ హజ్బెండేం చేస్తారు? మీకెంతమంది పిల్లలు?" స్పందన అడిగింది.

"అదేం అలా అడిగారు? నా భర్త కెనడాలో ఉన్నారు. అమ్మాయి ప్రగతి ఐ.ఐ.టి ఢిల్లీ" చెప్పింది రూపాదేవి.

"అయితే మీరు ఒంటరిగా ఉంటున్నారా?"

"అక్కడే మీరు తప్పుగా మాట్లాడుతున్నారు. ఒంటరితనం ఏమిటి? మీరు ఒంటరికాదా? అసలు ఈ క్రియేషన్లో ఒంటరిగా లేనిదెవరు? ఒక విషయం మీరు మరచిపోవద్దు. మనిషి ఎప్పుడైతే ఏ పనీపాటా లేకుండా ఖాళీగా ఉంటాడో అప్పుడు మాత్రమే అతనికి ఒంటరితనం... అంటే తన గురించి బెంగపడడం మొదలవుతుంది. అందుకే మనిషి తన తుదిశ్వాస దాకా బిజీగా ఉండాలి. ఏదో ఒక వ్యాపకం కల్పించుకోవాలి. వర్క్ ఈజ్ వర్‌షిప్, డ్యూటీ ఈజ్ డివైన్ అని ఊరికే అన్నారా?" చెప్పిందామె.

"ఎబ్సల్యూట్లీ యువ్వార్ సచెవుమన్, వన్ హూ డిజైర్స్‌టు అడ్మయిర్" మెచ్చుకుంటూ అంది స్పందన.

"మాటలు తర్వాత ముందు ఈ ఫైలు తీసుకోండి. ఇందులో క్లాసిఫికేషన్ వైజ్‌గా ఇన్ఫర్మేషనుంది" ఫైలొకటి స్పందనకిస్తూ చెప్పింది రూపాదేవి.

'వాటీజిట్' అని మనసులో అనుకుంటూ ఫైలు తెరచింది రూపాదేవి.

1) NO. OF INFANTICIDES REPORTED BY PUBLIC

2) NO. OF CHILD RAPE CASES REPORTED DURING THE YEAR

3) NO. OF EVE TEASING AND RAGGING CASES

4) NO. OF DOWRY HARASSMENT CASES, DOWRY DEATHS

5) SEXUAL HARASSMENT CASES OCCURED AT PUBLIC PRIVATE SECTOR OFFICES

"మిస్ స్పందనా" అంటూ ఏం చెయ్యాలో డైరెక్షన్ ఇవ్వసాగింది రూపాదేవి.

తలూపింది స్పందన.

★ ★ ★

కసాటా ఐస్‌క్రీమ్ బర్గర్స్ షాప్.

మాలతి, రేవతి, లేఖ, స్పందన ఓ టే

బుల్ వద్ద ఎదురెదురుగా కూర్చున్నారు.

"చెప్పండే ఎవరెవరికి ఏమేం కావాలో? " రేవతి మిగతా ముగ్గుర్నీ అడిగింది.

"నాకు మేంగోఫ్లేవర్" మాలతి అంది

"నా ఛాయిస్ వెనీలా" రేవతంది.

"మరి నీకు" లేఖని అడిగింది రేవతి.

"నాకేమో ఓ రెండు వెజ్ బర్గర్లు, ఓ కోక్, ఓ కసాటా" చెప్పింది లేఖ.

"ఇంకా నయం. ఓ డజను కర్రీపఫ్స్, ఒక కిలో పచ్చిమిరపకాయలొద్దా? " ఎత్తి పొడుపుగా రేవతనేసరికి అంతా గొల్లుమన్నారు.

లేఖ ముఖం చిన్నబుచ్చుకుంది.

"లేకపోతే చూడవే ఏదో ఫార్మాలిటీ కోసం ఏ ఐస్క్రీమో లేక ఏ కూల్డ్రింకో అడిగితే ఓ పద్ధతిగా ఉంటుంది. ఇదేమన్నా నా ఎంగేజ్‌మెంటు ఫంక్షనా లేక నా పెళ్లా? అడిగేదానికి ఓ హద్దుంటుంది" అంది రేవతి చిరుకోపంతో.

"మరి అంతదానికి పెద్ద టెక్కుతో ఎవరెవరికి ఏమేం కావాలని ఎందుకడిగావు?" లేఖ నిలదీసింది.

"ఇది మరీ బాగుంది. ఇప్పించే వాళ్లున్నారుకదాని తాజ్‌మహల్ కావాలని అడిగితే ఎలా ఉంటుంది? " అంది రేవతి.

"అంత బిల్డప్ ఇవ్వకు. కోక్, కసాటాలు ఇప్పించలేని దానివి తాజ్‌మహల్ కాదు కదా దాని నీడని కూడా నువ్వు కొనలేవు ఊర్కో" బదులు తీర్చుకుంది లేఖ.

"ఇక చాలు ఆపండి. బిల్ నే పే చేస్తాను. ఎవరెవరికి ఏం కావాలో ఆర్డరివ్వండి" స్పందన చెప్పింది.

"నాకు ఒక కోక్ చాలు" చెప్పింది లేఖ.

"చూశావా? స్పందన బిల్లు పే చేస్తాననే సరికి తన డిమాండ్స్‌లో కోత విధించుకుంది. ఏం పాపం! నా డబ్బులు తేరగా వచ్చాయా? " అడిగింది రేవతి.

"కాదులేవే, మీ నాన్న సేల్‌టాక్స్ ఆఫీసరని అడిగుంటుంది" మాలతి అనేసరికి మిగతా ముగ్గురూ నవ్వారు.

"అవునూ మొన్న ఏదో ఇంగ్లిష్ మూవీకి వెళ్లాలన్నారుగా. చూశారా? ఎలా ఉంది మూవీ? " స్పందన అడిగింది.

"ఇట్సెక్లాసిక్" రేవతి చెప్పింది.

"క్లాసిక్కా గాడిదగుడ్డా... దరిద్రపు సినిమా ఏవో ఆత్మలూ, దయ్యాలూ... వట్టి బోర్. భరించలేక చచ్చామనుకో" లేఖ అంది.

"ఊర్కోవే ఇంగ్లీష్ మూవీని అర్థం చేసుకునేంత అవగాహన నీకెక్కడుంది? ఆ పిల్లవాడు ముఖ్యంగా ఎంతో మెచ్యూరిటీని ఎక్స్‌ప్రెస్ చేశాడు. ఏదో పేరుందే ఆ పిల్లవాడిది... హేలీ ఓస్మెంటో ఏదో ఉంది మొత్తానికి, కానీ భలే చేశాడే యాక్టింగ్.

ముఖ్యంగా బ్రూస్‌విలీస్. నాకు తెలిసినంతవరకూ భావరహితంగా, సీరియస్‌గా యాక్టింగ్ చేసేవాళ్లలో అతనికెవరూ సాటి రారు. వాటెమూవీ" మాలతి తన అభిప్రాయం వెలిబుచ్చింది.

"అలాగా... అంత సీను కనబడిందా నీకా చెత్త సినిమాలో? " లేఖ ఎగతాళిగా అంది మాలతిని.

"దీనికేం తెలుసే ఇంగ్లీషు సినిమా గొప్పతనం. తినడం తప్ప దీనికేమీ చేతకాదు" రేవతి లేఖ నుద్దేశించి చెప్పింది.

"ఇక లాభంలేదు ఆ సిక్స్త్‌సెన్స్ డైరెక్టర్ మనోజ్‌శ్యామలన్తో మాట్లాడి నీ పెళ్లి కుదిరిస్తా" లేఖ అంది.

"అంతొద్దులే శ్యామలన్‌కి ఆల్రెడీ పెళ్లయి పిల్లలు కూడా పుట్టారు" రేవతి చెప్పింది.

"నిజమా? ఎక్కడైనా మగవాళ్లకి పిల్లలు పుడతారా? " లేఖ అడిగింది నవ్వుతూ.

"యూ..." లేఖని కొట్టబోయింది రేవతి ఉక్రోషంగా.

"ఇక చాలించండే మీ గొడవ. మొత్తానికి సినిమా బాగుందంటారు అంతేకదా!" స్పందన చెప్పింది.

అవునంటూ తలూపారు.

"అవునూ స్పందనా ఎవరో ఫెమినిస్టు



రూపాదేవిగారిని కలవాలన్నావుగా. కలిశావా?" రేవతి అడిగింది.

"ఫెమినిస్టు అనవద్దు. షిఈజె గ్రేట్ లేడీ. ఎ గ్రేట్ వుమన్" తలెత్తి పైకి సాలోచనగా చూస్తూ గర్వంగా చెప్పింది స్పందన.

"ఏం చెప్పిందావిడ?" అడిగింది లేఖ.

"ఫెమినిస్టంటే ఏమిటే?" రేవతి అడిగింది.

"రూపాదేవి నిన్ను బాగా ఇన్స్పైర్ చేసినట్టుందే. తెగ పొగిడేస్తున్నావ్" అంది మాలతి.

స్పందన కాసేపు ఆలోచించి "స్త్రీల హక్కుల గురించి, స్త్రీ సమానత్వం గురించి పోరాడే వాళ్లని ఫెమినిస్టంటారు" అంది.

"ఇప్పుడు స్త్రీ హక్కులకొచ్చిన నష్టమేమిటంట? బాయ్‌ఫ్రెండ్స్ వెంట జామ్మని యమహా బైక్‌లపై దూసుకెళ్తున్నారు కాలేజీ చదువు నటిస్తున్న టీనేజి అమ్మాయిలు. యు బికేమ్ టూ సెన్సిటివ్ స్పందనా" అంది రేవతి.

"అవునే... ఎవరో ఏదో అయిపోతే మనకేంటి? మన ఎంజాయ్‌మెంటు మనం చూస్కోవాలి. మనం కావాలనుకున్నా ఈ వయసు మనకు మళ్లీమళ్లీ రాదుగా" చెప్పింది లేఖ.

"ఆ రూపాదేవిని మళ్లీ కలవకే బాబూ! ఐ థింక్ జీవితంలో పురుషుల చేత మోసగింపబడినవాళ్లు ఆ విధంగా తయారవుతారేమో! నీకేం తక్కువని? ఎందుకు మోయలేని బరువుని తలపై మోస్తావు?"

"ఫ్రస్ట్రేట్ అయిన వారితో నీకు ఫ్రెండ్‌షిప్ ఎందుకు చెప్పు?" సలహా ఇచ్చింది మాలతి.

తన స్నేహితురాళ్ల మాటలతో అరికాలి మంట నెత్తికెక్కింది స్పందనకు.

"మీరు చేసే పనులు చూస్తుంటే ఇప్పటి వరకూ మీకు వేపకాయంత వెర్రేమన్నా ఉందేమో అనుకునేదాన్ని. కాదు ముమ్మాటికీ కాదు. నేనే మీ గురించి పొరబడి మిమ్మల్ని తప్పుగా అర్థం చేసుకున్నాను. వెర్రికాదే... పిచ్చిపట్టింది మీ అందరికీ. నిజంగా పిచ్చిపట్టింది.

"నేను సంతోషంగా ఉంటే అందరూ సంతోషంగా ఉన్నట్టే అని మీరనుకుంటున్నారు. అలాక్కాదే. మనం ఈ నేలపై పుట్టినందుకు ఏదో ఒకటి సాధించి తీరాలి. ఒక పటిష్టమైన లక్ష్యాన్ని ఏర్పరచుకోవాలి. మనిషిగా జన్మనెత్తినందుకు మన జీవితాల్ని సార్థకం చేస్కోవాలి. వుయ్‌మస్ట్ ఎఛీవ్ సమ్‌థింగ్ డిఫరెంట్ యార్. మీ సంగతే మోగానీ నేను మటుకు స్త్రీ వంచనపై పురుషుల సమాజమ్మీద దండయాత్ర ప్రకటించబోతున్నాను. పురుషద్వేషిగా రూపాంతరం చెందబోతున్నాను. ఎస్ ఇట్స్ మై అల్టిమేట్ డెసిషన్"

స్పందన ఆవేశంగా చెబుతుండగా ఆమె ముఖం ఎరుపెక్కడం గమనించారు ముగ్గురూ.

"దీనికేదో అయింది" అంటూ వారంతా తల పట్టుక్కూర్చున్నారు.

"దీన్ని ఆ దేవుడు తప్ప మనుషులు బాగు చెయ్యలేరు" అంది రేవతి.

"కానీ నాకో డౌటొస్తోందే... స్పందన మాటలకు అర్థం లేదేమో అని నాకనిపిస్తోంది. స్త్రీ సమానత్వం గురించి పోరాడ్డం కోసం పురుషద్వేషిగా మారాల్సిన అవసరమేంటి?" మాలతి చెప్పింది.

వారు చెప్పుకుంటున్నది విన్పించుకోకుండా విసవిసా నడుచుకుంటూ వెళ్లిపోయింది స్పందన. ఈ హఠాత్పరిణామానికి విస్తుపోయారు వారంతా.

"దీన్నే హాఫ్ నాలెడ్జ్ అంటారు" అంది లేఖ.

"కొండ నాలిక్కి మందేస్తే ఉన్న నాలిక ఊడిపోవడమంటే ఇదేనేమో" అంది రేవతి.

"ఏమైంది స్పందనకు? ఉన్నట్టుండి ఎమోషనలైపోయిందేంటి? బహుశా ఇది ఆ రూపాదేవి మహిమనుకుంటా"




"ఆ... తెల్లవారితే అంతాసర్దుకుంటుంది"

"రేపు ఉదయం కంప్యూటర్ క్లాసుకొస్తుం దికదా. అప్పుడు చూద్దాం" ఈవిధంగా తలోక అభిప్రాయాన్ని చెప్పుకున్నారు.

★ ★ ★

షాన్‌బాగ్ హోటల్, బషీర్‌బాగ్... సమయం సాయంత్రం అయిదు గంటలు.

"ఆర్యూ ఓకే? " ముగ్గురూ స్పందనతో అన్నారు.

"దేని గురించి? " పద్మ అడిగింది. మొత్తం అయిదుగురూ వరుసగా కూర్చు న్నారు.

"నీకు తెలీదులే. నిన్న మా మధ్య ఓ ఆస క్తికరమైన విషయం గురించి వాగ్వివాదం జరిగింది" అన్నారు ముగ్గురూ.

"అదేమోకానీ నేనొక సర్‌ప్రయిజ్ నివ్వ బోతున్నాను" అంది పద్మ.

"రియల్లీ! ఏంటో చెప్పవే"

"మీ అందరికీ నా తరపున కేరట్‌హల్వా తినిపించబోతున్నాను" పద్మ చెప్పింది నవ్వుతూ.

"ఇదేనా నువ్వు చేయదలచుకున్న సర్‌ప్ర యిజు? " అన్నారంతా నీరసంగా.

"దేరీజ్ సమ్‌థింగ్ ఎబౌట్ పద్మ" చెప్పింది మాలతి సినిమాటిగ్గా.

"నువ్వేదో చెప్పాలనుకుని చెప్పడంలేదే" రేవతి అంది.

"క్యూరియాసిటీతో చంపక ఆ సర్‌ప్రయి జేదో డిక్లేర్ చేసెయ్" చెప్పింది లేఖ ఆత్రంగా.

"అలాగే చెప్తాగానీ... నిన్న మీ మధ్య జరిగిన ఆర్గుమెంటేమిటో చెప్పింతర్వాతే నా విషయం చెప్తాను" అంది పద్మ ఆట ప ట్టిస్తూ.

"ఆ ఏముంది. స్పందన పెళ్లి చేస్కోదట. జీవితాంతం కన్యగానే మిగిలిపోయి సమాజ సేవ చేస్తుందట" అన్నారంతా.

"అలాగా అయితే నేనివ్వబోయే సర్‌ప్ర యిజ్ దానికి రివర్స్" అంటూ తన హేండ్ బేగ్‌లోంచి నాలుగు ఆకర్షణీయమైన కవర్లని తీసి తలా ఒకటిచ్చింది.

"ఏమిటబ్బా ఇది? " అంటూ కవర్‌పై ఉన్న అక్షరాల్ని చదివారంతా. వెడ్డింగ్ ఇన్వి టేషన్ అది. పేరు టైప్ చెయ్యబడి ఉంది.

కవర్స్ ఓపెన్ చేశాక బ్లూకలర్ కార్డ్స్‌ని బైటకు తీశారంతా.

బ్లూకలర్ కార్డ్‌పై గోల్డెన్ లెటర్స్‌తో రాయబడి ఉంది.

'పద్మ వెడ్స్ రమేష్' వావ్ అంటూ నోళ్లు తెరిచారంతా.

"కంగ్రాచ్యులేషన్స్ పద్మా"

"ఎప్పుడు జరిగిందే ఇదంతా? "

"వచ్చే సండే నా పెళ్లి. మీరందరూ రావాలి. ఎవరైనా రాకపోయారో చంపే స్తాను" అంది పద్మ బెదిరిస్తున్నట్టు పోజు పెట్టి.

"అలాగే వస్తాంకానీ నీ ఉడ్‌బి ఏం చేస్తాడో చెప్పు? "

"బిజినెస్"

"అయితే బిజినెస్ మాగ్నెట్‌ని చేసుకోబో తున్నావన్నమాట"

"మాగ్నెట్టూ లేదూ అల్యూమినియం లేదుగానీ మీరు తప్పక రావాలే"

"అలాగే కానీ ముందు ఈ శుభవార్తని కారెట్ హల్వాతో పంచుకుందాం"

"ఓకే డన్" అంది పద్మ. గలగలమంటూ నవ్వారంతా.

★ ★ ★

స్థలం ఆర్.ఆర్. గార్డెన్స్, సమయం ఉదయం తొమ్మిది గంటలు, ఆదివారం: పద్మకు పెళ్లి కూతురి ముస్తాబు చేస్తు న్నారు.

"యువార్ లుకింగ్ మార్వెలెస్ పద్మా" పద్మ అందాన్ని అద్దంలోంచి గమనిస్తూ చెప్పింది లేఖ.

"నేను గనుక మగాడిగా పుట్టి ఉంటే పద్మని రాక్షస వివాహం చేసుకునేదాన్ని" అంది రేవతి ఉద్వేగం నటిస్తూ.



"గాంధర్వ పద్ధతిలో అనవే... క్లాస్‌గా ఉంటుంది. శకుంతలా దుష్యంతుల కాంబినేషన్లా! రాక్షస వివాహమేమిటి ఛండాలంగా" ముఖాన్ని అసహ్యంగా పెడుతూ చెప్పింది మాలతి.

"రాక్షస వివాహంలో ఉన్న మజా మీకేం తెలుసే? బలవంతంగా వధువుని ఏ ఆఫ్ఘనిస్తాన్‌కో, ఆఫ్రికాకో తీసుకెళ్లి" రేవతి చెప్పక ముందే,

"ఇక ఆపు... పాడు మాటలు. పాపం మన పద్మ పెద్దల అంగీకారంతో సంప్రదాయబద్ధంగా చేసుకొంటోందీ పెళ్లి. ఇటువంటి సందర్భంలో అటువంటి ప్రేలాపనెందుకు? " విసుక్కుంది మాలతి.

"అవునుకానీ నాకు తెలీకడుగుతాను. పెళ్లి కూతురంటే తప్పనిసరిగా పట్టుచీర కట్టుకుని, ఇన్నిన్ని నగలు ధరించి, బుగ్గన చుక్క పెట్టుకుని ఆలయంలో దేవతలా ఎందుకు తయారవ్వాలి? హాయిగా హెయిర్‌కటింగ్‌తో ఏ జీన్సో పీటర్ ఇంగ్లాండ్ షర్టో ధరించి మోడర్న్‌గా ఉండచ్చుకదా!" అంది లేఖ.

"నీ పెళ్లప్పుడు అలాగే తయారవుదువు గానీ ప్రస్తుతానికి నోర్మూసుకో" చెప్పింది రేవతి.

పద్మకు నవ్వాగలేదు.

"అవునూ మీరంతా టిఫిన్లు చేశారా? " అడిగింది పద్మ.

"చేశాంగానీ పెళ్లి కొడుకెక్కడే? మేమింకా చూడనేలేదు" అన్నారు.

"ముహూర్తమెన్ని గంటలకి? "

"పదకొండు గంటల పది నిముషాలకు"

"ముహూర్తమంటే గుర్తొచ్చింది స్పందన ఎక్కడ? "

"స్పందన విషయం మరచేపోయాం. ఎక్కడ స్పందన? "



కల్యాణ మండపం ఎదుట కుర్చీల్లో స్పందన, సుమతి పక్కపక్కనే కూర్చుని ఉన్నారు.

"అయామ్ సారీ సుమతీ! నీకు జరిగింది గుర్తొచ్చి ఇంటికెళ్లింతర్వాత కూడా చాలా బాధపడ్డాను" నొచ్చుకుంటూ అంది స్పందన.

సుమతి "నీకింకా గుర్తుందా? నేను మరిచే పోయాను ఆ విషయం" అంది.

"ఎలా మరిచిపోగలను? ఎ ఫ్రెండ్ ఇన్ నీడ్ ఈజె ఫ్రెండ్ ఇన్‌డీడ్ అంటారు. నీకు హెల్ప్ చేద్దామంటే, నువ్వేమో ఆ రాస్కెల్ అడ్రస్ చెప్పడంలేదు. ఎలా? " నిట్టూర్చుతూ చెప్పింది స్పందన.

"పోనీ అన్నాకదా, మాలాంటి పేదవాళ్లకి ఇటువంటి అనుభవాలు మామూలే" అంది సుమతి.

"సిల్లీగా మాట్లాడకు. నాకు కోపం తెప్పించాలని చూడొద్దు. ఎందుకే అంత బేలతనం నీకు? మనిషి ఎప్పటికీ తనపై తాను జాలి పడకూడదు. అసలు నీలాంటి మనుషులుండబట్టే సమాజంలో పురుషులు ఆ విధంగా చెలరేగిపోతున్నారు. ఎదిరించి బతకడం

నేర్చుకో. మైట్ ఈజ్ రైట్. రాజ్యం వీరభోజ్యమని ఊరికే అన్నారా? సున్నిత హృదయులకు ఈ ప్రపంచం ఒక విషాద నాటకం' అని జవహర్‌లాల్ నెహ్రూ చెప్పింది నిజమే అని నిన్ను చూశాక అనిపిస్తోంది నాకు" అంది స్పందన.

"హాయ్ స్పందనా! నువ్విక్కడున్నావా? " రేవతి అడిగింది.

"హాయ్ సుమతీ! నువ్వెప్పుడొచ్చావ్? ఏయ్ డెవిల్ నిన్ను ఇన్ని రోజుల్నుంచీ చాలా మిస్సయ్యాము సుమా. ఎక్కడికెళ్లావే? గాయబ్ అయిపోయి తిరిగి ఈ రోజు ఇలా పద్మ పెళ్లిలో కనబడుతున్నావు' ' అడిగారు రేవతి, మాలతి, లేఖలు.

"నేనెక్కడికెళతానే? ఇక్కడే ఉన్నాగా మీ ఎదుటే" చెప్పింది సుమతి.

"జోకులొద్దు.."

"పద సుమతీ వెళ్లి పద్మని పలకరించి వద్దాం" చెప్పింది స్పందన.

"పద వెడదాం" అంది సుమతి.

"ఏదో ఒకటి సద్ది చెప్పండి. యాభైవేలే కదా.... నెలరోజుల్లో ఇస్తామని చెప్పండి. మూడున్నర లక్షల రూపాయలు ఇచ్చిన వాళ్లం యాభైవేలు ఇవ్వలేమా? " భర్త జానకిరామయ్యకు చెప్పింది సుశీల.

పైకి అలా ధైర్యంగా చెప్పిందికానీ మనసులో ఆమెకు ఆందోళనగా ఉంది. నుదుటికి పట్టిన చెమటని తుడుచుకుంటూ...

"ఆ విషయం ఆల్రెడీ నేను చెప్పానే... కానీ వియ్యంకుడు ఒప్పుకోవడంలేదు. అబ్బాయి మనమ్మాయి మెళ్లో తాళి కట్టేలోపే యాభైవేలు. ఇచ్చితీరాలంటున్నాడు. కట్నానికి, బంగారానికి, ఇతర పెళ్లి ఖర్చులకీ ఉన్నదంతా ఊడ్చుకుపోయి లక్షరూపాయలు అప్పు మిగిలింది.

ఇప్పుడు ఉన్న పళంగా యాభైవేలు ఎక్కడినుంచి తీసుకురావాలి? నాకేమీ తోచడం లేదు. ఎలాగోలా జరిగిపోతుందనుకున్న పెళ్లి. కానీ మన వియ్యంకుడింత మొండివాడని ఇప్పుడే తెలిసింది. ఏంచెయ్యాలో నాకేమీ అర్థంకావడం లేదు. ఇప్పటికిప్పుడు యాభైవేలంటే ఎవరిస్తారు సుశీలా? " అన్నాడు జానకిరామయ్య.

"మీరు చెప్పింది నిజమేనండీ. వియ్యంకుడు తన మొండితనంతో ఈ శుభకార్యం జరగనీకుండా గొడవేదైనా సృష్టిస్తాడంటారా? ఏదైనా మార్గం చూడండి" అంది సుశీల.

"విషయం మీ అన్నయ్యకు చెప్పి, వియ్యంకుడితో సర్దిచెప్పమంటాను. ఏమంటావ్? " అన్నాడు జానకిరామయ్య.

"మీ ఆలోచన బాగానే ఉంది. ధర్మారావు అన్నయ్య శాంత స్వభావి. అన్నయ్యను ఎవరికీ అనుమానం రాకుండా ఇక్కడకు తీసుకురండి" సలహా ఇచ్చింది సుశీల.

"అలాగే.... ఈలోగా ఎవరెవరికి ఏమేం అవసరమో నువ్వు చూస్తూ ఉండు" చెప్పి వెళ్లాడు జానకిరామయ్య.

అప్పుడు సమయం పదకొండుగంటలవుతోంది.

ముహూర్తానికి వేళయింది. ధనమనే దెయ్యం మనిషి నెత్తికెక్కి నర్తించడం మొదలయ్యాక మనిషికి పిచ్చి పట్టి ఆ దెయ్యం చెప్పినట్టు నడచుకోవడం ప్రారంభిస్తాడు. అందులో భాగంగానే ప్రస్తుతం జానకిరామయ్య కూతురు పద్మ పెళ్లిలో... జానకిరామయ్య వియ్యంకుడు రఘురాంప్రసాద్ ఓ కొత్త గొడవకు శ్రీకారం చుట్టబోతున్నాడు.

"అయ్యా! ముహూర్తానికి వేళయింది. వధువు వచ్చి పీటలమీద కూర్చుంది. మరి వరుణ్ణి కూడా పిలిపిస్తే తాళికట్టించే కార్యక్రమం పూర్తి చెయ్యచ్చు" వేదికపై నుంచి అన్నారు.

"పంతులూ! నువ్వు కాసేపు ఊర్కో. ఈ ముహూర్తానికి కాకపోతే ఇంకో ముహూర్తంలో చెయ్యచ్చు పెళ్లి. ముందు ఒక విషయం ఆ జానకిరామయ్యతో తేల్చుకోవల్సివుంది" పెళ్లికొచ్చిన ఆహూతులందరూ

వింటుండగా వియ్యంకుడు రఘురాంప్రసాద్ గట్టిగా అరుస్తూ చెప్పాడు.

అందరిలోనూ కలవరం మొదలైంది. "ఏమైంది? ఏమైంది? " అంటూ అందరూ తమలో తాము అనుకోసాగారు.

"రఘురాంప్రసాద్ గారూ! కట్నం బాకీ యాభైవేలు గురించి మీరు ఏమీ బెంగ పెట్టుకోవద్దు. అదెలాగైనా రెండ్రోజుల్లో పువ్వుల్లో పెట్టి మరీ మీకిస్తాం. దయచేసి జరిగే శుభకార్యాన్ని ఆపద్దు. అబ్బాయిని పిలిపించి పీటలమీద కూర్చోమని చెప్పండి. మా బావకు ఎంతో పరువు, ప్రతిష్ఠలున్నాయి మా బంధువర్గంలోనూ, బయటా. దయచేసి మీరు ఏవిధమైన గొడవా చెయ్యాలని ప్రయత్నించకండి. ఇవి చేతులు కావు" అంటూ జానకిరామయ్య బావమరిది ధర్మారావు, రఘురాంప్రసాద్‌ని బతిమిలాడాడు.

"నువ్వెవరివయ్యా? మధ్యలో వచ్చి ఏదో మాట్లాడుతున్నావ్. నువ్వు అవతలికి వెళ్లు. నీకు ఈ గొడవలతో ఏవిధమైన సంబంధం లేదు. వెళ్లి అతణ్ణి పిలుచుకురా. యాభైవేలు తెచ్చి ఇప్పటికిప్పుడు ఇస్తాడో లేక పెళ్లిని రద్దు చేయమంటాడో. అతణ్ణి పిలువ్" అంటూ పెద్దగా అరిచాడు రఘురాంప్రసాద్.

"నామాట వినండి.. ప్లీజ్.... దయచేసి... " ధర్మారావు మాటలు పూర్తి కాకముందే అతడి చేతిని విసిరికొట్టాడు రఘురాంప్రసాద్.

"చెప్తుంటే నీక్కాదూ? అసలు నువ్వెందుకు తల దూరుస్తున్నావు ఈ విషయంలో. ఆ జానకిరామయ్య ఎక్కడ? " అరిచాడు.

ఆసరికే పెళ్లికి వచ్చిన అతిథులు కుర్చీలోంచి లేచి నిలబడ్డారు. ఏదో గొడవ మొదలైందని అందరికీ అర్థమయింది. పెళ్లి పీటలమీద కూర్చున్న పద్మ కళ్లల్లో నీళ్లు సుడులు తిరగడం ప్రారంభమయింది.



"బావగారూ... టైముకి డబ్బు సర్దుబాటు కాలేదు. రెండురోజులు ఓపికపట్టండి. నేనే స్వయంగా వచ్చి నా చేతుల్తో ఆ యాభైవేలు మీ చేతుల్లో పెడతాను. నన్ను నమ్మండి. మామీద నమ్మకం లేదా? " అని బతిమాలడం మొదలుపెట్టాడు అప్పుడే వచ్చిన పద్మ తండ్రి జానకిరామయ్య.

"ఎవడిక్కావాలయ్యా నీ నమ్మకాలు? మొత్తం నాలుగు లక్షల కట్నానికి నువ్వు ఒప్పుకున్నావా లేదా చెప్పు? నేనేమీ ఎక్కువ అడగడంలేదే. డబ్బు దగ్గర నేను చాలా నికార్సయిన మనిషిని. డబ్బు విషయం వచ్చేసరికి నేను బంధువులను కూడా లెక్క చెయ్యను. ఇప్పటికయినా మించిపోయింది లేదు. నీకు పదినిముషాలు టైమిస్తున్నాను. ఈ పదినిమిషాల వ్యవధిలో డబ్బు నువ్వు తెచ్చావాసరే... లేకపోతే నువ్విచ్చిన కట్నం, బంగారం నీ ముఖాన కొడతాను. ఇంతటితో ఈ సమస్య తీరిపోతుంది.

అంత శక్తి లేనివాడివి ఎందుకు ఒప్పుకున్నావు అంతిస్తాను, ఇంతిస్తానని? సిగ్గులేదటయ్యా నీకు? పెళ్లి చెయ్యడానికి బయలుదేరాడు మొనగాడు... పెళ్లిచెయ్యడానికి...." అంటూ జానకిరామయ్యను నానా మాటలూ అన్నాడు రఘురాంప్రసాద్.

అవమాన భారంతో జానకిరామయ్య రెండు కళ్లూ వర్షిస్తుండగా తలవంచుకుని పెళ్లి పందిట్లో అసహాయంగా నించున్నాడతను.

"అన్నయ్యగారూ! మీకు యాభై వేల కట్నం తక్కువిచ్చి మిమ్మల్ని మోసం చెయ్యడం మా ఉద్దేశ్యం కాదు. టైముకి డబ్బు సర్దుబాటు కాలేదు. అంతే! అమ్మాయిని పెళ్లి చేసి మీ కోడలిగా పంపుతున్నది ఆమె సంతోషంగా ఉండాలనేకదా? అటువంటప్పుడు మీ డబ్బు ఎందుకు ఇవ్వకుండా ఉంటాము? మీ డబ్బు మీకివ్వకుండా ఉంటే మాకు మనశ్శాంతి ఎలా ఉంటుంది? మమ్మల్ని అర్థం చేసుకోండి. వదినగారూ! మీరైనా చెప్పండి అన్నగా

రికి..." అంటూ రఘురాం(ప్రసాద్‌కూ, అతడి భార్యకూ నచ్చచెప్పింది సుశీల.

మూతి విరిచి పక్కకు వెళ్లి నిలబడింది వియ్యపురాలు.

ఆమె వెనకే వెళ్లి నిలబడ్డాడు వరుడు రమేష్. వినిపించుకోనట్టు తల విదిలించాడు రఘురాం(ప్రసాద్.

పరిస్థితి గమనించిన తర్వాత, ఇరు వర్గాలకూ చెందిన కొంతమంది పెద్దలు కలుగ చేసుకుని, "బాబూ! అతను కట్నం బాకీని రెండ్రోజుల్లో ఇస్తానని ప్రాధేయపడుతున్నాడు కదా! అతనికి ఏవో పరిస్థితులవల్ల సమయానికి డబ్బు సర్దుబాటు కాలేదేమో! ఆ విషయం భార్యాభర్తలిద్దరూ చెప్తున్నారు కదా! పెళ్లి పీటలమీద కూర్చున్న ఆ అమ్మాయి ముఖం ఒకసారి చూడు. అన్నీ సవ్యంగా ఇచ్చిన వాళ్లు, చిన్న మొత్తం ఇవ్వలేరా? నువ్వు కూడా ఒకసారి ఆలోచించు. పీటలదాకా వచ్చిన పెళ్లిని నీ మాటపట్టింపుతో ఆపాలని ప్రయత్నించకు. అది శుభం కాదు. ముహూర్తం వేళ దాటిపోతోంది. దయచేసి జరగబోయే శుభకార్యం జరగనీ!" అన్నారు.

వారి మాటలకు ముఖం చిట్లించుకుని, ఎగతాళిగా, నిర్లక్ష్యంగా నవ్వుతూ... "ఏంబాబూ! నీతి సూక్తులు, నీతి బోధలూ చెయ్యడానికి ఇంతమంది ఉన్న ఈ పెళ్లి పందిట్లో నేనే దొరికానా? ఇంకెవ్వరూ దొరకలేదా? ఆ జానకిరామయ్యకి చెయ్యండి ఈ నీతి బోధలు. వెళ్లండి. వెళ్లి అదిగో, ఇదిగో అంటూ పెళ్లిదాకా ఎందుకు తీసుకువచ్చాడో అడగండి. కనీసం ముహూర్తానికి ఒకగంట అటూఇటూగా ఇచ్చినా సర్దుకుపోదామనుకున్నాను. కానీ అసలుకే ఎసరు పెట్టాలని చూస్తున్నాడు. రెండ్రోజుల్లో యాభైవేలు ఇస్తానంటే నమ్మడానికి నా చెవుల్లో పువ్వులేమీ లేవు. వెళ్లండయ్యా.... వెళ్లండి" అంటూ ఆ పెద్దమనుషుల్ని కసురుకున్నాడు రఘురాం(ప్రసాద్.

కనీసం తమ పెద్దరికాన్ని గమనించని అతని మూర్ఖత్వానికి కోపం వచ్చి "మరి నువ్వు ఆ యాభైవేల కోసం అందరూ చూస్తున్న ఈ పెళ్లి పందిట్లో ఇంత రాద్ధాంతం చేస్తున్నావు. ఒకవేళ ఆ డబ్బు నీకు ఇచ్చినా కూడా నువ్వు ఆ అమ్మాయిని సక్రమంగా నీ ఇంట్లో సంసారం చేయనిస్తావని గేరంటీ ఏమిటి? " అన్నారు.

"అసలు గేరంటీ లేదండీ. గేరంటీ లేదు కాదు, అసలు నేనే గేరంటీ ఇవ్వను. అంత జాలి గుండె గలవాళ్లయితే మీలో ఎవరైనా ఆ అమ్మాయిని ఫ్రీ గా చేసుకోవచ్చు" అన్నాడు రఘురాం(ప్రసాద్.

అతడలా అన్నాడో లేదో "రఘురాం(ప్రసాద్!" అంటూ పెళ్లిపందిరి దద్దరిల్లిపోయేలా ఓ స్త్రీ కంఠం వినిపించేసరికి అందరూ ఉలిక్కిపడి అటు తిరిగి చూశారు.

ఆ కేకతో బిత్తరపోయి అటువైపు చూసిన రఘురాం(ప్రసాద్‌కు పాతికేళ్ల లోపు వయసుతో ఎరుపురంగు పట్టుచీరతో మెరిసిపోతున్న ఓ అందమైన అమ్మాయి కనబడింది. అందరూ ఆమెవైపు ఆసక్తితో చూడసాగారు. ఆమె క్రమంగా వేదికకు దగ్గరవసాగింది.

ఆ అమ్మాయిని గమనించిన కొంతమంది యువతులు ఏం జరగబోతోందో అని ఆందోళన పడసాగారు. వధువు పద్మ ఆ అమ్మాయిని చూడగానే ఆశ్చర్యానికి గురయింది. రఘురాం(ప్రసాద్ ఎదుటకొచ్చి నిలబడిందామె.

ఆమె కళ్లల్లోని ఎరుపు చూసి ఉలిక్కిపడ్డాడతను. "ఈ ఝాన్సీరాణీ ఎవరబ్బా? " అని మనసులో అనుకున్నాడతను. కోపం, ఉద్రేకాలతో ఆమె ముక్కుపుటాలదరసాగాయి.

ఆమె స్నేహితులు తప్ప ఆమెనెవరూ గుర్తుపట్టలేరు ఆ పందిట్లో.

అవును... ఆమె పేరే 'స్పందన'.

"ఏం కూశావురా? ఈ పెద్దమనుషుల్ని, తాత వయసున్న వృద్ధులెవరినైనా వచ్చి పద్మని ఫ్రీగా చేస్కోమంటావా? తప్పనిస

రిగా అలాగే చేసుకుంటారు. పద్మ స్థానంలో నీ భార్యనో, నీ చెల్లినో, నీ కూతుర్నో తెచ్చి పీటలపై కూర్చో పెట్టరా... అప్పుడు జరుగుతుంది పెళ్లి. అందరికీ కన్నులపంఢుగగా ఉంటుంది. అందరూ సంతోషంగా అక్షింతలు వేస్తారు" అంది స్పందన.

తన కోపాన్ని మాగ్జిమమ్‌గా ప్రదర్శించడానికి ఇదే సరైన వేదిక, సరైన సమయం అని నిశ్చయించుకుంది స్పందన.

"ఎవతెవే నువ్వు? ఈ రఘురాంప్రసాద్‌నే ఒరే అని పిలుస్తున్నావంటే నువ్వు సామాన్యురాలివి కాదు. నోటికొచ్చినట్టు కూస్తూ బజారుదానిలా...." రఘురాంప్రసాద్ మాట పూర్తికాకమునుపే రఘురాంప్రసాద్ రెండు చెంపలూ పగిలిపోయాయి.

ఊహించని ఈ పరిణామానికి రఘురాం ప్రసాద్ రెండుకళ్లూ బైర్లు కమ్మాయి. నోట మాట రానట్టయింది అతనికి.

"మనమ్మాయి స్నేహితురాలట..." ఆశ్చర్యపోతున్న జానకిరామయ్య చెవిలో చెప్పింది సుశీల.

"ఎంత ధైర్యమే నీకూ? నా భర్తనే కొడతావా? " అంటూ మీదికొచ్చిన రఘురాంప్రసాద్ భార్య ఎడమచెయ్యిని మెలిపెట్టేసరికి బాధతో ఆమె విలవిల్లాడిపోయింది.

"ఎవర్నువ్వు? ఎందుకిలా చేస్తున్నావు? " అడిగాడు వరుడు రమేష్.

"ఒరేయ్ సిగ్గుందట్రా నీకూ? నువ్వు మగాడివా? నీ తండ్రి నోటికొచ్చినట్టు అలా వాగి ఎగురుతోంటే చేతులు ముడుచుకుని కూర్చున్నావు. పెళ్లి చేసుకుని సంసారం చేసేది నువ్వయితే నీ తరపున వకాల్తా పుచ్చుకున్నట్టు శివాలెత్తిపోతున్నాడు నీ తండ్రి. ఆడంగి మాదిరి నీ తల్లి కొంగు పుచ్చుకుని నిలుచున్నావు. నీకెందుకురా పెళ్ళీ, సంసారం? మగతనం లోపించిన కొజ్జాలా కనపడుతున్నావు" నిప్పులు చెరిగింది స్పందన.

పరిస్థితి చివరికి ఎలా మారుతుందో అని భయపడ్డ జానకిరామయ్య స్పందన దగ్గర కొచ్చి "నువ్వు ఊర్కో అమ్మాయ్... ఇది మా అమ్మాయి జీవితానికి సంబంధించిన విషయం. మధ్యలో జోక్యం చేసుకోకు" అంటూ కసిరాడు.

తర్వాత రఘురాంప్రసాద్‌వైపు తిరిగి "బావగారూ! పద్మ స్నేహితురాలట. ఏదో చిన్నపిల్ల. మీరు అది మనసులో పెట్టుకుని..." అని అంటుండగానే

"ఆహా చిన్నపిల్ల... ఇది చిన్నపిల్లా? మా చెంపలు పగలకొట్టి, నా భార్య చేతులు మెలిపెట్టి, నా కొడుకుని నానా మాటలన్న ఇది చిన్నపిల్లా? మమ్మల్ని అవమానాలపాల్జేయడానికి నువ్వు పన్నిన కుట్ర ఇదంతా. చాలు. నువ్వు మాకు చేసిన మర్యాద చాలు. ఇక నీకూ, నీ కూతురికీ శతకోటి దండాలు. ఇదిగో నీ కట్నం.. నీ వస్తువులు. నమస్కారం బాబూ. నడవండ్రా పోదాం" అంటూ భార్యాకొడుకుల్ని, ఇతర బంధువుల్ని ఉద్దేశించి అన్నాడు రఘురాంప్రసాద్.

"బావగారూ! నామాట వినండి.."

"అన్నయ్యగారూ..."

"వెళ్లనివ్వండి ఆంటీ.... పద్మకు ఈ పెళ్లి జరక్కపోవడమే మంచిది. ఇంత పిరికివాణ్ణి భర్తగా చేసుకుంటే పద్మ ఎలా సుఖపడుతుంది? ఇందాకట్నించీ గమనిస్తున్నాను. వాడంతలా రెచ్చిపోయి, మంచి, మానవత్వం మరచి నోటికొచ్చినట్టు మాట్లాడుతుంటే ఎదిరించాల్సిందిపోయి వాణ్ణి బతిమాలుతున్నారేం? వెళ్లిపోనివ్వండి వాణ్ణి. వాడు అలా వెళ్లిపోతే జీవితాంతం వాణ్ణి బతిమాలే బాధ తప్పుతుంది మీకు చెప్పింది స్పందన కోపంగా.

ఇంకెందుకయ్యా జానకిరామయ్యా నీకు దిగులు? ఈ అమ్మాయే నీ కూతురి పెళ్లి చేస్తుంది. నీ కూతుర్ని, నీ కుటుంబాన్ని ఉద్ధరించడానికి దివినుంచి దిగివచ్చిన దేవతయ్యా ఈ అమ్మాయి. ఆమె కాళ్లు కడిగి

ఆ నీళ్లు నెత్తిపై చల్లుకో. పుణ్యం వస్తుంది" అంటూ ఎగతాళిగా నవ్వుతూ వెళ్లిపోసాగాడు రఘురాంప్రసాద్.

"వెళ్లరా. ఈ ప్రపంచంలో అందరూ నీలాంటి నీచులు లేరు. పెళ్లంటే వ్యాపారమని భావించిన నీ ఇంట్లో కోడలెలా కాపురం చెయ్యగలుగుతుంది? చివరికి దాని జీవితం బుగ్గిపాలు అవక తప్పదు. వెళ్లరా.. వెళ్లు. నీలాంటి నీచుడెవడో వియ్యంకుడిగా నీకు దొరికినప్పుడు నీ తిక్క కుదురుతుంది' అంది పళ్లుకొరుకుతూ స్పందన.

"వెళతానే. వెళ్లక ఈ పందిట్లో నిలబడి ఈ జానకిరామయ్యని బతిమాలతాననుకున్నావా? అది ఛస్తే జరగదు" అన్నాడు రఘురాంప్రసాద్.

ఆతర్వాత రఘురాంప్రసాద్, అతని వర్గమంతా వెళ్లిపోయారు.

ఆ పెళ్లికి వచ్చిన వారంతా స్పందన ధైర్యానికి మెచ్చుకున్నారు. వారిలో కొందరు స్పందన ప్రవర్తన సరిగా లేదని పెదవి విరిచారు. స్పందన స్నేహితురాళ్లు వధువు పద్మ, మాలతి, సుమతి, లేఖ, రేవతి అందరూ స్పందన డేర్‌నెస్‌కు ముగ్ధులయ్యారు. జరిగిందానికి పద్మ తల్లితండ్రులు తమ అసంతృప్తిని, ఆవేదనని వ్యక్తం చేశారు.

ఇంతమంది ఆహూతుల మధ్య చెడిపోయిన తమ కూతురి పెళ్లి గురించి వారు కళ్లనీళ్ల పర్యంతమయ్యారు.

అప్పుడు ఈ దృశ్యం గమనించిన కొంత మంది పెద్దలు, అభ్యుదయ భావాలు గల యువతరం స్పందన చాలా మంచిపనే చేసింది. అటువంటి స్వార్థపరుడికి, డబ్బు పిచ్చి ఉన్నవాడికి తగిన శాస్తి జరిగిందని, ఒకవేళ యాభైవేల రూపాయల్ని ఏదో విధంగా సర్ది ఈ పెళ్లి జరిపించినా, ఆ రఘురాంప్రసాద్‌ని ఆవహించిన ధన దాహం తీరదని, మళ్లీ డబ్బుకోసం పద్మని బాధ పెడతాడని' చెప్పారు. ఆ దంపతుల్ని ఓదార్చారు.

ఇటువంటి సంఘటనలు కొన్ని వివాహాల్లో జరుగుతాయనీ, కానీ వరుడి తరపు వర్గం చేసే దౌర్జన్యాన్ని వధువు తరపు వాళ్లు ఎందుకు సహించాలని అన్నారందరూ. స్పందనని అభినందించారందరూ.

★ ★ ★

అది స్పందన ఇల్లు. సమయం సాయంత్రం అయిదవుతోంది. స్టడీరూం లో కూర్చుని ఏదో మేగజైన్ చదువుతోంది స్పందన. స్పందన తల్లి అన్నపూర్ణ స్పందన కోసం టీ తీసుకొచ్చింది. టీ కప్పుని అందుకుంటూ "థాంక్యూ మమ్మీ! మామ్ ఈజ్ గ్రేట్" అంది టీ సిప్ చేస్తూ.

"మమ్మీ నేను టీ కలిపితే ఇంత టేస్ట్ రాదు. ఇంత రుచికరంగా తయారు చెయ్యడం ఎక్కడ నేర్చుకున్నావ్? " ఆసక్తిగా అడిగింది.

"అది తర్వాత చెపుతాగానీ ముందు నువ్వొక విషయం చెప్పు"

ఏ విషయమన్నట్టు ప్రశ్నార్థకంగా చూసింది తల్లివంక.

"అదే నువ్వు మొన్న నీ ఫ్రెండ్ పెళ్లికెళ్లావు కదా.. ఏమైంది? పెళ్లి ఎలా జరిగింది? " అడిగింది అన్నపూర్ణ అక్కడే ఉన్న కుర్చీలో కూర్చుంటూ.

"ఓ అదా! ఇంకేమో అనుకున్నా. ఇట్స్ క్వయిట్ గ్రేట్ మమ్మీ. చాలా బాగా జరిగింది పెళ్లి. నా ఫ్రెండ్సందరూ వచ్చారు. చాలా ఎంజాయ్ చేశాను. రియల్లీ..." నవ్వుతూ చెప్పిందే కానీ తన తల్లి ముఖంలో రంగులు మారడం గమనించింది స్పందన.

"ఎందుకే అబద్ధం చెబుతావ్? నువ్వు చేసివచ్చిన ఘనకార్యం నాకు తెలియదనుకున్నావా? " కోపంతో. అంది అన్నపూర్ణ.

"నేనేం చేశాను? " బుకాయించబోయింది స్పందన.

"నోర్ముయ్! చాలించు నీ నాటకాలు.



పెళ్ళికి వెళ్ళిందానివి నాలుగు అక్షింతలు వేసి రావాలి. అది చాతకాకపోతే నిశ్శబ్దంగా ఉండి వచ్చెయ్యాలి. నానాగొడవ ఎందుకు సృష్టించావక్కడ? పెద్ద ఆరిందాలా ఎందుకు ప్రవర్తించావు? జరుగుతున్నది నీ ఫ్రెండ్ పెళ్ళి అని స్పృహ లేకుండా ఎందు కలా బరితెగించి ప్రవర్తించావు? ఆ పెళ్ళిపె ద్దలేమైనా నీ మధ్యవర్తిత్వాన్ని కోరుకు న్నారా? అసలు నువ్వెవరివి? ఎవరి తరపు బంధువివి. పెళ్ళి పందిట్లో గొడవ సృష్టించ డానికి నీకేం అధికారముంది? " ఆవేశంగా అడిగింది అన్నపూర్ణ.

తన తల్లికంతా తెలిసిపోయిందనీ, ఇక అబద్ధాలు చెప్పి లాభంలేదనీ అర్థంచేసు కున్న స్పందన మౌనాన్ని ఆశ్రయించింది.

"అడిగేది నిన్నే" గద్దించిందామె.

ఇక లాభంలేదనుకుని "అసలు పెళ్ళి పందిట్లో ఏంజరిగిందో తెలిసే మాట్లాడుతు న్నావా అమ్మా? "అంది.

"ఏం జరిగితే నీకెందుకే? నువ్వు పోలీ సువా? పెళ్ళికూతురు చెల్లెలివా? లేక వధువు మేనత్తవా? నీకేం అధికారముందని నేనడుగుతున్నా. పెళ్ళన్నాక రకరకాల విష యాలు, మాట పట్టింపులు జరుగుతాయి. జోక్యంచేసుకోవలసిన అవసరం నీకేమొ చ్చింది? పెళ్ళికూతురి తరపువాళ్ళు నిన్ను తమ తరపున వకాల్తా తీసుకోమని అడి గారా? నీకేం అధికారముందని కలగజేసుకు న్నావు? " అన్నపూర్ణలో అంతకంతకు అస హనం పెరిగిపోసాగింది.

"మంచితనం మిగిలివున్న ఓ సాటి స్త్రీగా పద్మకు జరుగుతున్న అన్యాయాన్ని ఎదిరిం చాను. స్వార్థపరుల చేతిలో బుగ్గికాకుండా ఒక నిండు జీవితాన్ని కాపాడాను. చివరకు పద్మ తల్లిదండ్రులు కూడా చెయ్యలేని సాహసం చేసి, వారికి భవిష్యత్తులో ఎదు రయ్యే మానసిక క్షోభనుండి కాపాడాను. నేను చేసింది తప్పా? నాకు తెలిసినంతవ రకూ నేను చేసిన పనికి పెళ్ళి పందిట్లో అందరూ మెచ్చుకున్నారు నన్ను. దుర్మార్గు లైన రఘురాంప్రసాద్ తరపున వాళ్ళెవరో నీకు తప్పుడు సమాచారం ఇచ్చి ఉంటారు. అందువల్లే నువ్వు అలా మాట్లాడుతున్నావు. నన్ను నమ్ము మమ్మీ. నీ పోషణలో పెరి గిన నేను తప్పుడు పని ఎలా చెయ్యగ లను? " అంది స్పందన ఆవేశంగా.

"అదే నేనూ అడుగుతున్నది. నా పెంప కంలో ఎక్కడో తేడా రాబట్టే నువ్వలా చేసి వచ్చావు. సాటి స్త్రీగా పద్మకు జరుగుతున్న అన్యాయాన్ని ఎదిరించానన్నావు. పెళ్ళికి చాలామంది స్త్రీలు వచ్చుంటారుగా. మరి సాటి స్త్రీకి అన్యాయం జరుగుతోందని వారి కెందుకనిపించలేదు? నీ ఒక్కతికే ఎందుకు పొడుచుకొచ్చింది రోషం? " అంది.

"వేరే వాళ్ల ప్రస్తావన నాకనవసరం మమ్మీ. నా దృష్టిలో ఏది మంచి అనిపిం చిందో దాన్ని ఆచరిస్తాను. ఏది చెడు అను కుంటే దాన్ని ఎదిరిస్తాను. ఇలా చెయ్యడా నికి నేను ఎవరి సహాయం తీసుకోను. అక్కర్లేదు కూడా. మనిషికి తనలో ఉన్న ఆత్మసాక్షికి మించిన జడ్జి ఎవరున్నారు న్యాయం నిర్ణయించడానికి? " అంది స్పందన.

★ ★ ★

స్పందన ఇల్లు.

ఉదయం తొమ్మిదవుతోంది.

టిఫిన్ చెయ్యడంకోసం డైనింగ్ టేబుల్ వద్ద ఎదురెదురుగా కూర్చున్నారు స్పందన, ఆమె తండ్రి ప్రసాదరావు. తండ్రీ కూతుళ్ళిద్ద రికీ అన్నపూర్ణ సర్వ్ చేస్తోంది.

"చాలు... చాలు.." ఇడ్లీలు వడ్డిస్తున్న తల్లితో అంది స్పందన.

"తినరా. వద్దంటావేంటి. ఇడ్లీలు ఎన్ని తిన్నా తిన్నట్టుండదు. తేలిగ్గా అరుగు తాయి. మంచి డైజెస్టివ్ ఫుడ్" కూతుర్తో అన్నాడు ప్రసాదరావు దోశె తింటూ.

"డైజెస్టివ్ ఫుడ్ అని వరసగా లాగించేస్తే వెయిట్ పెరుగుతుంది డాడీ. ఆ తర్వాత




కొలెస్ట్రాల్ అనీ, ఆయాసమనీ ఎందుకు బాధపడాలి? " అంది స్పందన ఇడ్లీ తింటూ.

స్పందన మాటలకు ప్రసాదరావు నవ్వుతూ "నీ భ్రమే కానీ అసలు ఇడ్లీలలో శక్తి లేదమ్మా. తిన్న రెండు మూడు గంటలకే మళ్లీ ఆకలవుతుంది" అన్నాడు.

తండ్రి మాటలకు స్పందన మందహాసం చేస్తూ "ఇడ్లీలలో శక్తి లేదని ఎవరన్నారు డాడీ? ప్రపంచంలోనే అతి ప్రమాదకరమైన టెర్రరిస్ట్ గ్రూప్‌గా పేరుపడి, శ్రీలంక ప్రభుత్వాన్ని గడగడలాడిస్తున్న ఎల్.టి.టి.ఇ వారిది ఏ రాష్ట్రం? వాళ్లు టిఫిన్లోకి తీసుకునేది ఇడ్లీ, సాంబారే కదా? ఇప్పుడు చెప్పు ఇడ్లీ గొప్పదా? చపాతీ గొప్పదా? " అంది.

కూతురి సమయస్ఫూర్తికి ప్రసాదరావు ముచ్చటపడి పెద్దగా నవ్వాడు.

అన్నపూర్ణ తన ముఖం పక్కకు తిప్పి నవ్వుకుని, మళ్లీ ఇద్దరివైపూ తిరిగి భర్తనుద్దేశించి, "మీరలాగే అది చెప్పిన ప్రతిమాటకీ వెర్రివాడిలా తలూపుతూ నవ్వుతూ ఉంటే అది నెత్తికెక్కి కూర్చోడం ఖాయం. సిగ్గు లేకపోతే సరి. ఇడ్లీలు తిని ఎవరో టెర్రరిస్టులయ్యారని అది చెబితే తలూపారు. మరి దోశెలు తినేవాళ్లు నక్సలైట్లు అవుతారంటే నమ్మేస్తారా? ఏడ్చినట్టుంది మీ తండ్రీకూతుళ్ల నిర్వాకం" అంది విసుగ్గా.

"నువ్వూరుకోవే. నా కూతురుది తెలివితేటల్లో అచ్చు నా పోలికే. నువ్వు చూస్తూ ఉండు. మన స్పందన ఏదో ఒకనాడు మన కుటుంబానికి మంచిపేరు తీసుకొస్తుంది. ఇది నిజం" భార్యతో అన్నాడు ప్రసాదరావు.

"మంచిపేరు తీసుకురావడానికి అదేం కష్టపడనక్కర్లేదు. చెడ్డపేరు తీసుకురాకుండా ఉంటే చాలు." చురకంటిస్తూ అంది అన్నపూర్ణ.

తన భార్య మనసులోని మాటను గ్రహించాడు ప్రసాదరావు.

టీ తాగుతూ "అమ్మా! నువ్వు చిన్నపిల్లవి. ఇంకా ప్రపంచమేంటో నువ్వు చూళ్లేదు. ఎవరి మనసులో ఏముంటుందో, ఎవరెలాంటివారో అర్థంచేసుకునే స్థాయికి నువ్వెదగలేదురా. నీకెందుకు పెద్ద విషయాలు. మనకు సంబంధించని విషయాల్లో జోక్యం చేసుకోవడం... ఇవన్నీ నీకెందుకు? " స్పందనతో అన్నాడు ప్రసాదరావు.

బోర్నవిటా తాగుతూ తండ్రి చెప్పే మాటల్ని శ్రద్ధగా వినసాగింది స్పందన.

"నీ ఉద్దేశం మంచిదే. చెడ్డదని నేను చెప్పడంలేదు. ఇలాంటి పన్లు చేస్తే అందరి కంట్లో పడతావు. ఫలానా వాళ్లమ్మాయి అలాంటిది.... ఇలా చేసింది.. ఇదంతా మనకెందుకు? మన తిండి మనం తింటూ, వేరే వాళ్లు మనల్ని వేలెత్తి చూపే అవకాశాన్ని మనం ఇతరులకెందుకివ్వాలి? " అన్నాడు.

స్పందన తండ్రి చెబుతున్న విషయం ఆకళింపు చేసుకుంటోంది. అన్నపూర్ణ తండ్రీకూతుళ్ల ముఖాల్నీ మార్చి మార్చి చూడసాగింది.

"నీకు చాలా భవిష్యత్తుందమ్మా. అప్పుడే ఏమైందని? ఇంకా ఎన్నో విషయాలు చూసి ఎంతో అనుభవాన్ని సంపాదించవలసి ఉంది. సమాజాన్ని అర్థం చేసుకోవలసి ఉంది. నామాట విని కోపాన్ని, ఆవేశాన్ని తగ్గించుకో తల్లీ. కోపం మనల్ని నాశనం చేస్తుంది. కోపాన్ని, ఆవేశాన్నీ ప్రదర్శించడం వల్ల సమస్య పరిష్కారమయిపోతే ఈ ప్రపంచంలో ఇన్ని సమస్యలెందుకుంటాయి? మొత్తం ప్రపంచం మహాత్మాగాంధీనెందుకు గౌరవిస్తుందో తెలుసా? మంచితనంతో, సహనంతో మనిషి ఏంచెయ్యగలడో ఆచరించి మరీ చూపించాడాయన. ఈ తండ్రి మాటలు నీ వయసు వాళ్లకి చాదస్తంగా అనిపిస్తాయి. కానీ నేను చెప్తున్నవి అక్షరసత్యాలమ్మా... అక్షరసత్యాలు" కూతురికి హితబోధ చేశాడు ప్రసాదరావు.

"డాడీ! నువ్వు నిశ్చింతగా ఉండు. అన్యాయమనిపించే ఏపనీ నేను చెయ్యను. నీకు

చెడ్డపేరు ఎప్పటికీ తీసుకురాను. నేను నీ కూతుర్ని డాడీ. నానుండి ఏవిధమైన నెగెటివ్ థింగ్‌నీ నువ్వు ఎక్స్‌పెక్ట్ చెయ్యకు" చెప్పింది స్పందన.

"ఈ మాటలకేంగానీ పదిమందిలో ఉన్నప్పుడు కాస్త ఒళ్లు దగ్గరపెట్టుకో. మళ్లీ ఇంకోసారి నీ గురించి ఏదైనా వినబడితే సహించేది లేదు. గుర్తుంచుకో" శాసించింది అన్నపూర్ణ.

★ ★ ★

కంప్యూటర్ క్లాస్ అయిపోయాక సుమతీ, స్పందనలిద్దరూ బయటికొచ్చారు.

"మళ్లీ ఇంకేదైనా జాబ్‌కోసం ట్రై చేస్తున్నావా సుమతీ? " స్పందన అడిగింది.

"ప్రస్తుతానికి లేదు. కానీ తొందర్లోనే ఏదైనా ఉద్యోగం చూస్కోవాలి" అంది సుమతి. సుమతి కుటుంబ పరిస్థితి స్పందనకి తెలుసు.

"మీ నాన్నగారేదైనా జాబ్ చేస్తున్నారా? "

"నీకు తెలియని విషయం ఏముంది స్పందనా? రిటైరయింతర్వాత ఖాళీగానే ఉన్నారు. ఆయన ఆరోగ్యం కూడా సరిగా ఉండదు. అక్క పెళ్లయింతర్వాత కొంత ఆర్థికంగా చితికిపోయారు. మా అదృష్టం బావుండి మా అక్కకు మంచి వ్యక్తి భర్తగా దొరికాడు" చెప్పింది సుమతి.

"మంచి భర్త లభించడం మీ అక్క అదృష్టం కదా, అది మీ అదృష్టం ఎలా అవుతుంది? "

"ప్రస్తుత పరిస్థితులని బట్టి అలా చెప్పవలసి వచ్చింది"

"నిజమే సుమా! రూపాదేవిగారు చెప్పినట్టు భార్యల్ని వేధించే భర్తలే ఎక్కువ. భార్యద్వారా వచ్చే డబ్బుపైనే తన దృష్టంతా నిలిపినవాడు, నిజానికి వ్యక్తిత్వం లేనివాడు. అటువంటిది తృణమో, పణమో ఇచ్చిందాంతో సంతృప్తి చెంది హాయిగా సంసారం చేసుకుంటున్న మీ బావే గుణవంతుడేమో" సాలోచనగా అంది స్పందన.

"మరి ఇల్లు ఎలా గడుస్తుంది సుమతీ? " అడిగింది.

"నాన్నకు పెన్షన్ వస్తుంది. ఇంటద్దె వస్తుంది. అందులోనే గడుపుకోవాలి. తమ్ముడు టెన్త్ చదువుతున్నాడు. అమ్మకు ఆరోగ్యం అంతంత మాత్రమే. ఆమె మందులకి కావాలి" చెప్పింది సుమతి.

"నిజానికి పేదరికమనేది ఒక విషవలయం సుమతీ. ఈ సమస్యల్ని అధిగమించడానికి ఎంతో మనోనిబ్బరం కావాలి సుమా" స్పందన అంది.

"భవిష్యత్తుపై మనిషికున్న ఆశే మనిషిని ముందుకు నడిపిస్తుంది. ఆ ఆశే లేకపోతే మనిషి మనుగడ సంకటంలో పడిపోయేది. మాలాంటి వారికి దిక్సూచిలా ఆ ఆశే ముందుకు నడిపిస్తుంది. ఆశ.... ఏనాటికైనా పరిస్థితులు మారకపోతాయా అని ఆశ... అదే జీవితం" సుమతి కంఠంలో తాత్వికపరమైన ఒకలాంటి నిర్లిప్తత ధ్వనించింది.

"డోన్ట్‌వర్రీ సుమతీ! నేను రూపాదేవిగారితో మాట్లాడి నీకేదైనా ఉద్యోగం వచ్చే ఏర్పాటు చేస్తాను" సుమతి చేతిని ఆప్యాయంగా నొక్కుతూ చెప్పింది స్పందన.

★ ★ ★

సమయం సాయంత్రం ఆరవుతోంది. ఆర్ట్‌ఫిలిమ్ డైరెక్టర్ సీమాపటేల్ ఇల్లు.

"గుడీవినింగ్ సీమా!" నవ్వుతూ విష్ చేసింది రూపాదేవి.

రూపాదేవిని చూసి కళ్లు పెద్దవి చేసి ఆశ్చర్యం వ్యక్తం చేస్తూ... "ఓ రూపా! ఎన్నాళ్లకు? ఎన్నేళ్ల తర్వాత? ఇప్పుడు గుర్తొచ్చానా నేను? వాటేవండర్. కమ్ కమ్..." అంటూ లోపలికి ఆహ్వానించింది సీమాపటేల్.

బ్లాక్ రేబాన్ గ్లాసెస్ తీసి సీమ ఇంట్లోకి అడుగుపెట్టింది రూప.

"దిసీజ్ టూమచ్ రూపా... నా క్లాస్‌మేటయిన నువ్వు ఒకే సిటీలో ఉంటున్న




# రచయితలకు




- ‘చతుర’లో నవలకు వేసే చిత్రాలు, ‘చతురకతలు’, ‘చతుర ప్రపంచం’వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని ‘చతుర’కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.
- ఆవిధంగా నవలలు ‘చతుర’కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.
- ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ప్రతి నవలకు అం[illegible] రు: **3000/-** పారితోషికం ఏనెల ‘చతుర’లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:

# చతుర

‘ఈనాడు’ కాంపౌండ్ హైదరాబాద్-500 482.




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షల కు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

నవంబర్ చతుర నవల 'స్పందన'

**సమీక్షకుని పేరు :** ......................................................

**చిరునామా :** ......................................................

......................................................

......................................................

......................................................

నాతో కలవడానికి ఇన్నిరోజులు పట్టిందంటే నాకు ఆశ్చర్యంగానూ, కోపంగానూ ఉంది" అంది. సీమాపటేల్.

"తప్పు నీదే. నీగురించయితే వివరాలు నాకు తెలీదు. నేను ఈ సిటీలో ఉన్నట్టు నీకు తెలుసుకదా! మరి నన్నెందుకు కలవడానికి రాలేదు? " అంధి రూపాదేవి.

"డోంట్ గెట్ ఎక్జయిటెడ్. నీ గురించి వివరాలు నాకెలా తెలుసని కదా అడిగింది? మొన్న సిటీలో జరిగిన ఓ సెమినార్‌లో అదే 'పురుషాధిక్య సమాజంలో స్త్రీ మనుగడ' అనే అంశంపై నువ్వు చేసిన ప్రసంగం చదివాను. నీ ఫొటో చూశాను. నువ్వు సిటీలోనే ఉన్నట్టు అయితే తెలిసింది కానీ నీ అడ్రస్ తెలీక ఊరుకున్నాను" అంది సీమాపటేల్.

"అదే నీకూ నాకూ తేడా. నువ్వు స్త్రీ సమస్యలపై తీసిన ఆర్ట్‌ఫిలిమ్ "వాయిస్" తాలూకూ సంచలనాన్ని విని, ఇండియన్ రెట్రాస్పెక్టివ్ విభాగం తరపున 'కేన్స్ ఫిలిమ్ ఫెస్టివల్' కు నీ 'వాయిస్' ఎంపికయిందని తెలిసి, పేపర్లో ఫిల్మ్ శ్నాప్స్, నీ ఫొటో చూశాక నీ అడ్రస్ కనుక్కోవడానికి రాత్రింబవళ్లు ప్రయత్నించి చివరకు ఇలా సాధించాను. సీమా! మనిషిలో ఒక స్ట్రాంగ్ ఇన్టెన్షన్ ఉండాలి. అసాధ్యమంటూ ఏదీ ఉండదు. నీలో ఆ విధమైన దృఢమైన లక్ష్యం ఉండబట్టే కదా ఇన్నేళ్లూ నువ్వు అజ్ఞాతంగా ఉన్నా చివరకు నిశ్చలమైన పర్వతంలోంచి పెల్లుబుకిన లావాలా నీ క్రియేటివిటీ ఎలా బయటకు వచ్చిందో చూశావా? " చెప్పింది రూపాదేవి.

"అయామ్ సారీ రూపా! పని వత్తిడి వల్ల నీమీద దృష్టి సారించలేకపోయాను... అయామ్ ఎక్స్‌ట్రీమ్లీ సారీ.." నొచ్చుకుంటూ అంది సీమ.

"ఓకే. ఓకే... నెవర్‌మైండ్. మనిద్దరం క్లాస్‌మేట్స్‌మి. మనం కాలేజి విడిచిపెట్టి రెండు దశాబ్దాలు దాటినా స్త్రీ పట్ల, స్త్రీవాదం పట్లా మన అభిప్రాయాల్లో ఏవిధమైన మార్పూ రానందుకు నేను చాలా సంతోషిస్తున్నాను..." నవ్వుతూ చెప్పింది రూపాదేవి.

"అది సరే... మనిద్దరం కలవకపోడానికి వేరే కారణం కూడా ఉంది.." చెప్పింది సీమాపటేల్.

ఏమిటన్నట్టుగా గోడలపై ఉన్న ఈజిప్షియన్ పెయింటింగ్స్ గమనిస్తూ సీమవైపు చూసింది రూపాదేవి.

"కాలేజినుంచి మనం డిగ్రీలు తీసుకుని బైటకొచ్చాక డాడీకి చండీఘర్ ట్రాన్స్‌ఫర్ అయింది. అక్కడే ఇంజనీర్ దీపక్ పటేల్‌తో నా వివాహం అయింది. ఢిల్లీలో కొన్నాళ్లున్నాము. ఆ తర్వాత ముంబాయి వచ్చాము. అక్కడ ఫిల్మ్‌డైరెక్షన్‌లో పి.జి డిప్లొమా కోర్స్ చదివాను. ప్రఖ్యాత డైరెక్టర్లు మృణాళ్ సేన్, కమల్ అమ్రోహీలతో పరిచయమయింది. ప్రింట్ మీడియా కన్నా విజువల్ మీడియాకున్న శక్తి అర్థమైంది. ఫిల్మ్ ఎలా తీయాలి? అనే అంశంపై కొన్ని ఇంగ్లీషు పుస్తకాలు కూడా రిఫర్ చేశాను.

కమర్షియల్ సినిమా తీయడం నా ఆశయాలకు విరుద్ధంకదా! బహుశా నా జీవితంలో నేను కలిసిన వ్యక్తుల ప్రభావమేమో లేక జీవితం పట్ల నాకున్న స్థిరమైన అభిప్రాయాల ప్రభావమో నాకయితే తెలియదు కానీ ఎప్పటికైనా ఆర్ట్‌ఫిలిం తీయాలని నిశ్చయించుకున్నా. ఈ 'వాయిస్' స్క్రిప్ట్ ఇప్పటిదనుకున్నావా? ఎన్నో ఏళ్ల కిందటే రాసి భద్రంగా దాచుకున్నాను. షాట్ డివిజన్, డైలాగ్ తో సహా అన్నీ ప్రిపేర్ చేసుకున్నాను. అంతవరకూ బాగానే ఉంది. కానీ సినిమా తీయడమంటే మాటలా?

మంచి ఆర్ట్ ఫిలిం దర్శకులకు గవర్నమెంటు ఫిలిమ్ నిర్మించడానికి ఆర్థికసహాయం చేస్తుంది. కానీ నాకు సహాయం ఎవరు చేస్తారు? అక్కడికీ కన్‌సర్న్‌డ్ శాఖకు నేను స్క్రిప్టుని ప్రజంట్ చేసి నా



ప్రపోజల్ పంపాను. కానీ, ప్చ్... నా ప్రపోజల్ నిర్దాక్షిణ్యంగా తిరస్కరింపబడింది. రాజాశ్రయంలేని కళాకారుడు ఎందుకు రాణించలేడో అప్పుడే నాకు అర్థమైంది. డబ్బు యొక్క ప్రాముఖ్యత తెలిసింది.

నా భర్త దీపక్ 'ఎందుకొచ్చిన తలనెప్పి? ఇప్పుడు నీకేం తక్కువని? టైమ్‌పాస్ కోసం నీకున్న ఫ్రెండ్ సర్కిల్ చాలదా? బాబు రాహుల్ ఉన్నాడు. వాడి ఆలనాపాలనా చూసుకో. లేనిపోని టెన్షన్‌లెందుకు పెట్టుకుంటావ్? ఇప్పుడు నువ్వు సినిమా తియ్యకపోతే దేశానికి వచ్చే నష్టమేంటి?' అనేవాడు.

ఒకవిధంగా చూస్తే నా భర్త వాదన నిజమేనేమో అనిపించేది నాకు. కానీ డిస్‌కరేజ్ చెయ్యకపోయినా ఎంకరేజ్ చెయ్యలేదంటే డిస్‌కరేజ్ చేసినట్టే కదా? అఫ్‌కోర్స్, అతడి వైపునుంచి ఆలోచిస్తే అతడు చెప్పే విషయం కరెక్టే అనిపిస్తుంది. కానీ అంతర్గతంగా ఫిలిం తీయాలని బర్న్ అవుతున్న నా ఏంబిషన్ మాటేమిటీ?" అంటూ సీమాపటేల్ కొద్ది క్షణాలు ఆగి రూపాదేవితో "ఆర్యూ ఫీలింగ్ బోర్?" అనడిగింది.

రూపాదేవి తల అడ్డంగా ఊపుతూ "నోనో నాటెటాల్... చాలా ఇంటరెస్టింగ్‌గా ఉంది. చెప్పరాని ఆసక్తిగా ఉంది. తన ఆశయం సాధించడంకోసం ఒక స్త్రీ తలపెట్టిన ఒంటరిపోరాటం నీ కథ. ఐ మీన్... నీవు ఎదుర్కొన్న అనుభవం.... చెప్పు.. చెప్పు. మధ్యలో ఆపకు" అంది రూపాదేవి.

"అయామ్ సారీ రూపా!" బాధను వ్యక్తం చేస్తూ లేచి నిలబడింది సీమ.

"దేనికి?" రూపాదేవి అడిగింది అర్థం కాక.

"నువ్వొచ్చి ఇంతసేపయినా కనీసం ఏం తింటావు? ఏం తాగుతావు? అనికూడా అడగలేకపోయిన నా కుసంస్కారానికి బాధపడుతున్నాను. రెండు దశాబ్దాల తర్వాత కలిశావు నువ్వు" అంది సీమ.

సీమాపటేల్ మాటలకు పెద్దగా నవ్వింది రూపాదేవి.

రూపాదేవి నవ్వుతో తనూ శృతి కలిపింది సీమ.

"నీ పిచ్చిగానీ క్లాస్‌మేట్స్ మధ్య మర్యాద లేంటి?" అంది రూపాదేవి.

సీమ లోపలకెళ్లి ఫ్రిజ్ తెరిచి రెండు ఫాంటా డ్రింకులు తీసుకొచ్చింది.

"సో... ఇంతవరకూ బాగానే ఉంది. మరి ఫిలిం ఎలా తీశావ్?" అడిగింది రూపాదేవి డ్రింక్ తాగుతూ.

"ఇంగ్లీషులో ఒక మంచి సామెత ఉంది. అఫ్‌కోర్స్ తెలుగులోనూ ఉందనుకో" ఫాంటా సిప్ చేస్తూ అంది సీమాపటేల్.

"ఏమిటది?"

"మనసుంటే మార్గముంటుంది."

"అదే ఎలా సాధ్యమయిందని అడుగుతున్నాను" అడిగింది రూప.

"ఒక లేడీ ఎన్.ఆర్.ఐ ముంబై లో పరిచయమైంది. ఆ పరిచయం స్నేహంగా మారి, నా 'వాయిస్' కు క్యాపిటల్ అరేంజ్ చేసిందామె.

"బాగానే ఉంది. మరి నువ్వు ముంబాయిలోనే ఉండచ్చు కదా?"

"ముంబాయిలోనే ఉన్నాను. నా భర్త దీపక్‌కు అయిదేళ్లకింద ఇక్కడ మంచి ఫర్మ్‌లో అవకాశమొచ్చింది" చెప్పింది సీమ.

"అలాగా... అయితే అప్పుడప్పుడు ఓ వి.ఐ.పి లా కేవలం విజిట్ చెయ్యడానికొస్తావన్నమాట ఇక్కడకు" అంది రూపాదేవి.

"అవును మరి నేను ఎంచుకున్నది ఓ స్థిరనివాసం లేని ప్రొఫెషన్ కదా"

"అయితే ఇన్నేళ్లనుంచీ నువ్వు ఈ సిటీలో ఉన్నట్టు నేనే భ్రమ పడ్డానన్నమాట" చెప్పింది రూపాదేవి.

"మీ అబ్బాయి రాహుల్ ఏంచేస్తున్నాడు?"

"బెంగుళూర్‌లో కంప్యూటర్ ఇంజనీరింగ్ చదువుతున్నాడు. అన్నట్టు నీ గురించి చెప్ప




నేలేదు"

"మావారు కెనడాలో ఉన్నారు. త్వరలోనే ఇక్కడకు రాబోతున్నారు. అమ్మాయి ప్రగతి ఢిల్లీ ఐ.ఐ.టి లో స్టడీ చేస్తోంది." చెప్పింది రూప.

"వెరీనైస్. ఇక నీ గురించి చెప్పనవసరం లేదు" అంది సీమ.

"ఎందుకని? "

"ఎందుకంటే మనిద్దరమూ మీడియావైపు ఎక్స్‌పోజ్ చెయ్యబడ్డాం. కాబట్టి మన గురించి కొంతమందితో, కనీసం కొంతమందితో అయినా మన ఐడెంటిటీ గురించి చెప్పుకునే అవసరం లేదుకదా!" అని చెప్పింది సీమాపటేల్.

"కానీ సీమా! గుర్తింపు భూతం ఇంతవరకూ నన్ను ఆవహించలేదు. నేను నా గుర్తింపుకోసం ఎన్నడూ ప్రయత్నించలేదు. చెయ్యనుకూడా. నా జీవితాన్ని స్త్రీ సమస్యలపై ఫోకస్ చెయ్యాలని నిర్ణయించుకున్నా... అఫ్‌కోర్స్... మీడియా అది కవర్ చేస్తే అది నా తప్పు కాదు.... ఒంటరిగా అజ్ఞాతంగా ఉండడానికి ఇష్టపడతాను." అంది రూపాదేవి.

"మనిద్దరి ఇతివృత్తం సామాజిక సమస్య అయినప్పుడు మీడియా వైపు ఎలాగైనా ఫోకస్ చెయ్యబడతాం. కానీ గుర్తింపు అనేది మానసికమైన ఆనందాన్నిచ్చినా, అంటే మనిషి యొక్క 'ఇగో' ని చల్లార్చినా బాధ్యతను మాత్రం పెంచుతుంది" అంది సీమా పటేల్

"అఫ్‌కోర్స్" అంది రూపాదేవి.

"మీరు నార్తిండియన్స్ అయినా, తెలుగు మాత్రం స్పష్టంగా మాట్లాడడం నేర్చుకున్నావే? " అంది రూపాదేవి.

"డాడీ జాబ్ విషయమై నాకు పదేళ్ల వయసప్పుడే వచ్చి సెటిలయ్యామిక్కడ. మనిషి ఏ సొసైటీ మధ్య పెరిగితే అక్కడి ఆచార వ్యవహారాలతో ప్రభావితం అవడం సహజమే కదా" చెప్పింది సీమ.

"మన ఫ్రెండ్స్... ఇంకా ఎవరెవరు ఎక్కడెక్కడ సెటిలయ్యారో నీకేమైనా ఐడియా ఉందా? " అడిగింది సీమాపటేల్.

"తారకేశ్వరి నీకు తెలుసుకదా? "

"ఎవరు? తన సందేహాలతో లెక్చరర్స్‌ని పీడిస్తూ ఉండేది ఎప్పుడూ.. ఆమేనా? "

"ఎస్...ఎస్.. ఆమే. ఇప్పుడు ఫైనాన్స్ సెక్రెటరీగా పనిచేస్తోంది.

"వెరీగుడ్... ఇంకా.. అరె... మమత.. ఆరోజు లైబ్రరీ మెట్లపైనుంచి జారిపడింది కదా! ఆమె ఎక్కడుంది? "

"మమత అప్పుడు. ఇప్పుడామె డాక్టర్ మమత... ఆర్థోపిడిక్ సర్జన్"

"బహుశా ఆరోజు అలా మెట్లపైనుంచి జారిపడడం వల్ల ఇన్‌స్పైర్ అయిందేమో!"

సీమాపటేల్ మాటలకు నవ్వింది రూపాదేవి

"శాంతకుమారి అని ఎప్పుడూ పాడుతూండేది. ఏ పాట అదీ... ఆ.. గుర్తొచ్చింది... రాజశేఖరా నీపై మోజు తీరలేదురా... ఎక్కడుందామె? " సీమ అడిగింది.

మళ్లీ నవ్వింది రూప.

"శాంతకుమారి.... ఆమె ఏదో లెక్చరర్‌గా పని చేస్తోందనుకుంటాను. రెండు దశాబ్దాల కిందటి విషయాలు. ఇప్పుడు అందరికీ వివాహాలైపోయి యుక్త వయసు వచ్చిన పిల్లలున్నారు. దాదాపు అందరికీ.. ఐమీన్... అందరూ ఏదో ఒక మంచి పొజిషన్‌లోనే ఉన్నారు"

"నీ లైఫ్ ఏంబిషన్ 'వాయిస్' గురించి చెప్పు."

"ఏముందీ... పరిస్థితులపై తిరగబడిన ఓ స్త్రీ కథ!"

"పరిస్థితులంటే? "

"అంటే ఒక స్త్రీని తను సమాజంపై తిరగబడేంత వరకూ ఆమెని సమాజం అణచివేస్తుంది. చివరకు విసిగిపోయిన ఆమె తనని అటువంటి పరిస్థితుల్లోకి నెట్టిన వారిపై యుద్ధం ప్రకటిస్తుంది. తన ఉనికి

కోసం పోరాటం చేస్తుంది."

"అంటే శేఖర్ కపూర్ 'బండిట్ క్వీన్' టైపా?"

"నోనో.. దానికీ దీనికీ భేదముంది. ఎందుకంటే బండిట్‌క్వీన్ ఒక వాస్తవ కథ ఆధారంగా నిర్మింపబడింది. ప్రతీకారం అందులో ప్రధానాంశం. అఫ్‌కోర్స్... వాయిస్ లోనూ వాస్తవం లేకపోలేదు. 'వాయిస్' ఇతివృత్తం కూడా నిజజీవితం లోంచి తీసుకోబడిందే. కానీ బండిట్‌క్వీన్ ఒక పాప్యులర్ విషయం. 'వాయిస్' మన దైనందిన జీవితంలో మమేకమై, మన సుని శిత దృష్టికి మాత్రమే అందే అంశం." అంది సీమ.

"నిజమేనేమో. లేకపోతే ఫ్రెంచ్ ఫిలిమ్ ఫెస్టివల్ కోసం మనదేశం నుండి ఎంపిక య్యిందంటే మామూలు విషయమా?" రూపాదేవి అంది.

"అంత పొగడవలసిన అవసరంలేదు. ఏదో పెద్ద గుర్తింపు రావాలని నేను కోరుకో లేదు. నా భావాల్ని ఎక్స్‌ప్రెస్ చేశానంతే! నేను ముందే చెప్పాకదా ప్రింట్ మీడియాకన్నా విజువల్ మీడియాకు రేంజ్ ఎక్కువ అని! అక్షరాస్యులు మాత్రమే ఒక పుస్తకాన్ని చదవగలుగుతారు. కానీ సినిమా చదువురాని మనుషులకు కూడా అర్థమవు తుంది. అదే తేడా!" సీమ చెప్పింది.

"ఇంతకీ 'కేన్స్ ఫిలిమ్ ఫెస్టివల్లో' నీ 'వాయిస్'కు అవార్డు వస్తుందా?"

"చెప్పలేం. రావాలని కోరుకుంటాను. రావచ్చు రాకపోవచ్చు. కానీ మనదేశం తరపున కేన్స్‌కు ఎంపిక కావడమే గొప్ప విషయం కదా!"

"ఖచ్చితంగా. నిజంగా నువ్వో గొప్ప సాహసం చేశావు"

"థ్యాంక్యూ"

"అవునూ... కేన్స్‌లో బహుమతి సంపా దించిన భారతీయ చిత్రాలు ఏమన్నా ఉన్నాయా?"

"ఎందుకు లేవు? మీరానాయర్ తీసిన 'సలాం బాంబే' కు కేన్స్ అవార్డు వచ్చింద నుకుంటాను. నలభై లక్షల రూపాయల ప్రైజ్‌మనీ కూడా వచ్చిందామెకు"

"సీమా! మరి నేను బయలుదేరతాను"

"అప్పుడేనా... డిన్నర్ తీసుకుని వెళ్లు"

"లేదు... నెక్స్ట్ టైమ్ వస్తాలే"

"నీ సెల్ నెంబరివ్వు" అడిగింది సీమా పటేల్.

చెప్పింది రూపాదేవి.



సమయం ఉదయం పదకొండున్నర. ఆబిడ్స్‌నుంచి నాంపల్లివైపు తన 'ఓపెల్ ఆస్ట్రా' కారుని డ్రైవ్‌చేసుకుంటూ వెళ్తున్నాడు రవికిరణ్. వాహనాల రద్దీ ఎక్కువగా ఉండ టంతో స్లోగా వెళుతోంది కారు. తన కారు మైసూర్ కేఫ్ సమీపించేసరికి, తనముం దున్న బస్సులు, టూ వీలర్స్ ఇతర వాహ నాలన్నీ పాస్ అయిపోయాయి. ఇంతలో మైసూరు హోటల్ వీధిలోంచి కలెక్టరాఫీసు వైపు వెళ్ళడానికి వాహనాలు ఒక్క ఉదు టున దూకబోయేసరికి, గేరు మార్చి స్పీడు పెంచి పద్మవ్యూహంలోంచి అభిమన్యుడిలా కారుని వేగంగా ట్రాఫిక్‌లోంచి బైటకి





తీశాడు.

అన్నపూర్ణ హోటల్ దగ్గర సరిగ్గా అదే క్షణంలో రోడ్ క్రాస్‌చేస్తోంది స్పందన. ఊహించని సంఘటన! స్పందన ట్రాఫిక్ ఆగిపోయిందని రోడ్‌క్రాస్ చేస్తోంది. స్పందన రోడ్‌క్రాస్ చేస్తున్న విషయం ఒక సెకన్లో నాలుగోవంతు సమయంలో అర్థమై ఒక్కసారి బ్రేక్‌పై కాలుపెట్టాడు రవికిరణ్. పెద్దగా కీచుమంటూ శబ్దంచేస్తూ స్పందన ఎదుట అంగుళాల తేడాతో ఆగిపోయింది రవికిరణ్ 'ఓపెల్ ఆస్ట్రా'. కారు నడుపుతున్న రవికిరణ్‌కు కారు ఎదుట నిలబడ్డ స్పందనకూ ఇద్దరికీ చెమటలుపట్టాయి ఒకేసారి.

రవికిరణ్ బ్రేకు వెయ్యకపోతే ఆ స్పీడుకి స్పందన గాల్లో ఎగిరిపోయిఉండేది. కారు టైర్లు రోడ్‌పై బలంగా ప్రెస్ కావడంతో, రోడ్‌పై టైర్‌ప్రింట్స్ ఏర్పడ్డాయి. ఏదో పెద్ద ప్రమాదాన్ని ఊహించిన చుట్టుపక్కలవాళ్ళు టెన్షన్ ఫీలై మళ్ళీ ఒక్కసారిగా రిలీఫ్ ఫీలయ్యారు.

"ఎంత రాష్‌గా నడుపుతున్నాడో చూశారా? "

"రాష్‌గా కాదు... తను కంట్రోల్‌లోనే నడుపుతున్నాడు"

"పెద్ద ప్రమాదం తప్పిపోయింది"

"ఇప్పుడు ఎవరికీ ఏ ప్రాబ్లమ్‌లేదు"

"ఏంటీ ఆ అమ్మాయి అలాగే కదలకుండా కారు కెదురుగానే నిలబడిపోయింది"

"ఆమె వాలకం చూశారా? నిజంగా ఆ కళ్లలో దహించే శక్తే గనక ఉంటే ఈ పాటి కతను మాడిపోయి భస్మం మిగిలుండేది".

"ఏదో అంటోందతన్ని" ఇలా తలా ఒక విధంగా మాట్లాడుకుంటున్నారు. రవికిరణ్‌ని సమీపించిన స్పందన పళ్లు కొరుకుతూ ఒకే ఒక వాక్యం చెప్పిందతనితో, అది.

"కారు దిగరా ముందు... ఇడియట్!"

స్పందన అలా అనేసరికి రవికిరణ్‌కు కోప మొచ్చింది. అతను కోపాన్ని కంట్రోల్ చేసుకుని కారు తీసి ఒక పక్కగా పార్క్‌చేసి వచ్చి స్పందనతో

"మీరు మర్యాదగా మాట్లాడ్డం నేర్చుకోండి ముందు" అన్నాడు.

"ఎవరికివ్వాలిరా మర్యాద? నీకా? చెప్పు తీస్కుని కొడతా రాస్కెల్. డబ్బు అహంకారం తలకెక్కి నీ ఇష్టమొచ్చినట్టు కారు నడపడానికి ఇదేమన్నా నీ బాబు రోడ్డనుకున్నావా? " అంది.

రవికిరణ్‌లో సహనం నశించింది. 'ఎందుకీమె అలా అరే... ఒరే... అంటూ వల్గర్‌గా మాట్లాడుతోంది? ' అని మనసులో అనుకుని, "ఇదిగో చూడు. అరె... ఒరె... అంటే మర్యాదగా ఉండదు. ఏమిటే... ఏమైందిప్పుడు నీకు? తెగరెచ్చిపోతున్నావ్... నీ కాళ్లు విరిగాయా? చేతులు విరిగాయా? " అన్నాడు.

జనమంతా వీరిద్దరి చుట్టూ మూగి వినసాగారు.

"అంటే ఏమిట్రా నీ ఉద్దేశం? కాళ్లూ, చేతులూ విరగ్గొట్టడానికి, లేక చంపెయ్యడానికి డ్రయివింగ్ నేర్చుకున్నావా నువ్వు? నిన్ను ఈ నిమిషంలోనే కలెక్టరు దగ్గరకి తీసుకెళ్ళి క్షణాలమీద నీ డ్రయివింగ్ లైసెన్స్ రద్దుచేయించి, నీకు శిక్ష పడేటట్లు చెయ్యగలను ఖబడ్దార్" అంది ఉరుముతూ.

"నేను నిజంగా తప్పు గనుక చేసివుంటే, నాకై నేనే విధించుకునేవాణ్ణి శిక్ష" అన్నాడు.

"నీ డ్రయివింగ్ లైసెన్సివ్వు ముందు? " అడిగింది.

"అవనసరంగా కేకలు వేసి బి.పి. పెంచుకోకు. నిదానంగా, శాంతంగా ఆలోచించి మాట్లాడు. నా డ్రయివింగ్ లైసెన్స్ అడిగే హక్కు నీకు లేదు"

"ఇష్టమొచ్చినవాళ్ళని యాక్సిడెంట్ చేసే హక్కు నీకుందా? "

"అరె... నీకేమన్నా పిచ్చా? నా జీవితంలో ఇప్పటిదాకా కారు నడిపేటప్పుడు నేను ఏవిధమైన యాక్సిడెంటూ చెయ్యలేదు'



"అలాగని ఏదైనా సర్టిఫికెటుందా నీ దగ్గర? "

"నీలాంటి ఆడదాన్ని ఇప్పటిదాకా నేను చూళ్లేదు. అసలు నువ్వు నోరు విప్పకుండా ఉండిఉంటే, నీకు మనస్ఫూర్తిగా 'సారీ' చెబ్దా మనుకున్నా కానీ నువ్వు పైకి చూడ్డానికి మాత్రమే అందంగా, చదువుకున్న అమ్మాయిలా కనబడుతున్నావ్. నోరు విప్పితే ఇంత ఛండాలమని ఇప్పుడే అర్థమైంది"

రవికిరణ్ మాటలకు జనంలో కొంతమంది కిసుక్కున నవ్వారు కానీ, స్పందనవైపు చూసి మళ్ళీ ముఖాలు చూసుకోసాగారు.

"ఆడవాళ్ళంటే అంత చులకనా నీకు? అందంగా, పప్పుసుద్దల్లా, నీలాంటి మగవాళ్లు ఏ దౌర్జన్యం చేసినా, పెదవి విప్పకుండా ఉంటే మంచివాళ్ళని, మర్యాదస్తులనీ అర్థమా? వారెవ్వా? నీ నిర్వచనం బ్రహ్మాండంగా ఉంది. ఏయ్ మిస్టర్... ఆడవాళ్లంటే అబలలనే రోజులు పోయాయి. ఇంకా నిద్రలోనే ఉన్నట్టుంది నువ్వు. కాస్త ఆ కళ్లద్దాలు తీసి, మూసుకుపోయిన నీ కళ్లు రెండూ తెరచి చూడు. ఈ మాటలన్నీ తర్వాత. ముందు పోలీస్‌స్టేషన్‌కు పద..." అంది స్పందన.

"పద... నాకేవిధమైన అభ్యంతరమూ లేదు" అన్నాడు.

అప్పటిదాకా వీరిద్దరి సంభాషణ విన్న జనంలో కొంతమంది కలగజేసుకుని "పోనివ్వండమ్మా. మాటామాటా అనుకున్నారు కదా! ఇక చాలు. జరిగిందేదో జరిగిపోయింది. ఇక మళ్ళీ పోలీస్ స్టేషన్లెందుకు? అతను చేసింది తప్పే" అన్నారు.

వారి మాటలకు స్పందన కొంచెం చల్లబడి, "మీ అందరికీ తెలుసుకదా అతను రాష్‌గా డ్రైవ్ చేశాడని! మరి ఆ విషయం అతను ఒప్పుకోడేం? తప్పు చేసింది చాలక మళ్ళీ మీదిమీదికి ఎలా వస్తున్నాడో చూశారా? " అంది.

"నీకు సారీ చెప్పి వెళ్ళాలనుకున్నా అని నీతో ముందే చెప్పాకదా" అన్నాడు రవికిరణ్.

"ఏంటి నువ్వు చెప్పేది సారీ? సారీ నేను కూడా చెబుతాను నా ఇష్టమొచ్చినట్టు కారు నడిపి ఎవరో ఒకరివి కాళ్లో, చేతులో విరగ్గొట్టి సారీ అంటాను. తప్పుచేసి, మళ్ళీ ఎదుటివాళ్ళని నోటికొచ్చినట్టు తిట్టి సారీ అంటాను. సారీ అంటే రెండక్షరాల మాటే కదా! ఆ మాట చెప్పడానికి ఏమీ ఖర్చు కాదుకదా? " అంది స్పందన.

స్పందన చెప్పిందాంట్లో నిజం ఉన్నదనిపించిన అక్కడివారంతా కలిసి రవికిరణ్‌తో, "పోనివ్వండి సార్ మీరు చేసినపనికి ఆమె బాధపడుతోంది. పాపం ఎంతయినా ఆడపిల్లకదా! సారీ చెప్పండి" అన్నారు.

ఇక లాభం లేదనుకుని రవికిరణ్ కళ్లద్దాలు తీసి రెండు చేతుల్తో పట్టుకుని మర్యాద పూర్వకంగా తలవంచి "మేడమ్! నేను తప్పు చేశాను. నన్ను క్షమించండి" అన్నాడు.

దానికి స్పందన "ఎవర్ని క్షమించినా, నిన్ను మాత్రం క్షమించను. ఎందుకంటే నువ్వు చేసింది చిన్న తప్పు కాదు. ఒక నిండుప్రాణాలు తీయాలనుకున్నావ్ నువ్వు! నువ్వు చేసింది క్షమార్హంకాని నేరం! ఏ చట్టాలు, ఏ మనుషులు క్షమించినా, నేను మాత్రం నిన్ను క్షమించలేను" అంది కోపంగా.

జనమందరూ విస్తుపోయారు స్పందన మాటలకు.

"ఇదేంటి? ఈమె అంత ఈజీగా వదిలేట్టు లేదే? "

"అసలామె ఉద్దేశమేంటో? "

"అబ్బో. ఈ అమ్మాయి చాలా మొండిఘటంలా కనపడుతోంది సుమా"

"ఆడవాళ్ళకు జాలిగుండె ఉంటుందంటారు"

"మీరు పొరపడ్డారు సార్, జాలిగుండె మగవాళ్ళకుంటుంది. ఆడవాళ్లక్కాదు"




"డబ్బులేమైనా అడుగుతుందేమో!"

"ఛ... ఛ... ఆమె అలాంటి రకంలా అగుపించటంలేదు"

ఈవిధంగా తలా ఒకవిధంగా స్పందనకు వినబడకుండా తమలో తామే మెల్లగా వ్యాఖ్యానించుకోసాగారందరూ. కొంతమందికయితే ఈ సన్నివేశం చాలా ఆసక్తిగా అనిపించింది. "సీన్లో మంచి ట్విస్ట్ ఉందబ్బాయ్" గుంపులోంచి, బాగా సినిమాలు చూసే ఒకవ్యక్తి అన్నాడు పక్కాయన్తో.

"మీరిద్దరూ కలిసి ఒక అండర్‌స్టాండింగ్‌కి రానప్పుడు పోలీస్‌స్టేషనుకు వెళ్లడమే ఉత్తమం. అక్కడ కూడా మీ సమస్య పరిష్కారం కాకపోతే కోర్టుకెళ్లండి. ఓషిగ్గా సంవత్సరాల తరబడి వాగ్వివాదాలు చేస్కోవచ్చు" అన్నారొకరు విసుగ్గా.

"అంత అవసరం లేదు. నేను చెప్పినట్టు అతను చేస్తే చాలు. వెళ్ళిపోవచ్చు" అంది స్పందన ఒక నిర్ణయానికొచ్చినట్టు.

రవికిరణ్‌తోపాటు అక్కడున్న వాళ్ళంతా 'ఏం చెయ్యమంటుందో?' అని క్యూరియస్‌గా చూడసాగారామెవైపు.

"ఏం చెయ్యమంటావో చెప్పు? నాకు అవతల చాలా పన్లున్నాయి" రవికిరణ్ అన్నాడు విసుగ్గా.

"అంటే ఏమిటి నీ ఉద్దేశమసలు? అక్కడికి నువ్వు ఏదో బిజీగా ఉన్నట్టూ, మేమే పనీపాటా ఏదీలేకుండా రోడ్డుమీద స్పీడుగా వెళ్ళే వాహనాలకు అడ్డమొస్తున్నట్టూనా?" ప్రశ్నించింది స్పందన.

"కథ మళ్ళీ మొదటికొచ్చింది"

"పామూ చావదు. కర్రా విరగదు"

"నీకేం కావాలో చెప్పు నా తల్లీ!" అన్నారంతా.

"నా కాళ్లు పట్టుకుని, క్షమాపణ అగడమనండి" స్పందన అలా అనేసరికి ఏదో పెద్ద పిడుగు తమ పరిసరాల్లోనే పడ్డట్టు ఫీలై అందరూ భయపడిపోయి స్పందనవైపు, రవికిరణ్‌వైపు ఎగాదిగా చూడసాగారు.

"ఛస్తే పట్టుకోను. ఎంత దూరమైనా వెళ్తాను" విసురుగా అన్నాడు రవికిరణ్.

"అయితే నేను కూడా ఛస్తే క్షమించను నిన్ను" స్థిరంగా పలికింది స్పందన.

"పద పోలీస్‌స్టేషనుకు"

"పద" పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళారిద్దరూ.

★ ★ ★

స్పందన ఇల్లు.

"అతన్నెందుకు వదిలి పెట్టారు డాడీ? అతనేం చేశాడో తెలుసా మీకు?" ఉక్రోషంగా తండ్రితో అంది స్పందన. ప్రసాదరావు నవ్వుతూ.

"తెలుసు... అంతా తెలుసు. మనిషన్నాక తప్పులు చెయ్యడం సహజం" అన్నాడు.

"ఏమిటి సహజం? జరగరానిది ఏదైనా జరిగుంటే ఈ రోజు మీతో మాట్లాడ్డానికి మీ కూతురు మిగిలి ఉండేదికాదు" కోపంగా చెప్పింది స్పందన.

"అలా ఏమీ జరగదు. రవికిరణ్ నాకు తెలుసు. మంచీ మర్యాద తెలిసిన యువకుడు. తొందరపడే ఈనాటి కుర్రకారు రకం కాదతను. హి ఈజ్ జంటిల్మన్" కితాబిస్తూ అన్నాడు ప్రసాదరావు.

"దిసీజ్ టూ మచ్ డాడ్. మీరు పక్షపాత ధోరణిలో మాట్లాడుతున్నారు. అతను మంచీ మర్యాద తెలిసినవాడన్నారు. అంటే నేను మంచీ మర్యాద తెలియనిదాన్నా? అతను తొందరపడడు. నేనే తొందరపడి చేయరానిది చేస్తానా? అతడు జంటిల్మెనా? మరి నేనెవరు?" అంది.

"అవునే. నేను చెప్తున్నా విను. ముమ్మాటికీ తప్పు నీదే అయిఉంటుంది. నువ్వే రోడ్డుపై కళ్లు మూసుకుని ట్రాఫిక్‌ని చూసుకోకుండా నడిచి ఉంటావు. మీ డాడీ ముఖం చూసి పాపం ఆ అబ్బాయి నిన్ను క్షమించి వదిలేసుంటాడు" చెప్పింది అన్నపూర్ణ.

"నీకేం తెలీదు నువ్వు ఊర్కో అమ్మా. ఏ రోజైనా నాకు సపోర్టుగా మాట్లాడావా

నువ్వు? నేను చేసిన ఏ పనీ నీ కళ్లకు సవ్యంగా అనిపించదు" ఆమె గొంతులో అసహనం ధ్వనించింది.

"నోర్ముయ్... చిన్నా పెద్దా లేకుండా ఎంత మాటంటే అంత మాటనేస్తావు. తల్లిదండ్రులెక్కడైనా తమ పిల్లల్ని శత్రువులుగా భావిస్తారా? " అంది అన్నపూర్ణ.

"కోట్ల రూపాయలు విలువచేసే నాలుగయిదు రకాల బిజినెస్సులున్నాయి రవికిరణ్‌కు. ఓర్పూ, నేర్పూ, సహనం లేని వ్యక్తి ఇంత మేనేజ్‌మెంట్ చెయ్యలేడు. మీరిద్దరూ అటువంటి ప్రతికూల పరిస్థితుల్లో కలవవలసి వచ్చినందుకు నేను చాలా బాధపడుతున్నాను. నేను ఊహించింది వేరు. మీరిద్దరూ కలిసిన సందర్భం వేరు" బాధపడుతూ అన్నాడు.

"ఏమిటి మీరు ఊహించినది? " తండ్రి నడిగింది స్పందన.

ప్రసాదరావు చెప్పింది కొంచెం అర్థమై, కానట్టూ ఉంది అన్నపూర్ణకు.

★ ★ ★

రాత్రి పదవుతోంది. స్పందన తన రూమ్‌లో చదువుకుంటోంది.

"విషయమేంటి? " భర్తనడిగింది అన్నపూర్ణ. జరిగిందంతా వివరంగా చెప్పాడు ప్రసాదరావు. భర్త చెబుతున్నది ఆలకించసాగిందామె.

"నేను పోలీస్‌స్టేషన్ వెళ్లేసరికి మనమ్మాయీ, రవికిరణ్ ఎస్సై ఎదుట కూర్చుని వున్నారు. రవికిరణ్ కారుని నేను గుర్తుపడతాను. రవికిరణ్ తండ్రి ప్రభాకరరావూ నేనూ క్లాస్‌మేట్స్. వాళ్లింటికి నేను తరచుగా వెళ్ళివస్తుంటాను. రవికిరణ్ మంచి యువకుడు. మర్యాదస్తుడు. 'అంకుల్' అంటూ నాతో ప్రేమగా మాట్లాడతాడు.

ప్రభాకరరావుకు మన స్పందన గురించి తెలుసు. ప్రభాకరరావు భార్య దయమంతి కూడా "అన్నయ్యగారూ" అంటూ ఎంతో మర్యాద పూర్వకంగా మాట్లాడుతుంది. వారికి ఇంటర్ చదివే అమ్మాయి ఉంది. పేరు కిరణ్మయి. చాలా మర్యాదగల కుటుంబం. ఆ కుటుంబంలో ఎవరికీ తాము ధనవంతులమనే అహంకారం లేదు. ఇవీ వారి వివరాలు. అయితే నేను పోలీస్ స్టేషన్‌కి వెళ్ళాంతర్వాత రవికిరణ్ లేచి నిలబడ్డాడు. విషయం తెలుసుకున్న నేను మనమ్మాయిని సముదాయించి ఎస్సైతో మాట్లాడి ఇద్దర్నీ బయటికి తీసుకొచ్చాను. అదీ జరిగిన సంగతి" అన్నాడు.

"మనమ్మాయి గురించి ఏమన్నా ఫిర్యాదు చేశాడా రవికిరణ్? " అంది.

"ఏంలేదు. 'ఏదో చిన్న విషయమని, తప్పు తనదే' అంటూ నాముందే అమ్మాయికి సారీ చెప్పాడు. కానీ ఈ సంఘటన జరక్కుండా ఉంటే బావుండేది. నేను ప్రభాకరరావుతో మాట్లాడి, మనమ్మాయిని రవికిరణ్‌కిచ్చి చేద్దామని అనుకున్నాను. కానీ రవికిరణ్ స్పందన గురించి వేరేవిధంగా ఊహించకుండా ఉంటే బాగుంటుంది" ప్రసాదరావు అన్నాడు.

"ఎందుకు అనవసరంగా బాధపడతారు? ఆ కుర్రాడే చెప్పాడన్నారుకదా- తప్పు తనదే అన్నాడని. పైగా రవికిరణ్ మంచివాడు, మర్యాద తెలిసినవాడని చెప్తున్నారుకదా! మీరూహిస్తున్నట్టుగా మనమ్మాయి గురించి చెడుగా ఏమీ అనుకోడులెండి. కానీ, 'అప్పుడే అమ్మడి పెళ్లికేంతొందర? ' అన్న మీరేనా అమ్మాయి పెళ్లి గురించి ఆలోచిస్తున్నది? అంటే పైకి అలా అన్నారే కానీ అమ్మాయి పెళ్ళి చెయ్యాలని మీరు కూడా భావిస్తున్నారన్నమాట" అంది అన్నపూర్ణ.

"కాదామరి!" అన్నాడతను.

"దీనిక్కొంచెం నోటి దురుసెక్కువండీ. మాట పడదు. అత్త, మామ, ఆడబిడ్డల దగ్గర సవ్యంగా ప్రవర్తిస్తుందంటారా? " కొంచెం అనుమానంగా అడిగింది అన్నపూర్ణ.

దానికి సమాధానంగా ప్రసాదరావు




నవ్వుతూ "నీ పిచ్చిగానీ, అన్నీ పెళ్లయ్యేంత వరకే. తర్వాత అన్నీ సర్దుకొంటాయి.

అంతెందుకు? నిన్ను చూసి వెళ్లింతర్వాత మా అమ్మతో ఎవరో నీ గురించి చెబుతూ, 'ఎవరూ? అన్నపూర్ణ... వట్టి జగడాలమారి అమ్మాయి. ఎప్పుడూ ఎవరో ఒకరితో కొట్లాడుతూ ఉంటుంది' అని చెప్పారట. అవన్నీ మేము నమ్మివుంటే మనిద్దరి పెళ్లి జరిగుండేదా! కాబట్టి పెళ్ళి అన్న తర్వాత ఇవన్నీ మామూలే" అన్నాడు. భర్త మాటలకు పకాపక నవ్వింది అన్నపూర్ణ. ప్రసాదరావు కూడా భార్య నవ్వుతో శ్రుతి కలిపాడు.

"కొంపదీసి మీ తమ్ముడు అదే గోపాల్రావ్‌కు మన స్పందననిచ్చి పెళ్లి చేసే అయిడియా ఏమన్నా ఉందా నీకు?" అన్నాడు ప్రసాదరావు.

"ఎలా అనుకుంటానండీ? వాడు ఏదో పెద్ద సినిమా డైరెక్టరవ్వాలని పదేళ్లనుంచీ ఒక స్థిరనివాసమంటూ లేకుండా అలా తిరుగుతూనే ఉన్నాడు. వాడి మాటలకు, చేతలకు పొంతనే ఉండదు. పదేళ్లనుంచి వాడు సాధించింది ఏమీలేదు. ఇకపై ఏదైనా సాధిస్తాడని ఆశ కూడా లేదు. ఆ సినిమా ఫీల్డుకు వెళ్ళినవాళ్లు ఎవరు బాగుపడ్డారు కనుక వీడు బాగుపడ్డానికి? అటువంటి తాడూబొంగరం లేనివాడికి మనమ్మాయినిచ్చి చేస్తే మనపని గోవిందే! అమ్మాయి ఒక్కర్తినీ ఇంట్లో ఉంచి, ఔట్‌డోర్ షూటింగులకని వెళ్లి ఆర్నెల్లు తర్వాతొస్తాడు. అప్పుడు అమ్మాయి పరిస్థితి ఏమిటి? చిన్న ఉద్యోగమైనా, వ్యాపారమైనా ఒకచోట స్థిరంగా చేసుకునేవాడికి ఆడపిల్లనిస్తే సుఖపడుతుంది. వాడికెందుకు దండుగ?" చెప్పింది అన్నపూర్ణ.

"తమ్ముడని పక్షపాతం చూపకుండా నిజం మాట్లాడినందుకు నిన్ను అభినందిస్తున్నాను అన్నపూర్ణా. అంతేకాదు నీలాంటి మంచి భార్య నాకు దొరికినందుకు గర్వపడుతున్నాను కూడా" అన్నాడు ప్రసాదరావు.

"అన్నట్టు అమ్మాయి పి.ఓ. పరీక్ష ఎప్పుడు?" అన్నాడు.

"రేపే"

"రేపా?"

"ఔను"

"స్పందన రాసే మొదటి పోటీ పరీక్ష ఇది" అన్నాడు.

"కోచింగ్ కూడా తీసుకుందిగా. బాగానే రాస్తుందిలెండి"

"బాగా రాయడం కాదోయ్. మన అమ్మడు డెఫినిట్‌గా పాసవుతుందని చెప్పు" పిడికిలి బిగించి మరీ చెప్పాడు ప్రసాదరావు.

"అంత గ్యారంటీగా ఎలా చెప్పగలుగుతున్నారు?"

"మరి అదే నీకూ నాకూ తేడా! నా కూతురిపై నాకు చాలా నమ్మకం"

"మరీ అంత నమ్మకం పనికిరాదండీ. నిర్ణయాలు తీసుకునేవాడు దేవుడు! కర్మని మాత్రమే మనం ఆచరించాలి. ఫలితాన్ని అతనిపై వదిలివేయాలి" అంది.

★ ★ ★

ఉదయం తొమ్మిదిన్నర. స్థలం: స్టాన్లీ జూనియర్ కాలేజ్. కొత్త యాష్‌కలర్ 'సీలో' కారొకటి కాలేజ్ ఆవరణలో వచ్చి ఆగింది. కిరణ్మయి కారు దిగింది. క్లాస్ రూమ్. ఇంగ్లీషు క్లాస్ మొదలైంది. లెక్చరర్ ఎ.వి.ఆర్. మూర్తికి సుమారు నలభై అయిదేళ్లుంటాయి. మూర్తికి ఇంగ్లీషంటే మక్కువ. ముఖ్యంగా షేక్స్‌పియర్ డ్రామా లంటే అతనికి చాలా ఇష్టం. అతను క్లాస్ రూమ్‌లో స్టూడెంట్స్‌కు షేక్స్‌పియర్ నాటకం గురించి లెక్చరివ్వడమేకాక, నటించి చూపించేవాడు. అందుకే ఎ.వి.ఆర్ మూర్తి క్లాసు తీసుకుంటున్నాడని తెలిస్తే, చుట్టుపక్కల క్లాసులవాళ్లు చాలామంది ఎంట్రన్స్ వద్ద నిలబడి మరీ ఆలకించేవారు.

ప్రిన్సిపాల్ సత్యమూర్తికి కూడా ఎ.వి.ఆర్. అంటే అభిమానం. మిగతా లెక్చ

రర్స్ ఎ.వి.ఆర్ మూర్తిని ఆదర్శంగా తీసుకోవాలని . సూచించేవాడు. అతను చూపించే ప్రొఫెషనలిజం చూసి ఇతర అధ్యాపకులు చాలా విషయాలు గ్రహించాలని కోరుకునేవాడు. ఎ.వి.ఆర్. మూర్తి పాఠం చెబుతున్నప్పుడు కంప్లీట్‌గా అందులో లీనమైపోయేవాడు.

కొంతమంది సీనియర్ స్టూడెంట్స్ అతణ్ణి ఆటపట్టించేవారు. జూనియర్స్ అది చూసి నవ్వేవారు. షేక్స్‌పియర్‌కు సంబంధించిన ఒక డ్రామాలో, ఓ కారెక్టర్ విషం తాగే సన్నివేశమది. జనరల్‌గా స్టూడెంట్స్‌కు ఆ సన్నివేశం గురించి చెబితే అంత ఎఫెక్టివ్‌గా ఉండదని గ్రహించిన ఎ.వి.ఆర్. మూర్తి పుస్తకం పక్కన ఉంచి ఆ పాత్రని నటించడం మొదలెట్టాడు.

చేతిలో గ్లాసు కావాలికదా! ఓ స్టూడెంట్ లేచి కుండపై ఉన్న గాజుగ్లాస్ తీసి మూర్తి చేతికిచ్చాడు. ఎ.వి.ఆర్. మూర్తి నటించడం మొదలుపెట్టాడు. చేతిలో గ్లాసు. తన ఎదురుగా స్టూడెంట్స్ ఉన్నారనే విషయం మరచిపోయి నటించసాగాడతను. అప్పటికే మూర్తి క్లాసులో నటిస్తున్నాడని తెలిసి పక్క క్లాసుల స్టూడెంట్స్ చాలామంది వచ్చి ఎంట్రన్స్ దగ్గర నిలబడి కళ్లప్పగించి చూడసాగారు.

కొంతమంది నోటికి కర్చీఫ్‌ని అడ్డు ఉంచుకుని నవ్వుకోసాగారు. కొంతమంది స్టూడెంట్స్ మూర్తి చూపించే నటనకు ఇన్‌స్పైయిర్ అవ్వసాగారు. మొత్తమ్మీద పరిస్థితి ఉత్కంఠ కలిగించేదిగా తయారైంది. ఆ సీన్లో మూర్తి నటిస్తున్న పాత్రధారి విషం తాగి కొన్ని డైలాగులు చెప్పి కిందపడిపోయి చనిపోవాలి.

ఇక క్లాసులో స్టూడెంట్స్ కొంతమంది ఎ.వి.ఆర్. మూర్తిపై కామెంట్స్ చెయ్యడం మొదలెట్టారు. అవన్నీ పట్టించుకునేస్థితిలో మూర్తి లేడు.

"విషం తాగేశాడురా"

"లేదు తాగలేదురా"

"తాగాడ్రా వెధవా! నువ్వు ఎటు చూస్తున్నావో? "

"సొగకళ్ల శిల్పని చూస్తున్నాడేమో"

"లేదురా... నిద్రమొఖం నీలిమని చూస్తున్నాడేమో!"

"దానికంటే మూర్తిగాడే బెటర్... లెక్చరిస్తాడు. మళ్ళీ యాక్టింగ్ చేస్తాడు"

"అవున్రా. లెక్చర్ విన్నవాళ్ళకి యాక్టింగ్ ఫ్రీ"

"విషం నెత్తికెక్కిందిరో... చూడు. వాలిపోతున్నాడు. కుర్చీపై పడబోతున్నాడు. అరె గ్లాసు వదిలేశాడు. అరెరె... గాజు గ్లాసు పగిలిందిరా. వీడితో రోజూ ఇదే తలనొప్పి. రోజుకొక కొత్త గ్లాసు కొనాల్సివస్తోంది. ఈసారి స్టీలు గ్లాసు కొంటే సరి"

"అయినా మామా... గ్లాసు పగిల్నందుకు ఫికరెందుకు చేస్తున్నావ్? పగిలితే కొనేది కాలేజ్ వాళ్లుకదా!"

"అరె... నీ గ్లాసు గొడవ వదిలెయ్... వీడేంట్రా? పాఠం చెప్పకుండా యాక్టింగులని కుర్చీలమీద, టేబుళ్ళమీద పడిపోతాడు. మళ్ళీ మనమే వెళ్ళి లేపాలి. హాయిగా కుర్చీపై కూర్చుని పాఠం చెప్పొచ్చుకదా! పాఠమే అర్థం కాకుండా మేం ఛస్తుంటే వీడేంటీ యాక్టింగులంటాడు? "

ఇలా తలా ఒకవిధంగా స్టూడెంట్స్ కామెంట్ చెయ్యసాగారు.

పగిలిన గాజుముక్కలన్నింటినీ ఏరి శుభ్రంచేసి, కింద శవంలా పడివున్న ఇంగ్లీష్ లెక్చరర్ ఎ.వి.ఆర్ మూర్తిని లేపి నించోబెట్టారు స్టూడెంట్స్.

ఒక్కసారి నలిగిపోయిన పాంటూ షర్టుని దులుపుకుని, స్టూడెంట్స్‌వైపు చూస్తూ, "సో..." అని.

"ఒక గ్లాసు నీళ్లివ్వండి" అన్నాడు. మూర్తి.

"ఇంకెక్కడి నీళ్లురా స్వామీ? ఇప్పుడేగా గ్లాసుని పగులకొట్టింది" వెనుకనుంచి అరి




చారెవరో.

మూర్తికి పరిస్థితి అర్థమైంది.

"ఓకే... ఓకే... నెవర్‌మైండ్" అంటూ బెంచీపై రెండు చేతులూ పెట్టి "సో దిస్ ఈజ్ ది థింగ్ అన్నమాట" అన్నాడు.

ఇంతలో ఎవరో గర్ల్‌స్టూడెంట్ పక్కక్లాసు లోంచి గ్లాస్ తీసుకొచ్చి మూర్తికి నీళ్లిచ్చింది. నీళ్లు తాగింతర్వాత "థాంక్స్ మైడియర్ స్టూడెంట్స్" అంటూ స్టూడెంట్స్‌కు కృతజ్ఞతలు చెప్పి మొదలెట్టాడు మూర్తి.

"సో! నేను యూనివర్సిటీలో చదివేటప్పుడు నాకో మంచి స్నేహితుడుండేవాడు ఆనంద్ అని. మీ అందరికీ తెలుసు. ఎంతో పేరుప్రఖ్యాతులున్న తెలుగు సినిమా హీరో. దాదాపు పాతికేళ్లనుంచి సినిమా ఫీల్డులో ఉన్నాడు. మేమిద్దరం చాలా క్లోజన్నమాట. ఎంత క్లోజంటే నేను మీకు మాటల్లో వ్యక్తం చెయ్యలేను. మా ఇద్దరికీ నటన అన్నా, నాటకాలన్నా చచ్చేంత ఇష్టం. చాలా డ్రామాల్లో యాక్ట్ చేశాడు. వైజాగ్ హాస్టల్లో ఉండేవాళ్ళం. ఒకే కంచం, ఒకే మంచం... ఒకే ఊరు. మా ఊళ్లోగానీ, పక్క ఊళ్లలో కానీ, తాలూకాలో అయినా, పట్నంలో అయినా ఎక్కడ ఎవరు నాటకం వేస్తున్నారని తెలిసినా వెళ్ళి చూసేవాళ్ళం. నాటకం పూర్తయింతర్వాత యాక్టర్స్‌కు అభినందనలు తెలియజేసేవాళ్ళం.

సినిమాలైతే ఇక చెప్పనవసరం లేదు. రిలీజైన ప్రతి తెలుగు సినిమా చూసేవాళ్ళం. పాతాళభైరవి సినిమా రిలీజైనప్పుడు టికెట్లకోసం క్యూలో నించుని మేమిద్దరం చొక్కాలు చింపుకున్నాం. సో... 'దటీజ్ ద డెడికేషన్ విహావ్' ప్రతీ మనిషిలోనూ ఒక ప్రవృత్తి ఉంటుంది. అసలు ప్రవృత్తి అంటే ఏమిటి? ఇప్పుడు సపోజ్. నువ్వున్నావమ్మాయ్. అమ్మాయ్... నిన్నే ఏం పేరు నీది?

"కిరణ్మయి సార్"

"ఇప్పుడు నువ్వు చదువుకుంటున్నావ్. నేను టీచర్‌ని. సో... ఇవి మన వృత్తులు. అయితే... ప్రవృత్తి అనేది వీటన్నింటికీ డిఫరెంట్ అయినది. నీకు పాటలు పాడటమంటే ఇష్టం. ఇంకొకరికి కవిత్వం రాయడం ఇష్టం. కొందరికి చిత్రలేఖనం... పెయింటింగ్ అంటే ఇష్టం. సో ప్రవృత్తి అనేది మనిషి యొక్క అంతరంగానికి సంబంధించిన విషయం. దానికి తృప్తి కలిగించినప్పుడే మనిషి మానసికంగా ఎదుగుతాడు. అదొక జ్వాల వంటిది. లోపల్లోపల బర్నవుతూ ఉంటుంది. ప్రవృత్తిని వృత్తిగా స్వీకరించిన అదృష్టవంతులు లేకపోలేదు. సో... నేను చెప్పదలచుకున్నదేమిటంటే మనలో ఉన్న ప్రవృత్తిని మనం సజీవంగా ఉంచుకోవాలి. దాన్ని ఎదగనివ్వాలి. దాన్ని తుంచెయ్యకూడదు. చంపకూడదు. ప్రవృత్తిని మనం అపురూపంగా చూసుకోవాలి.

సో... అప్పుడేమైందంటే, నా ఫ్రెండ్ ఆనంద్ అందగాడు. ఒకరోజు ఆనంద్ ఓ నాటకంలో నటిస్తుండగా చూసిన ఓ నిర్మాత... ఆనంద్‌ని హీరోగా బుక్ చేసుకుని సినిమా మొదలెట్టాడు. ఆనంద్ తన చదువుకి మధ్యలోనే ఫుల్‌స్టాప్ పెట్టవలసి వచ్చింది. ఆనంద్ చదువు ఆగిపోయింది. అయితేనేం? అతను నటించిన సినిమా సక్సెస్ అయింది. అతనికి డిమాండ్ పెరిగిపోయింది. వరుసగా సినిమాలొచ్చాయతనికి. సినిమారంగంలో ఎదురులేని హీరోగా స్థిరపడిపోయాడు. మంచి పేరు సంపాదించాడు. డబ్బు సంపాదించాడు. అప్పట్లో నేను మద్రాస్ వెళ్ళి ఆనంద్ ఇంట్లో పదిరోజులు ఉండివచ్చేవాణ్ణి. నన్ను చాలా ఆప్యాయంగా చూసుకునేవాడు. వెంటబెట్టుకుని మద్రాసంతా తిప్పుకొచ్చేవాడు.

ఇప్పుడతన్ని కలిసి చాలా సంవత్సరాలైపోయింది. ఉత్తరాలు ఇప్పటికీ రాస్తుంటాడు. నేను నా ఫ్రెండ్ సర్కిల్లోనూ, ఇంకా అందరికీ ఆనంద్ గురించి చెప్పి గర్వపడుతుంటాను. అందుకే స్టూడెంట్స్! నేచెప్పదలచు



కున్నది ఏమిటంటే ఎప్పుడు మనిషియొక్క జీవితం ఏమలుపు తిరుగుతుందో ఎవరూ ఏమీ చెప్పలేరు. కాబట్టి మీరంతా జీవితంలో ఆశావహ దృక్పథాన్ని అలవరచుకోవాలి. దేన్నీ చిన్నచూపు చూడకూడదు. ఏ విషయాన్నీ నిర్లక్ష్యం చెయ్యకూడదు. మీకెంతో భవిష్యత్తు ఉంది. రేపు మన దేశాన్ని నడిపించేది మీ యువతరమే" అంటూ సుదీర్ఘమైన ఉపన్యాసమిచ్చాడు ఎ.వి.ఆర్. మూర్తి.

ఇంతలో బెల్ మోగడంతో, "సో... డియర్ స్టూడెంట్స్ మళ్ళీ మీటవుదాం. అప్పుడు మీకు నేను షేక్స్పియర్ గురించి, అతని నాటకాల గురించి వివరంగా చెబుతాను" అని చెప్పి వెళ్ళిపోయాడు మూర్తి.

"సో...సో... అంటూ ఈ సోది ఒక్కరోజుతో పోయేది కాదన్నమాట"

"గురుడు ఇన్స్టాల్‌మెంట్ల పద్ధతిలో మన బుర్ర తింటాడన్నమాట"

"నాకయితే మాత్రం ఈ సంవత్సరం ఇంగ్లీషే చెయ్యిచ్చేటట్టుంది సుమా!"

"ఏం చేద్దాం రా? ఈ సంవత్సరమంతా వీడి యాక్టింగులతోనే సరిపోయేట్టుంది"

"ఆ ఆనంద్ బదులు వీడు సినిమాల్లోకెళ్ళినా పీడ విరగడయ్యేది"

"చేసుకున్నవాళ్ళకి చేసుకున్నంత అని. మన ఖర్మ. ఏం చేద్దాం? "

"బుద్ధి పొరపాటై ఈ కాలేజీలో చేరాం" స్టూడెంట్స్ ఇలా రకరకాలుగా వ్యాఖ్యానించసాగారు. నెక్స్ట్ క్లాస్ తీసుకునే లేడీ లెక్చరర్ అరుంధతి సెలవుపై ఉండటంతో క్లాసులో స్టూడెంట్స్‌కు మాట్లాడుకునేందుకు వీలు చిక్కింది.

"ఎలా ఉంది మూర్తిగారి లెక్చర్ అండ్ యాక్టింగ్? " శిరీష అడిగింది కిరణ్మయిని.

"సబ్జెక్ట్ ఇంకా సులభంగా అర్థమయ్యే అవకాశముంది" అంది కిరణ్మయి.

"అలా నటించే బదులుగా కూర్చుని పాఠం చెప్పొచ్చుగా. ఇంపార్టెంట్ క్వొశ్చెన్స్ అవీ చెప్పొచ్చుకదా? " అనుపమ చెప్పింది.

"మీరు ఎంతసేపూ ఒక టైపులో ఆలోచిస్తున్నారు. క్వొశ్చెన్స్, ఆన్సర్స్! అసలేముంది సబ్జెక్టులో అని సబ్జెక్టు గురించి ఆలోచించడంలేదు. మూర్తిగారు నిజానికి ఒక మంచి లెక్చరర్. లేకపోతే అందరిలాగ పాఠం చెప్పి వెళ్ళవచ్చుకదా! అతను అలా కాకుండా సబ్జెక్ట్‌లో ఇన్‌వాల్వ్ అవుతున్నాడు. ఇంకా చెప్పాలంటే అలా నటించి చూపడం ద్వారా పాఠంలో ఉన్న ఆ క్యారెక్టర్ గురించి స్టూడెంట్స్ మనసులపై చెరగని ముద్ర వేస్తున్నాడు" అంది కిరణ్మయి.

"అసలే ఆయన పాఠం అర్థంగాక ఛస్తుంటే దీని గోలొకటి. ఆపు తల్లీ ఆపు. ఉన్న బుర్ర కాస్తా మూర్తి తినివెళ్ళాడు. ఇప్పుడు నువ్వు తినాలని చూడకు. అసలు మిగిలితేకదా నువ్వు తినడానికి" శిరీష అంది.

"కిరణ్మయికేంటి? అది డబ్బున్న అమ్మాయి. పాఠం విన్నా, వినకపోయినా చదువుకున్నా, చదువుకోకపోయినా దానికొచ్చే నష్టమేమీలేదు. ఏ అమెరికా నుంచో లేక ఆస్ట్రేలియానుంచో ఓ పెద్ద ఇంజినీరునో, డాక్టరునో తీసుకొచ్చి దానికి పెళ్ళి చేస్తారు వాళ్ళింట్లో. కానీ మన పరిస్థితేమిటి? మనం శ్రద్ధగా చదువుకోవాలి. ఏదన్నా ఉద్యోగం సంపాదించుకోవాలి. మన కాళ్ళపై మనం నిలబడాలి. ఇంత తతంగం ఉంది" అంది ఈ ముగ్గురి సంభాషణల్లో అప్పుడే తలదూర్చిన రాణి.

"నీ ముఖం... అదేనా కిరణ్మయిని నువ్వు అర్థం చేసుకున్నది? కిరణ్మయి తనకు డబ్బుందని ఏనాడూ అహంకారంతో ప్రవర్తించలేదు. ఇంకా చెప్పాలంటే అది మనం దరికన్నా శ్రద్ధగా పాఠం వింటుంది. శ్రద్ధగా చదువుతుంది. ఎవరేం చెప్పినా శ్రద్ధగా ఆలకిస్తుంది" అనుపమ చెప్పింది.

"ఒసేయ్ రాణీ... కిరణ్మయీ వాళ్ళ అన్నయ్య చెప్పి నీక్కూడా రెండుకోట్లు





ఇప్పిస్తాం కానీ, ఇంతకీ నువ్వెవర్ని పెళ్ళి చేసుకుంటావ్? డాక్టర్నా, యాక్టర్నా, ఇంజనీర్నా? " అనడిగింది శిరీష.

"వాళ్ళెవరూ వద్దు నాకు" అంది రాణి.

"ఇంకెవర్ని చేసుకుంటావ్? మీ నియోజకవర్గం ఎమ్.ఎల్.ఎ.ని చేసుకుంటావా? "

శిరీష అలా అనేసరికి పగలబడి నవ్వారందరూ.

"పొండే... అసలు మీతో మాట్లాడను నేను" బుంగమూతి పెడుతూ అంది రాణి.

"రాణిగారు అలకపాన్పు ఎక్కిందే... అలకపాన్పు దిగాలంటే బుజ్జగించాలి. బుజ్జగించాలంటే పాటపాడాలి. పాట పాడాలంటే గాయకుణ్ణి చూడాలి. పోనీ ఓ పాటలు పాడేవాణ్ణి చూసి తీసుకొస్తాం నీకోసం..." అంది అనుపమ.

"ఓహో... రాణీగారు గాయకుణ్ణి చేస్కోబోతోందా? ఏ గాయకుడే? కాస్త మాక్కూడా చెప్పొచ్చుకదా... విని ఆనందిస్తాం. కొంపదీసి 'పాత ఇనుపసామాన్లకు మరమరాలిస్తానంటూ' తిరిగే అతనైతే కాదు కదా..."

శిరీష అలా అనేసరికి మళ్ళీ నవ్వులు. ఈసారి రాణికి ఏడుపొక్కటే తక్కువైంది.

"ఎందుకే బాధపడతావు? ఏం పాత ఇనుప సామాన్లమ్ముకునే వాళ్ళు మనుషులు కాదా? అదే చెప్పు వాళ్ళతో వాళ్ళిద్దరూ మంచి సూటూ, బూటూ వేసుకుని తిరిగే ఎయిడ్స్ వ్యాధి పేషెంట్లని చేస్కుంటారేమో అడుగు? " అంటూ రాణిని ఓదార్చుతూ సలహా ఇచ్చింది కిరణ్మయి. ఈసారి శిరీష, అనుపమలు నోరు విప్పితే ఒట్టు.

★ ★ ★

మధ్యాహ్నం మూడున్నర. కిరణ్ అండ్ కిరణ్ ఇండస్ట్రీస్ యం.డి. రవికిరణ్ ఛాంబరది.

బెల్ మోగింది.

"కమిన్" ఏదో ఫైలుని పరిశీలిస్తున్న రవికిరణ్ ఎం(ట్రన్స్ డోర్‌వైపు చూడకుండానే అన్నాడు.

"నమస్కారం బాబూ... నాపేరు జానకిరామయ్య" ఆ వచ్చిన వ్యక్తి తనని తను పరిచయం చేసుకున్నాడు.

వెంటనే ఫైల్లోంచి తలెత్తి వచ్చిన వ్యక్తిని చూసి "చూడండి... మీరెవరో నాకు తెలియదు. నాకంటే వయసులో పెద్ద అయిన మీరు నాకు నమస్కారం చెయ్యకూడదు. కూర్చోండి" అని కుడిచేత్తో కూర్చోమనిచెప్పి జానకిరామయ్య కూర్చున్నాక, కళ్ళద్దాలు తీసి కళ్ళు తుడుచుకుని, ఫోనెత్తి ఏదో మాట్లాడి, కుర్చీలో రిలాక్సయి, "చెప్పండి" అన్నాడు రవికిరణ్.

చెప్పడానికి ఉద్యుక్తుడవుతూ ఒకసారి గొంతు సవరించుకున్నాడు జానకిరామయ్య. తన కూతురు పద్మ పెళ్ళి ఏ విధంగా విఫలమైందీ, అన్నీ వివరంగా చెప్పసాగాడు.

ఇంతలో టీ వచ్చింది. టీ తాగారిద్దరూ.

అంతా ఓపిగ్గా విన్న రవికిరణ్. "అంతా బాగానే వుంది. కానీ మీరు చెప్పే విషయాలకూ నాకూ సంబంధమేంటి? " అన్నాడు.

దానికి జానకిరామయ్య నవ్వుతూ, "నేను మీ దగ్గరకు వచ్చిన విషయాన్ని ఒక్కముక్కలో చెబితే బాగుండదని ఈ వివరాలన్నీ చెప్పుకొచ్చాను. అసలు విషయం ఏమిటంటే, అరుణ్ అని ఓ అబ్బాయి మీ ఇండస్ట్రీలో పనిచేస్తున్నాడు. అతని గురించి కొన్ని వివరాలు అడగడానికి మీ దగ్గరకొచ్చాను. నా కూతురు పద్మని అరుణ్‌కిచ్చి పెళ్ళి చెయ్యాలనుకుంటున్నాను. ఈ విషయంలో మీరు ఇచ్చే సమాచారాన్ని చాలా విలువైనదిగా నేను భావిస్తాను" అన్నాడు.

దానికి రవికిరణ్ మందహాసం చేస్తూ, "ఐ... సీ... ఇప్పుడర్థమైంది. చూడండి జానకిరామయ్యగారూ! నేనెవరో ఏమిటో మీకు తెలియకపోయినా మీ వ్యక్తిగత విషయాలన్నీ నాపై నమ్మకంతో నాతో చెప్పారు. చూడగా మీరు కల్మషం ఎరుగని వ్యక్తిలా నాకనిపిస్తున్నారు. మీరు నాకు

తండ్రి సమానులు. నేను తప్పనిసరిగా ఈ విషయంలో మీకు సహాయం చేస్తాను. అరుణ్ చాలా మంచి వ్యక్తి. ఈ ఫ్యాక్టరీలో నాలుగయిదేళ్ళనుంచి పన్జేస్తున్నాడు. నిదానస్తుడు. మీరు అతని గురించి ఇక బెంగపడడం మానెయ్యండి. ఈ పెళ్ళి నేను దగ్గరుండి జరిపిస్తాను"

రవికిరణ్ మాటలతో జానకిరామయ్య కళ్ళు సజలాలయ్యాయి. తన కుర్చీలోంచి లేచి, రవికిరణ్ చేతుల్ని పట్టుకుని, "బాబూ... నీ రుణం నేను తీర్చుకోలేను" అన్నాడు.

రవికిరణ్ లేచి, భరోసా ఇచ్చాడతనికి.



"సార్ పిలిచారట..." తలెత్తి చూసిన రవికిరణ్‌కు ఎదురుగా అరుణ్ కనిపించాడు.

నవ్వుతూ, "రావోయ్... నీ గురించే అనుకుంటున్నాను" అన్నాడు రవికిరణ్.

"ఏమైంది సార్? నా గురించేమిటి?"

"ముందు నువ్వు కూర్చో"

"ఫర్లేదుసార్..."

"మరేమీ ఫీలవ్వనక్కర్లేదు. ఇది మనిల్లే అనుకో. మనిద్దరం స్నేహితులం. ఇప్పుడు నేను నీ బాస్‌ని కాదు. నువ్వు నా సబార్డినేట్‌వి కాదు. మనం కేవలం స్నేహితులం" అన్నాడు రవికిరణ్.

అరుణ్ కూర్చున్నాక "నీకోసం మీ వాళ్ళేదైనా సంబంధం చూస్తున్నారా?" అడిగాడు డైరెక్టుగా.

"అదేంటి సార్. అలా అడిగారు?"

"ముందు నేనడిగిందానికి సమాధానం చెప్పు?"

"అవున్సార్... చూస్తున్నారు"

"మీ వాళ్ళు ఎంత కట్నం ఆశిస్తున్నారు?"

కాసేపు తటపటాయించి, "ఇంత అని చెప్పలేను. కానీ మొత్తానికి కట్నమైతే ఆశిస్తున్నారు" అని.

"సార్"

"ఆ..."

"ఇదంతా ఎందుకడుగుతున్నారు?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

"ఏంలేదు. నాకుతెలిసిన ఓ సంబంధముంది... అమ్మాయిని నేను చూళ్ళేదు... కానీ అమ్మాయి తండ్రి నాకు తెలుసు. పాపం చాలా అమాయకుడు. మంచి వ్యక్తి. మీరు కోరిన కట్నమివ్వడానికి అతను తయారుగా ఉన్నాడు. నీకిష్టమైతే చూడు అడ్రసిస్తాను. వెళ్ళి అమ్మాయిని ఒకసారి చూడండి" అన్నాడు రవికిరణ్.

"మీరు భలేగా మాట్లాడతారే?"

"ఎందుకు?"

"వాళ్ళెవరో మీకు తెలుసన్నారు. అలాంటప్పుడు పెళ్ళిచూపులకు మీరు లేకుండా ఎలా? వారికి మధ్యవర్తిగా వ్యవహరిస్తున్నపుడు, మాక్కూడా మధ్యవర్తిత్వం వహించండి" అన్నాడు.

కాసేపు ఆలోచించి తల గోక్కున్నాడు రవికిరణ్ "నాకేం అనుభవముందని? నేనూ పెళ్ళికానివాణ్ణి... పెళ్ళి చేసి చూడు. ఇల్లు కట్టిచూడు అన్నారు పెద్దవాళ్ళు. వయసు చిన్నదైనా, ఒక మంచి పని చేసే అవకాశమొచ్చినపుడు తప్పనిసరిగా




చెయ్యాలి. అలాగే కానీ..." అన్నాడు రవికి రణ్. అటుపైన...

"సరే నువ్వెళ్ళు. వాళ్ళకి ఫోన్ చేసి ఎప్పుడు రావాలో కనుక్కుంటాను. తర్వాత మీ పేరెంట్స్, మనమంతా కలిసి వెళదాం. సరేనా? " అన్నాడు.

"అలాగే సార్. ఈ విషయం మా ఇంట్లో చెబుతాను" అన్నాడు అరుణ్.

అరుణ్ వెళ్ళాక జానకిరామయ్యకు ఫోన్ కలిపాడు రవికిరణ్.

"ఆ... ఎప్పుడు? ఆదివారం ఉదయం పది గంటలకా? సరే..."ఫోన్ పెట్టేశాడు. ఆ తర్వాత టైపిస్ట్ కల్యాణిని పిలిపించి ఒక ముఖ్యమైన డిక్టేషన్ ఇవ్వడం మొదలుపెట్టాడు. కల్యాణి నోట్ చేసుకోసాగింది.

★ ★ ★

ఉదయం పదిగంటల సమయం. ఆదివారం. జానకిరామయ్యగారింట్లో పద్మకి పెళ్ళిచూపులు. పరస్పర పరిచయాలు పూర్తయ్యాయి. అరుణ్‌కు, అతని తల్లిదండ్రులకు పద్మ నచ్చింది. అందరికీ టీ సర్వ్ చేస్తూ వస్తోందో అమ్మాయి. కానీ రవికిరణ్‌కు టీ ఇవ్వకుండా ముందుకెళ్తుంటే రవికిరణ్‌తో పాటు అందరూ ఆశ్చర్యపోయారు. అప్పటిదాకా అరుణ్ పక్కనే కూర్చున్న రవికిరణ్ ఆ అమ్మాయిని పరిశీలనగా చూళ్ళేదు. కొంచెం ముందుకెళ్ళి అరుణ్ తల్లికి టీ ఇచ్చాక వెనక్కి తిరిగి చూసిందామె. అప్పుడు ఆ అమ్మాయివంక చూశాడు రవికిరణ్. ఆ అమ్మాయి 'స్పందన'

స్పందన కోపంగా తాచుపాములా రవికిరణ్ వంక చూసింది. రవికిరణ్ కొంచెం ఇబ్బందిగా ఫీలయ్యాడు.

జానకిరామయ్య ఆదుర్దాపడుతూ, "అదేంటమ్మాయి... రవికిరణ్‌గారికి టీ ఇవ్వడం మరిచిపోయినట్టున్నావ్" అన్నాడు. స్పందన చేసిన పనికి సిగ్గుపడుతున్నట్టు ఫీలయ్యాడు జానకిరామయ్య.

మెల్లిగా భార్య సుశీల చెవిలో "ఈ అమ్మాయిని పిలిచిందెవరు? " అన్నాడు.

రవికిరణ్ తేరుకుని, "అహ... హ... నేను టీ తాగన్లెండి. నాకు అలవాటులేదు" అన్నాడు.

"అదేంటి బాబూ... నేను మీతో కలవడానికొచ్చినప్పుడు మీరు టీ తెప్పించారు. మనిద్దరం తాగాం కూడా" అంటూ గుర్తుచేశాడు జానకిరామయ్య.

ఏం చెప్పాలో తెలీక ఇబ్బందిపడ్డాడు రవికిరణ్. ఈమె ఎందుకిలా చేస్తోంది? తనలోతను అనుకున్నాడు రవికిరణ్.

స్పందన చేతిలో ఉన్న ట్రేలో ఇంకా ఓ కప్పు టీ ఉంది.

"సారీ అంకుల్... తొందరలో మరిచిపోయాను" అంటూ స్పందన ట్రేని ఓ బల్లపై పెట్టి టీ కప్పుతో ఉన్న సాసరుని రెండుచేతుల్తో పట్టుకుని రవికిరణ్‌కు ప్రత్యేకంగా ఇస్తున్నట్టుగా నటిస్తూ వచ్చి రవికిరణ్ అందుకునేలోపే జారవిడిచింది. వేడి టీ రవికిరణ్ రెండు చేతులపై పడింది. కప్పూ, సాసర్ కిందపడి పగిలాయి. బాధని ఓర్చుకుంటూ, రవికిరణ్ జానకిరామయ్యవైపు చూశాడు. "అయ్యో! ఎంతపనయింది? చూడకుండా ఎలా ఇచ్చావమ్మాయ్? జాగ్రత్తగా ఇవ్వాలిగా" అంటూ సుశీల వచ్చి టవల్తో తుడవబోతుండగా,

"మరేం ఫర్లేదు" అంటూ తనే టవలందుకుని తుడుచుకోసాగాడతను. జానకిరామయ్యతోపాటూ ఆ సంఘటనకు అందరూ బాధపడ్డారు. సారీ చెప్పింది స్పందన. ఆ సంఘటనని అందరూ సహజమైనదిగా భావించారు రవికిరణ్, స్పందన తప్ప!

ఇంటికొచ్చాక ఆలోచిస్తూ ఉండిపోయాడు రవికిరణ్. స్పందన ప్రవర్తన అతనికి అంతుపట్టకుండా ఉంది. ఆమె ఎందుకలా ప్రవర్తిస్తోంది? తను ఆరోజు కారుని రాష్‌గా నడిపిన మాట వాస్తవమే. అందుకు సారీ చెప్పబోయేలోగానే ఎంత నోటి దురుసుతనం ప్రదర్శించింది? పోనీ తీరా సారీ చెబుదామ

నుకుంటే తనని కాళ్ళు పట్టుకోమంటుందా? స్పందనలో ఒక విధమైన శాడిస్ట్ మన స్తత్వం ఏమైనా ఉందేమో అని అనుమానిం చాడతను.

అరుణ్ పెళ్ళిచూపులప్పుడు వేడివేడి టీని తన చేతులపై పోసి తన శాడిస్టిక్ మనస్త త్వాన్ని వ్యక్తం చేసింది. అంటే తనపై పగ తీర్చుకుందన్నమాట. కానీ స్త్రీని, అనురాగా నికి, ప్రేమకూ, దయకూ, క్షమకూ మారుపే రుగా చెప్పుకుంటారుకదా. అవును నిజమే. ఎందుకంటే తన తల్లి దమయంతి, తన చెల్లెలు కిరణ్మయి సత్ప్రవర్తనకు ఉదాహర ణలు కదా. ఇంకా చాలామంది స్త్రీలను చూశాడు తను. ప్రతిరోజూ తను చూస్తూనే ఉన్నాడు. తీరా స్పందన ప్రసాదరావు అంకుల్ కూతురని తెలిశాక తనకు స్పంద నపై కలిగిన ఏహ్యాభావం సమసిపోయింది. ఏదో చిన్నవయసు, తెలిసీతెలియని తన మని సర్దిపుచ్చుకున్నాడు తను.

కానీ ఈరోజు జరిగిన సంఘటన రవికిర ణ్‌కు జీర్ణం కావడంలేదు. ఫర్గెట్ ఇట్. పోనీ స్పందన గురించి ఆలోచించి తన టైం ఎందుకు వృథా చేసుకోవాలి. ఆమెతో తనకేం అవసరం? అనుకుంటూ టీవీ ఆన్ చేసి తనకిష్టమైన మ్యూజిక్ ఛానల్ చూడ సాగాడు. విల్‌స్మిత్ పాటొకటి వస్తోంది టీవీలో. కాళ్ళు రెండూ మ్యూజిక్‌కు అనుగు ణంగా కదుపుతూ ఎంజాయ్ చేయసాగాడు. అద్భుతమైన టేకింగ్, ఫొటోగ్రఫీ, గ్రాఫిక్స్ ఉన్నాయా పాటలో. ఒక ఫ్రేమ్ అదృశ్యమ య్యేలోపే ఇంకో ఫ్రేమ్ వచ్చి స్క్రీన్‌ని ఆక్ర మిస్తుంది అలా పాట చూస్తూ గోడపై ఉన్న కేలండర్‌ని చూశాడు రవికిరణ్. పైన ఏదో కాప్షన్ రాసి ఉంది. 'FEMALE SPECIES ARE MORE DANGER-OUS THAN MALE' అందులో ఓ స్త్రీ తల, ఇంకా ఆడగుర్రం, ఏవో పిట్టలున్నాయి. ఈ కేలండర్ కొత్తగా కలనబడుతోందే మిటి?

"కిరణ్మయీ..." చెల్లెల్ని పిలిచాడు రవికి రణ్.

"వస్తున్నా అన్నయ్యా... ఏంటి?"

"ఈ కొత్త కేలండర్ ఎక్కడిది?"

"పార్సిల్‌లో వచ్చిందన్నయ్యా"

"ఫ్రం అడ్రసుందా?"

"అడ్రసులేదు కానీ పేరుంది"

"ఏమని?"

"స్పందన!" రవికిరణ్ తన కాళ్ళకింద నున్న నేల కదిలినట్టుగా ఫీలయ్యాడు.

★ ★ ★

'శ్రద్ధ గిఫ్ట్ కార్నర్' షాపు ఎదుట తన ఓపెల్ ఆస్ట్రాని పార్క్‌చేసి లోపలికెళ్ళాడు రవికిరణ్. అప్పుడు సమయం రాత్రి ఏడవు తోంది. కాంతిమంతమైన తెల్లని లైట్లతో గిఫ్ట్‌కార్నర్ షాపు మిరుమిట్లు గొలుపు తోంది. కొంత రష్‌గా ఉంది షాపు. రకర కాల వెరైటీల్తో అందమైన ప్యాక్‌లలో గిఫ్ట్స్ అన్నీ ఆకర్షణ గొలుపుతున్నాయి.

వాటిని పరిశీలిస్తూ ముందుకెళ్ళిన రవికిర ణ్‌కు కొంచెం దూరంలో 'ఓ క్లాసిక్' అనదగ్గ ఐటమ్ కనిపించింది. ప్రేమికుల బొమ్మతో డిజైన్ చేసిన గిఫ్టది. 'వావ్... వాటే పీస్?' అనిపించిందతనికి. ఆ గిఫ్ట్ ప్యాక్ చెయ్యా మని చెప్పడానికి కౌంటర్ వైపు టర్న్ అయిన రవికిరణ్ దృష్టి పంజాబీ డ్రెస్‌లో అందంగా మెరిసిపోతున్న ఓ అమ్మాయిపై పడింది. ఆమె స్పందన. ఒక చేతిలో పుస్త కాల్తో, కౌంటర్ వద్ద గిఫ్ట్స్ బిల్స్ చెల్లిస్తున్న ఓ ఇద్దరు కస్టమర్ల వెనుక ఉందామె.

ఎందుకైనా మంచిదని స్పందన షాపు లోంచి వెళ్ళిన తర్వాత తన గిఫ్ట్ ప్యాక్ చేయిద్దామనుకుని కాసేపు వేరే గిఫ్ట్ ఐట మ్స్‌ని పరిశీలిస్తూ ఉండిపోయాడు రవికి రణ్. రవికిరణ్‌ని గమనించలేదు స్పందన. ఓ అయిదు నిమిషాలయ్యాక మళ్ళీ చూసిన రవికిరణ్‌కు స్పందన కన్పించలేదు. ఏదో బరువు దిగిపోయినట్టు రిలాక్స్‌డ్‌గా ఫీలైన రవికిరణ్ తన గిఫ్ట్‌ని ప్యాక్ చేయించి బిల్లు

పే చెయ్యడానికి కౌంటర్‌వైపు నడిచాడు.

డబ్బుకోసం పర్స్ బైటికి తీయబోతున్న రవికిరణ్, కౌంటర్‌పై ఉన్నవ్యక్తి ఇబ్బందిగా, అసహనంగా ఫీలవ్వడాన్ని గమనించి, ఏమైందని అడిగాడు. రవికిరణ్ దృష్టి కౌంటర్‌పై ఉన్న రెండు గిఫ్ట్‌లపై పడింది.

"నాది ఓన్లీ వన్ ఐటమ్ మాత్రమే" అన్నాడు రవికిరణ్.

"మీ ఐటమ్ గురించి కాదుసార్.. మీది ఒకటే అని తెలుసు" అన్నాడు షాపతను.

"మరి? "

"ఎవరో మేడమ్ డబ్బు పే చేసి గిఫ్ట్ మరిచి వెళ్ళిపోయారు" బాధపడుతూ అన్నాడు.

ఆ మేడమ్ ఎవరో రవికిరణ్‌కు తెలుసు.

తన గిఫ్ట్ చేతిలోకి తీసుకుని నవ్వుతూ, "మీరు ఆ మేడం గురించి ఏమీ వర్రీ కానక్కర్లేదు. ఆమెకు జ్ఞాపకశక్తి అందరికంటే కొంచెం ఎక్కువగానే ఉంది. తప్పనిసరిగా తిరిగొచ్చి తన గిఫ్ట్ తీసుకెళ్తుంది" అన్నాడు రవికిరణ్.

"ఆమె మీకు తెలుసా? " అడిగాడు షాపతను.

"మీకు పాత తెలుగు సినిమాలు చూసే అలవాటుందా? " రవికిరణ్ అడిగాడు.

"అదేం... అలా అడుగుతున్నారు? దీనికీ మీరు చెప్పే విషయానికీ సంబంధమేంటి? "

"ముందు నేనడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పండి? "

"పాత తెలుగు సినిమాలంటే నాకు చాలా ఇష్టం సార్. అటువంటి మంచి సినిమాలు ఇప్పుడెక్కడ? అసలు 1980 తర్వాత నేను తెలుగు సినిమాలు చూడ్డం మానేశాను"

"అయితే మీకు సూర్యకాంతం గురించి తెలిసే ఉంటుంది" వచ్చే నవ్వు ఆపుకుంటూ అన్నాడు రవికిరణ్.

షాపతను నవ్వాడు. "ఇప్పుడు నాకో విషయం అర్థమైంది" అన్నాడతను.

ఏ విషయమన్నట్టు అతనివైపు చూశాడు రవికిరణ్.

"ఆ మేడమ్‌ని మీరు గుర్తుపడతారు"

"అవును. గుర్తుపడతాను. నాకు తెలుసు"

"మరి ఆలస్యం దేనికి? తీసుకెళ్ళి మేడమ్‌కివ్వండి" అన్నాడతను.

"తొందరపడకండి. తీసుకెళ్తాలే... ఓ పది నిమిషాలాగండి" రవికిరణ్ అన్నాడు.

"పది నిమిషాలాగడం దేనికి? "

"ఆ మేడమ్ గురించి మీకు తెలీదులెండి"

"చెప్పారు కదా ఇప్పుడే"

"జస్ట్ జోగ్గా చెప్పాను"

"అంతేనా? "

"ఔను"

షాపు బయటికొచ్చి తన ఓపెల్ ఆస్ట్రా కారువద్ద నిలబడి కాసేపు వెయిట్ చేశాడు. అయిదు నిమిషాలు.. పది నిమిషాలు... అటూ ఇటూ తిరిగాడు. ఇరవై నిమిషాలు. తీసుకెళ్ళాలా... వద్దా... కాసేపు సంశయించాడు. తీసుకెళ్ళాలని నిర్ణయించుకున్నాడు. స్పందన గిఫ్ట్‌ని రవికిరణ్ చేతికిచ్చాడు షాపతను. రవికిరణ్ ఇంటివైపు ఓపెల్ ఆస్ట్రా దూసుకుపోయింది. ఇంటికెళ్ళాక తన డైరీలో ప్రసాదరావు ఫోన్ నెంబర్‌కై వెతకసాగాడు.

ఇంతలో కిరణ్మయి వచ్చింది. గిఫ్ట్‌ని చేతుల్లోకి తీసుకుని, "రెండు గిఫ్టులా? ఎవరికన్నయ్యా? " అనడిగింది.

"ఆ రెండింట్లో మనది ఒకటే" ప్రసాదరావింటికి ఫోన్ కలుపుతూ అన్నాడు.

రవికిరణ్ చెప్పింది కిరణ్మయికేమీ అర్థం కాలేదు.

"హలో ప్రసాదరావుగారున్నారా? "

"లేరు... మీరెవరు? " అడిగింది.

"ఎవరూ... స్పందనేనా మాట్లాడుతుంది? "

"ఔను... ఇంతకీ మీరెవరు? "

"స్పందనా... గుడీవినింగ్... నేను రవికిరణ్‌ని"

"ఇంటికి ఫోన్ చేయడానికి నీకెంత

ధైర్యం? ”

“ఫోన్ చేయడానికి కూడా ధైర్యంకావాలా? ”

“ఎస్...”

“ప్లీజ్... నీతో గొడవ పెట్టుకోవడానికి నేను ఫోన్ చేయలేదు. శ్రద్ధ గిఫ్ట్ కార్నర్‌లో గిఫ్ట్‌కొని తీసుకెళ్ళడం మర్చిపోయావు నీవు. నేనూ అదే షాపులో ఉన్నానప్పుడు. ఇప్పుడు నీ గిఫ్ట్ నా దగ్గరే ఉంది. పంపమంటావా? ” అడిగాడు రవికిరణ్.

“నీకేం హక్కుందని నా గిఫ్ట్ తీసుకున్నావ్? ” స్పందన అలా అనడంతో కోప మొచ్చి వెంటనే ఫోన్ పెట్టేశాడు రవికిరణ్.

“ఎవరన్నయ్యా? ఎవరితో మాట్లాడుతున్నావ్? స్పందనెవరు? ” అడిగింది కిరణ్మయి.

“ఓ మెంటల్ కేసుందిలే...” విసుగ్గా అన్నాడు చెల్లెలితో.

★ ★ ★

ఉదయం ఏడుగంటలవుతోంది. అది స్పందన ఇల్లు.

“వావ్... డాడీ అండ్ మమ్మీ... గుడ్ న్యూస్. పేపరు చూసిన స్పందన ఆ విధంగా సంతోషంతో కేక వేసేసరికి, అన్నపూర్ణ ప్రసాదరావులు పరుగు పరుగున వచ్చారు.

“పి.ఓ. ఇంటర్వ్యూ రిజల్ట్స్ వచ్చాయి. నేను సెలెక్ట్ అయ్యాను.” నవ్వుతూ సంతోషంగా చెప్పింది స్పందన.

“నిజంగానా? ” అంటూ ఆనందం, ఆశ్చర్యం కలగలిసిన వదనంతో స్పందన దగ్గరకొచ్చి ముద్దు పెట్టుకుంది అన్నపూర్ణ.

“మరేమనుకున్నావోయ్. నా కూతురు తలుచుకుంటే ఏదయినా సాధిస్తుందని నాకెప్పుడో తెలుసు. స్పందనా... మజాకా!’ మీసం మెలివేస్తూ గర్వంగా అన్నాడు ప్రసాదరావు.

భర్త మాటలకు నవ్వి... “ఉండమ్మా... దిష్టి తీస్తా...” అంటూ దిష్టి తీసింది అన్నపూర్ణ.

“ఈ సెంటిమెంటెందుకు? ” స్పందన అడిగింది.

“రాసిన మొదటిపరీక్షలోనే పాసయ్యి బ్యాంకు ఆఫీసరయ్యావని తెలిస్తే... అందరూ దిష్టి పెడతారు. అందుకే దిష్టి తీశాను” చెప్పింది అన్నపూర్ణ.

“పిచ్చి మమ్మీ! ధృఢ నిశ్చయంతో చేస్తే ఎవరైనా, ఏ పనయినా సాధించవచ్చు” అంది స్పందన.

“కరక్ట్‌గా చెప్పావ్? ఇప్పుడు నువ్వు నా కూతురనిపించావ్” ప్రసాదరావన్నాడు.

“అక్కడే పొరబడ్డారు మీ తండ్రీకూతుళ్ళు అందరికీ అన్నీకలిసిరావు. రాతపరీక్షలో పాసయి ఇంటర్వ్యూలో ఫెయిలైన వాళ్ళ సంగతేంటి? ” అడిగింది అన్నపూర్ణ.

ప్రసాదరావు ఆలోచిస్తూ ఉండగా,

“వెరీ సింపుల్. వాళ్ళు ఇంటర్వ్యూలో సరిగ్గా సమాధానాలు చెప్పలేదని అర్థం” అంది స్పందన.

“కావచ్చు ఇంత పెద్ద పరీక్ష పాసయిన వారి తెలివితేటలు వృధాగా పోతాయని ఎందుకనుకుంటున్నావ్? వారు వేరే రంగంలోనో ఎక్కడో బాగానే స్థిరపడేటట్లు చేస్తాడు దేవుడు. అర్హులైనవారికి జీవితంలో ఎక్కడో ఓచోట తప్పక గుర్తింపు లభిస్తుంది” అంది అన్నపూర్ణ.

“ఈ లాజిక్కేదో బాగానే వుందే” అన్నాడు ప్రసాదరావు.

“లాజిక్కుకాదు. మేజిక్కుకాదు. అక్షరాలా నిజమిది” అంది అన్నపూర్ణ.

“మీరిద్దరిలా కొట్లాడుతూనే ఉండండి... నా విజయం గురించి నా ఫ్రెండ్స్ అందరికీ విన్పించి వస్తాను” అంటూ తుర్రుమంది స్పందన. బయటికి వెళుతున్న స్పందనవైపు మురిపెంగా చూస్తూ ఉండిపోయారు ఆమె తల్లిదండ్రులు.

కామత్ హోటల్, సికింద్రాబాద్, సమయం ఉదయం... పదకొండున్నర.




"ఏదో మాట్లాడాలని ఫోన్ చేశారు. దేని గురించి? " కూర్చుంటూ అడిగింది రూపా దేవి.

స్పందన, సుమతిలిద్దరూ కూర్చున్నారు.

"బైది బై... మీట్ మై క్లోజ్ ఫ్రెండ్... షి ఈజ్ సుమతి" అంటూ సుమతి గురించి చెప్పింది స్పందన.

"హలో... నైస్ టు మీట్ యూ... అయామ్" అని సుమతితో కరచాలనం చేసి రూపాదేవి తన పేరు చెప్పేలోగా... "రూపాదేవి" అంది సుమతి నవ్వుతూ.

"మీకెవరు చెప్పారు? " అంది రూపాదేవి ఆశ్చర్యం వ్యక్తం చేస్తూ.

సుమతికి తన గురించి చెప్పిందెవరో రూపాదేవికి తెలుసు. జస్ట్... అలా నటించిందామె.

సుమతి రూపాదేవి ప్రశ్నకు చిన్నగా నవ్వింది. స్పందన "మీకు తెలుసు మేడమ్" అని నవ్వుతూ అనడంతో రూపాదేవి ఆ నవ్వుతో శృతి కలిపింది.

"మీరేం తీసుకుంటారు చెప్పండి? " స్పందన రూపాదేవినడిగింది.

"వేడిగా వుంది. అందుకే కూల్‌డ్రింక్ అయితే బాగుంటుంది" చెప్పింది.

మూడు థమ్సప్ తెప్పించింది స్పందన.

డ్రింక్ సిప్ చేస్తూ "చెప్పండి... మీరు కలిసి చాలారోజులైంది" రూపాదేవి అడిగింది.

"అవునండి. చాలా రోజులైంది. ఎగ్జామ్ కొరకు ప్రిపేరవుతూ ఉండిపోయాను" చెప్పింది స్పందన.

"ఏ ఎగ్జామ్"

"నా ఎగ్జామ్ సంగతి తర్వాత చెప్తా కానీ... ముందు నాకో హెల్ప్ చెయ్యండి" అడిగింది స్పందన.

"ఏ విషయంలో? "

"మీరు దయచేసి మా సుమతికొక జాబ్ అర్జంట్‌గా ఇప్పించండి. చాలా కష్టాల్లో వుంది తను"

"మీరు భలే అడుగుతున్నారే. నేనేమన్నా ఎంప్లాయ్‌మెంట్ ఆఫీసర్ననుకున్నారా? "

రూపాదేవి అలా అనడంతో సుమతి ముఖంలో ఫీలింగ్స్ మారాయి. స్పందన కూడా ఆశ్చర్యానికి లోనైంది. వారిద్దరలా భావరహితంగా ఉండిపోవడంతో రూపాదేవి నవ్వేస్తూ,

"ముఖాలు అలా పెట్టారేం? జస్ట్ జోగ్గా అన్నానంతే. ఉద్యోగమే కదా అడిగింది. ఇప్పిస్తాన్లెండి" అంది.

రూపాదేవి అలా భరోసా ఇవ్వడంతో ఇద్దరి మనసులూ తేలికపడ్డాయి.

"మిస్ స్పందనా! సీమాపటేల్ అని ఓ బెస్ట్ ఫ్రెండుంది నాకు. క్లాస్‌మేట్ కూడా. ఈసారి మీకు ఆమెతో పరిచయం చేయిస్తాను. చాలా ధైర్యవంతురాలు" అంది రూపాదేవి.

"అలాగా... అయితే ఆమెని చూడాల్సిందే" అంది స్పందన.

"మా సుమతి వట్టి అమాయకురాలండి... ధైర్యంలేదు" సుమతి గురించి చెప్తూ అంది స్పందన.

"నో... సుమతి... నో...నో. ధైర్యంగా వుండాలి. ఆ రోజులు పోయాయి. నాలుగ్గోడలమధ్యా స్త్రీలు తమ విలువైన జీవితాల్ని నాశనం చేసుకునే రోజులు పోయాయి. భర్తకు చాకిరీ చేస్తూ, అతని ఆజ్ఞలకు 'జీ... హుకుం' అంటూ అతని పాదాల వద్ద బానిసలుగా బతికారు స్త్రీలు ఒకప్పుడు. తమ అస్థిత్వాన్ని కోల్పోయి సంప్రదాయాలూ, కట్టుబాట్లు నడుమ సేవలంటూ, బాధ్యతలంటూ, త్యాగాలంటూ ఏవేవో పనికిమాలిన అభిప్రాయాల ముసుగులో తమ జీవితాల్ని స్త్రీలు తమ చేతులారా నాశనం చేసుకునే అవసరం ఎంతమాత్రం లేదిప్పుడు.

స్త్రీ స్వాతంత్ర ఉద్యమం మొదలయ్యాక అక్షరజ్ఞానం పెరిగాక ప్రస్తుతం ఇచ్చిపుచ్చుకునే ధోరణి మాత్రమే అమలవుతోంది. పురుషుడి కంటే స్త్రీ ఏ విధంగానూ తక్కువ

కాదనే విషయాన్ని నేటి మహిళలు అర్థం చేసుకోగలుగుతున్నారు. స్త్రీ ఇప్పుడు సంతృప్తిగా స్వేచ్ఛా స్వాతంత్ర్యపు గాలుల్ని పీలుస్తోంది.

సుమతీ... మీరొకసారి మహిళా ప్రపంచంవైపు దృష్టి సారించండి. మారుతున్న సినారియో మీకు కనబడుతుంది. మీకు మీరు అలా భయపడుతూ బతుకుతుంటే, ఎదుటి వ్యక్తికెంత చులకనగా ఉంటుంది? ఆలోచించండి మీరే. మీ విలువ మీకు తెలియనప్పుడు ఎదుటివ్యక్తి మిమ్మల్నెలా గౌరవిస్తాడు?

అసలు నాకు తెలియక అడుగుతాను పిరికితనమెందుకు? ఎందుకు భయపడడం? తప్పు చేసేవాడు మాత్రమే భయపడాలి. ఈ రోజుల్లో అయితే తప్పులు చేసేవాళ్ళు అసలు భయపడ్డం మానేసి, అదేదో తమ జన్మహక్కంటూ రొమ్ము విరిచి తిరుగుతున్నారు" రూపాదేవి అలా అనేసరికి సుమతి, స్పందనలు నవ్వేశారు.

"నేను చెప్పే విషయాలు మీకు బోర్ కొడుతున్నాయా? " రూపాదేవి అడిగింది.

"లేదు మేడం. మీరు నిజం చెప్తున్నారు" అంది సుమతి.

"అంటే మీకప్పుడే ధైర్యం వచ్చేసిందన్నమాట" అంది రూపాదేవి. నవ్వారిద్దరూ.

"మీరేదో ఎగ్జామ్‌కు ప్రిపేరవుతున్నా అన్నారుకదా. ఏమైందది? ఏ ఎగ్జామ్ రాశారు? " స్పందనని అడిగింది రూపాదేవి.

"ఎగ్జామ్ రాయడం మాత్రమే కాదు. ఇంటర్వ్యూలో కూడా పాసయ్యాను. బ్యాంక్ ఆఫీసర్‌గా సెలక్టయ్యాను" చెప్పింది స్పందన.

"వావ్... నిజంగా. అయితే కంగ్రాట్యులేషన్స్" అంటూ నవ్వుతూ స్పందనతో కరచాలనం చేసింది రూపాదేవి.

"మిస్ స్పందనా! రియల్లీ మీలాంటి శిష్యురాలు నాకు దొరకడం నా అదృష్టంగా భావిస్తున్నాను. మీకొక వ్యక్తిత్వాన్ని కల్పించుకుని పురుషాధిక్య సమాజాన్ని సవాల్ చేస్తున్నారు" స్పందనని పొగడుతూ అంది.

"థాంక్యూ మేడమ్" అంది స్పందన.

"మీ గురించి ఇంకో విషయం కూడా నేను విన్నాను" అంది రూపాదేవి.

"దేని గురించి? " కనుబొమలు చిట్లిస్తూ అడిగింది స్పందన.

"అదే మీ ఫ్రెండ్ పద్మ పెళ్లిలో వరుడి తండ్రి రఘురాంప్రసాద్‌ని నిలదీశారట కదా! నాకు ఇన్ఫర్మేషన్ వచ్చిందిలెండి"

"ఓ అదా! తప్పలేదు. కట్నం గురించి నా ఫ్రెండ్ వాళ్ల పేరెంట్స్ పరువు తీయాలని చూశాడు ఇడియట్" అంది స్పందన.

"తప్పలేదు అనికాదు తప్పులేదు అని చెప్పండి. ధైర్యవంతురాలైన మహిళగా స్త్రీహక్కు కోసం మీరు మీ డ్యూటీని చక్కగా చేశారు" మెచ్చుకుంటూ అంది రూపాదేవి.

"కానీ బాధపడాల్సిన విషయమేమిటంటే నేను చేసిన పని కొంతమందికి నచ్చలేదండి. నేనలా ప్రవర్తించినందుకు మా పేరెంట్స్ కూడా ఫీలయ్యారు" నొచ్చుకుంటూ అంది స్పందన.

"మన దరిద్రమదే! న్యాయంకోసం పోరాడేవారికి మద్దతిచ్చే సంగతి తర్వాత, ముఖ్యంగా వారిలో పొంగుతున్న ఉత్సాహాన్ని నీరుకార్చాలని ప్రయత్నించే వాళ్లే మన సమాజంలో ఎక్కువ. అందుకే దౌర్జన్యం చేసేవాళ్లని అదుపు చేసేవారు లేక దేశమిలా తగలడింది" విసుగ్గా అంది రూపాదేవి.

తాను కూడా ఏదో ఒకటి మాట్లాడకుంటే బాగుండదని భావించి "మేడమ్... ఏ సంస్థలో నాకు ఉద్యోగమిప్పించాలని మీరు భావిస్తున్నారు? " అడిగింది సుమతి.

"ఏ సంస్థో ఎందుకు? కిరణ్ అండ్ కిరణ్ ఇండస్ట్రీస్ ఉందిగా" నవ్వుతూ చెప్పింది రూపాదేవి.

చివ్వున తలెత్తి రూపాదేవి వైపు చూసి "ఏదీ మళ్లీ చెప్పండి" అంది స్పందన అను




మానంతో.

"కిరణ్ ఇండస్ట్రీస్ గురించి చెబుతున్నాను. ఎమ్.డి. రవికిరణ్ నాకు చాలా క్లోజ్... సుమతి గురించి ఈ రోజే చెప్తానతనికి. నా మాట అతను కాదనడు" చెప్పింది రూపా దేవి.

"షిట్" తన్లో తనే పళ్లు కొరుక్కుంటూ అనుకుంది స్పందన.



సాయంకాలం అయిదవుతోంది. అది రవికిరణ్ ఇల్లు. బయట హాల్లో కూర్చుని పేపరు చదువుతున్నాడు ప్రభాకరరావు. వాచ్‌మన్ మెయిన్‌గేటు ఓపెన్ చెయ్యడంతో వైట్‌కలర్ మారుతి వ్యానొకటి లోపలికొచ్చి పోర్టికోలో ఆగింది.

"ఎవరదీ?" పేపర్లోంచి తలెత్తి కళ్లద్దాల్ని ఓసారి సరిచేసుకుని తనలో తనే ప్రశ్నించుకున్నాడు ప్రభాకరరావు. వచ్చిన మనిషెవరో తెలిశాక ప్రభాకరరావు ముఖంపై చిరునవ్వు విరిసింది.

"చాలా తీరిగ్గా కూర్చుని పేపరు చదువుతున్నావ్. అదృష్టవంతుడివంటే నిజంగా నువ్వేనోయ్" నవ్వుతూ అంటూ ప్రభాకరరావు ఎదుట కుర్చీలో ఆసీనుడయ్యాడు ప్రసాదరావు.

ప్రసాదరావు మాటలకు నవ్విన ప్రభాకరరావు

"అక్కడికి నువ్వేదో పీకల్లోతు కష్టాల్లో కూరుకుపోయినట్టు" అన్నాడు.

"అబ్బాయి లేడా ఇంట్లో?"

"నాకు తెలీకడుగుతాను. ఇది రవికిరణ్ ఇంట్లో ఉండే టైమా?"

"వ్యాపార భారమంతా అబ్బాయిపై వదిలేసి హాయిగా కూర్చున్నావురా"

"వాడి ముఖం. కిరణ్ ఇండస్ట్రీస్ ఛెయిర్ పర్సన్‌ని నేనేకదా!"

"అవునవును కనబడుతూనే ఉంది నీ ఛైర్మన్‌గిరీ"

"నోర్మూయ్‌రా... ఛైర్మన్లెక్కడైనా ఫ్యాక్టరీల్ని అంటి పెట్టుకునుంటారా?"

"ఇక మొదలైందా మీ గొడవ? నమస్కారం అన్నయ్యగారూ బాగున్నారా?"

"అమ్మా దమయంతీ నువ్వొచ్చేశావా? నమస్కారం" అన్నాడు ప్రసాదరావు.

"మీ ఫ్రెండ్ ఏం చెబుతున్నారన్నయ్యా?"

"చూడమ్మా... బాధ్యతలన్నీ కొడుకుపై వేసింది చాలక ఇంట్లో హాయిగా కాలుమీద కాలువేసుక్కూర్చుని అదేమని అడిగితే నేను ఛైర్మన్ని నా ఇష్టం అంటున్నాడు వీడు" ప్రసాదరావ్ అన్నాడు.

"అంటారంటారు ఎందుకనరు? కాసేపాగితే నేనే ఈ దేశానికి ప్రెసిడెంటునని కూడా అంటారు. వినేవాళ్లుంటే ఎంతయినా అంటారు" అంది దమయంతి చిరుకోపంతో.

"సర్లే... వాడికేమన్నా తెచ్చిపెట్టు తింటాడు... పాపం ఎక్కువగా మాట్లాడి అలసిపోయాడు" ప్రభాకరరావు భార్యతో అన్నాడు.

"అంటే ఏమిట్రా నీ ఉద్దేశం? నేను తిండికి లేక నీ ఇంటికొచ్చాననుకున్నావా?"

"ఏమో! నాకయితే అలాగే అనిపిస్తోంది"

"సిగ్గు లేకపోతే సరి! ఏం మాటలండి

అవి? మీరేమీ అనుకోకండి అన్నయ్యా గారూ! నేనిప్పుడే వస్తాను" అంటూ లోపలి కెళ్లబోతున్న దమయంతితో

"నేనేమీ అనుకోను కానీ చల్లగా తాగేం దుకు ఏదైనా షర్బత్ లాంటిది తీసుకు రామ్మా. అదీ ఒక్కటే గ్లాసు. నా ఒక్కడికి మాత్రమే"

ప్రసాదరావు మాటలకు దమయంతి, ప్రభాకర్‌రావు ఇద్దరూ నవ్వేశారు.

"అన్నట్టు ఓ విషయం చెప్పడం మరచి పోయానోయ్. అదీ... ఆ... మా అమ్మాయి స్పందన బ్యాంకాఫీసరుగా సెలెక్ట యింది" చెప్పాడు ప్రసాదరావు.

"నిజంగానా? వెరీగుడ్ చూస్తే మీ అమ్మాయి స్పందన చాలా తెలివైన పిల్లలా కన్పిస్తోంది నాకు" అన్నాడు ప్రభాకరరావు.

"కనిపించడమేంట్రా? నిజంగా తెలివైంది మా స్పందన"

ఇద్దరికీ జ్యూస్ తీసుకొచ్చింది దమ యంతి.

"దమయంతీ! ఇది విన్నావా? మన ప్రసాదరావు కూతురు బ్యాంకాఫీసరుగా సెలక్టయిందట"

"చాలా సంతోషం అన్నయ్యగారూ! మంచి వార్త చెప్పారు. అయితే మీ అమ్మా యిని ఓసారి చూడాల్సిందే"

"ఒట్టిగా చూడటమేంటోయ్? ఒక రోజు వాడింటికి మనమంతా వెళ్లి అమ్మాయి స్పందన్ని చూసి భోంచేసి మరీ వద్దాం ఏమంటావురా? " ప్రసాదరావునుద్దేశించి అన్నాడు ప్రభాకరరావు.

"మీరు రావాలేకానీ మీరు మా ఇంటికొచ్చే దారినిండా తివాచీ పరచి పూలు జల్లి, అడు గడుగునా వెల్‌కమ్ బోర్డ్సు పెట్టి మరీ ఆహ్వానిస్తాను" ఆనందంతో అన్నాడు ప్రసా దరావు.

"నేను రెడీ" అంది అప్పుడే ఇంట్లో నుండి బైటికొచ్చిన కిరణ్మయి, ప్రసాదరావుకు నమ స్కారం చేస్తూ.

"ఓ కిరణ్మయీ... ఏమ్మా... బాగా చదు వుకుంటున్నావా? ఒరే ప్రభాకర్ ఏమాట కామాటే చెప్పుకోవాలిరా... కిరణ్మయి చాలా క్రమశిక్షణ గల అమ్మాయి. అమ్మా కిర ణ్మయీ మీ ఇంట్లో ఎవర్రాకపోయినా పర్లే దుకానీ నువ్వు మాత్రం రావాలిరా" ప్రసాద రావు మాటలకు ప్రభాకరరావు దంపతులు నవ్వారు.

"అంతా బాగానే ఉంది కానీ నాకు మాత్రం ఒక విషయం అర్థం కాలేదు. అసలు సందర్భమేంటి? పెళ్లి చూపులా? " అడిగింది కిరణ్మయి.

"పెళ్లి చూపులనుకుంటే పెళ్లి చూపులే! అందులో వింతేముంది? " అన్నాడు ప్రభాక రరావు.

"ఏమోయ్ దమయంతీ! మన ప్రసాద రావు కూతురు స్పందనని కోడలిగా చేసుకో వడం నీకిష్టంలేదా? " భార్యనడిగాడు.

"ఇది మరీ బాగుంది అక్కడకి మీరిద్దరూ స్నేహితులూను. నేను పరాయిదాన్నా? పెళ్లయి ఇన్నేళ్లయింది. మీ మాటెప్పుడైనా నేను కాదన్నానా? " అడిగింది దమయంతి.

"నన్ను క్షమించరా ప్రభాకర్. అసలు ఈ విషయం నేను ఏదో ఓ రోజు మీతో మాట్లాడదామని అనుకుంటూ ఉన్నాను కానీ ఎందుకో ధైర్యం చాలక అడగలేకపో యాను. నేను అడగాలనుకున్న విషయం ఈవిధంగా మీ నోటి నుంచి వస్తుంటే సంతోషం పట్టలేక పోతున్నాన్రా. నిజం చెబుతున్నా నిజంగా నా అంత అదృష్టవం తుడు ఈ ప్రపంచంలోనే ఎవరూ లేరంటే నమ్ము" ప్రసాదరావు మాట్లాడుతుండగా అతని కళ్లలోంచి ఆనందభాష్పాలు రాలాయి.

"రేయ్ ప్రసాద్, ఎవరో ముక్కూమొఖం తెలియని వాళ్లతో సంబంధం కలుపుకునే దానికంటే నా ఫ్రెండ్‌వి, నా క్లాస్‌మేట్‌వి... నీతో వియ్యమందడంకన్నా గొప్ప విషయం ఏముంటుంది నాకు? నిజంగా నేను అదృ




ష్టవంతుణ్ణి" తన స్నేహితుణ్ణి ఓదార్చాడు ప్రభాకరరావు.

"సో... మనమంతా వదినని చూడ్డానికి వెళ్తున్నామన్న మాట. మమ్మీడాడీ! నాకు వదినని ఇప్పుడే చూడాలనిపిస్తోంది. అంకుల్... నేను మీ వెంట వస్తాను. నాకు వదినని చూపించరూ" బతిమాలసాగింది కిరణ్మయి.

"అలాగే వెళ్దువుగాని నీకెప్పుడూ తొందరే కదా! మంచి రోజు చూసి డాడీ చెప్తారు. అప్పుడు అందరమూ వెళదాం" అంది దమయంతి

"నువ్వు చెప్పరా ఏ రోజైతే బాగుంటుందో? " ప్రభాకరరావు ప్రశ్నకు ప్రసాదరావు సమాధానం చెప్పేంతలో సెల్ ఫోన్ మ్రోగింది.

కోటు జేబులోంచి సెల్ తీసి "హలో చెప్పునాన్నా" అన్నాడు ప్రభాకరరావు తన కొడుకు రవికిరణ్ నంబర్ గుర్తుపట్టి.

★ ★ ★

రాత్రి తొమ్మిదిన్నర. రవికిరణ్, కిరణ్మయీ, ప్రభాకరరావు డైనింగ్ టేబుల్ ఎదురుగా ఉన్న కుర్చీల్లో కూర్చున్నారు. దమయంతి వడ్డిస్తోంది. సెల్‌ఫోన్లో ఏదో మాట్లాడుతోంటే రవికిరణ్ చేతిలోంచి ఫోన్ లాక్కుని పక్కనపెట్టి "పగలంతా సరిపో లేదా నీ బిజినెస్ వ్యవహారాలకి? కనీసం రాత్రిపూటయినా ఇంటి దగ్గర ప్రశాంతంగా భోంచెయ్యొచ్చుకదా! ఇంకోసారి డైనింగ్ టేబుల్ దగ్గరున్నప్పుడు ఫోన్ కనబడిందంటే అవతల విసిరేస్తాను" కోపంగా అంది దమయంతి.

"ఫ్యాక్టరీ అన్నాక లక్ష వ్యవహారాలుంటాయ్... నీకేం తెలుసు? ఎందుకలా విసుక్కుంటావ్? " అన్నాడు ప్రభాకరరావు.

"బాగుందండి... మా నాన్న మీ చేతికిచ్చిన ఫ్యాక్టరీయేకదా అది! ఇప్పుడు మీరేమో నాకేం తెలీదంటున్నారు" అంది దమయంతి.

"డిన్నర్ స్పెషలేంటి మమ్మీ" అడిగాడు రవికిరణ్.

గుత్తివంకాయకూర, దొండకాయ పచ్చడి, కేరట్ కర్రీ, ఇది పులుసు, ఇది సాంబారు, రసం, బీరకాయపచ్చడి

"ఏంటి మమ్మీ ఇదంతా? ఇంకేం స్పెషల్ లేదా? " అడిగాడు రవికిరణ్ కొంచెం విసుగ్గా.

"వెజిటబుల్స్ తింటే ఏ ట్రబులూ ఉండదురా నాన్నా" అన్నాడు ప్రభాకరరావు.

"ఒరే నేను నీ తల్లినిరా. బిడ్డకేది ఇష్టమో అమ్మకు తెలీదా? " అంటూ అప్పుడే తెచ్చిన డిష్‌లోంచి చికెన్‌కర్రీ వడ్డిస్తూ అంది దమయంతి.

"మైగుడ్ మమ్మీ" అంటూ లొట్టలేస్తూ తింటున్న తన అన్నతో "ఒరే అన్నయ్యా! దానికంటే స్పెషల్ డిష్ ఇంకోటి ఉందిరా నీకోసం" అంది కిరణ్మయి.

"ఏమిటబ్బా అది? " తింటూ ఆశ్చర్యంగా చెల్లెలు వైపు చూశాడు రవికిరణ్.

"పెళ్లి చూపుల్లేరా" అంది దమయంతి కొడుకుతో.

"అప్పుడే దీనికి పెళ్లా? " ఆశ్చర్యంతో కిరణ్మయి వైపు చూసిన రవికిరణ్ తలపై ఒక్కటిచ్చి

"నాక్కాదురా ఫూల్ పెళ్లి నీకే" అంది కిరణ్మయి.

"నాకా? నిజమా? వెరీగుడ్... అయితే మన కిరణ్మయికి వదిన రాబోతోందన్న మాట. ఇంతకీ ఎవరా అమ్మాయి? ఏమా కథ? " ఆసక్తిగా అడిగాడు రవికిరణ్.

"వేరెవరో కాదురా మీ డాడీ క్లాస్‌మేట్ ప్రసాదరావుగారి అమ్మాయి. పేరు స్పందనట" దమయంతి అలా చెప్పేసరికి తింటున్న రవికిరణ్‌కి పొలమారి ఒక్కసారి దగ్గు తన్నుకు వచ్చింది.

వెంటనే దమయంతి రవికిరణ్ తలపై మెల్లగా కొట్టి "ఏమైంది? చికెన్‌కర్రీ బాగో లేదా? " అంటూ తాగటానికి నీళ్లిచ్చింది.

"కర్రీ బాగానే ఉంది మమ్మీ... కారమే కాస్త ఎక్కువైనట్టుంది" అన్నాడు రవికిరణ్.

★ ★ ★

"అప్పుడే నా పెళ్లికి తొందరెందుకు? ఏదో కొంప మునిగినట్టు... ముందు నేను ఉద్యోగంలో జాయినయి, కొన్నాళ్ల వరకు ఉద్యోగం చేసుకోనివ్వండి నన్ను. ఆ తర్వాత ఆలోచిస్తాను పెళ్లి గురించి" చెప్పింది స్పందన.

"నేనూ అలాగే అనుకున్నానే కానీ నీ ఇష్ట మొచ్చినప్పుడు పెళ్లి చేసుకుంటానంటే ఆ టైముకి మంచి సంబంధం దొరకొద్దూ" అంది అన్నపూర్ణ.

"దానికేముంది మంచి సంబంధం వచ్చినప్పుడే చేస్కుంటాను. అయినా పెద్దలు కుదిర్చే సంబంధాలపై నాకు సదభిప్రాయం లేదు మమ్మీ"

"ప్రేమించి పెళ్లి చేస్కోవాలనుందా?"

"అసలు నా పెళ్లి గురించి నేను ఇంత వరకూ ఏమీ ఆలోచించలేదు"

"ఆ పని చెయ్యవే. నువ్వు ఆలోచించ వద్దు. మేమూ పట్టించుకోము. ఇలా జీవితాంతం కన్యగానే ఉండిపో" విసుగ్గా అంది అన్నపూర్ణ.

"నేనూ అదే అనుకుంటున్నాను. పెళ్లి చేస్కుని భర్తకు సేవలు చెయ్యడం నావల్ల కాదు. అసలే నాకు ఓపిక, సహనం తక్కువ" అంది స్పందన.

"కోపానికి మాత్రం కొదవలేదు. ఇలాగయితే ఎలా చెప్పు? క్షమ, సహనానికి స్త్రీ ప్రతిరూపం వంటిది. అంతేకాక" అంటూ అన్నపూర్ణ ఇంకా ఏదో చెప్పబోయేసరికి,

"వద్దు... లెక్చరొద్దు ఆపెయ్... అసలేంటి సంగతి? ఈ రోజు పొద్దున్నే బ్రేక్ ఫాస్టుకి బదులుగా ఈ ఫీస్టు మొదలెట్టావ్? ఏదైనా విశేషమా?" అడిగింది స్పందన.

"అసలు నిజం ఇప్పటికి పసికట్టావమ్మా. ఇప్పుడు నిజంగా నువ్వు నా కూతురనిపించావ్" అప్పుడే వచ్చిన ప్రసాదరావు అన్నాడు.

"ఏమిటి డాడీ... మమ్మీ పెళ్లో అని ఒకటే హస్కు మొదలెట్టింది పొద్దున్నే" అడిగింది స్పందన.

స్పందన మాటలకు ప్రసాదరావు నవ్వుతూ,

"అవున్రా! నిజమే నా క్లాస్‌మేట్ ప్రభాకరరావు కొడుకు రవికిరణ్‌తో నీ పెళ్లి జరిపించాలని నేను చాలాకాలంగా అనుకుంటున్నాను" అని చెప్పి కూతురి ముఖంలో మారుతున్న ఫీలింగ్స్ గమనించాడు.

"అతనికి తాను డబ్బున్న వాడిననే అహంకారమెక్కువ డాడీ.. మొన్నటికి మొన్న అతడేం చేసాడో తెలుసా? నా పర్మిషన్ లేకుండా నా గిఫ్ట్ తీసుకెళ్లాడు" అంది.

"పిచ్చితల్లీ రవికిరణ్ణి చేస్కున్నావంటే అతనే ఓ అమూల్యమైన గిఫ్టమ్మా నీకు. నీ క్షేమం కోరి చెబుతున్నాన్రా. ఈ డాడీ మాట నమ్మవా?"

"ఆలోచించుకోవడానికి నాక్కొంత టైమివ్వండి" చెప్పింది స్పందన.

రవికిరణ్‌తో పెళ్లికి స్పందన ఇష్టపడే అవకాశాలు ఎక్కువవున్నాయని గమనించిన స్పందన పేరెంట్స్ ఊపిరి పీల్చుకున్నారు.

★ ★ ★

కిరణ్ అండ్ కిరణ్ ఇండస్ట్రీస్. సమయం మధ్యాహ్నం పన్నెండవుతోంది. కంప్యూటర్ ఎదుట కూర్చుని కిరణ్ ఇండస్ట్రీస్ తాలూకు ఫైల్స్‌ని పరిశీలించసాగాడు ఎం.డి. రవికిరణ్.

"మే ఐ కమిన్ సార్?" అని వినిపించింది.

"కమిన్" కంప్యూటర్ నుంచి దృష్టి మళ్లించకుండానే అన్నాడు రవికిరణ్.

"సర్! కొన్ని ఫైల్స్ మీద మీ సంతకాలు కావాలి"

"ఓ అరుణ్ ఎలా వున్నావ్" ఛైర్‌తోపాటు పక్కకు తిరిగి అరుణ్‌ని చూసి నవ్వుతూ విష్ చేశాడు రవికిరణ్.

"బాగానే వున్నాను సర్"

"నువ్వనుకోలేదు సుమా"

"ఫర్వాలేదు సర్"

"కూర్చో సిట్‌డౌన్"

"నేను నిలబడతాను సర్. మీ ముందు కూర్చోడం అంత బాగుండదు సర్. ఎవరైనా చూస్తే" నసిగాడు అరుణ్.

"నేను కిరణ్ ఇండస్ట్రీస్ ఎం.డి. చెప్తున్నాను కూర్చో"

కూర్చున్నాడు అరుణ్.

"సర్! ఈ ఫైల్స్‌పై"

"టు హెల్ విత్ యువర్ ఫైల్స్. పని... పని... పని... ఎప్పుడూ పనేనా? కమాన్ అరుణ్ మనకోసం ఉద్యోగం కానీ ఉద్యోగం కోసం మనం కాదు కదా! అస్తమానం పనిచేస్తూ మన వ్యక్తిగత జీవితానికి ప్రాముఖ్యత నివ్వడం మర్చిపోతున్నాం మనం. అవునా?" అడిగాడు రవికిరణ్.

"అవును సర్"

"సరే చెప్పు నీ మారీడ్ లైఫ్ ఎలా వుంది?" అడిగాడు.

"చాలా ఆనందంగా వుంది సర్"

"వెరీగుడ్. నాకు చాలా సంతోషంగా ఉందోయ్. ఎందుకంటే నేను మధ్యవర్తిగా ఉండి చేసిన పెళ్లి ఇది. అంటే నేను చేసిన పనొకటి సక్సెస్ అయిందన్నమాట" అన్నాడు రవికిరణ్.

"మీలాంటి మంచి వ్యక్తి చేసే పని సక్సెస్ కాకపోవడమా. ఇంపాజిబుల్"

"అయితే మనం ఇప్పుడు చల్లగా, తియ్యగా కూల్‌డ్రింక్ తాగుదాం ఏమంటావ్?" అడిగాడు రవికిరణ్.

"మీరు చెప్పాక కాదంటానా? ఒక విషయానికి నేను చాలా బాధపడుతుంటాను సర్ అప్పుడప్పుడు" చెప్పాడు అరుణ్

"దేని గురించి?" రవికిరణ్ అడిగాడు అర్థంకాక.

"మీలాంటి వ్యక్తికి నేను తమ్ముడిగా పుట్టనందుకు" అన్నాడు.

ఇంతలో ఇంటర్‌కమ్ మోగడంతో ఫోనెత్తి "ఎస్" అన్నాడు రవికిరణ్.

"సర్ రూపాదేవిగారొచ్చారు" చెప్పింది కల్యాణి.

"రమ్మను" అన్నాడు రవికిరణ్.

వెంటనే అరుణ్ లేచి "సర్ నేవెళ్తాను. ఫైల్స్‌పై సంతకాలు పెట్టండి" అన్నాడు.

అరుణ్ మాటలకు చిరాకుపడ్డ రవికిరణ్ "వచ్చినప్పట్నుంచి గమనిస్తున్నాను నిన్ను. కూర్చోమంటే కూర్చోవు. ఆగమంటే ఆగవు. ఏమైంది నీకు? ఎందుకంతలా భయపడతావ్? ఎవరైనా నిన్ను తినేస్తారని భయమా! నేను వెళ్లమన్నంతవరకు కదిలావంటే ఒప్పుకునేదిలేదు" అన్నాడు.

అంతే! అరుణ్ సైలెంట్‌గా కూర్చున్నాడు.

డోర్ తెరుచుకుని "హలో మిస్టర్ కిరణ్ ఎలా వున్నావు బాస్?" అంటూ రవికిరణ్ణి నవ్వుతూ విష్ చేసింది రూపాదేవి. బ్లూకలర్ జీన్స్, వైట్ షర్ట్ లూజుది ధరించింది. బ్లాక్‌గాగుల్స్ కళ్లకున్నాయి.

"ఓ రూపాదేవిగారూ! ఆశ్చర్యం! చాన్నాళ్ల తర్వాత... వెల్‌కమ్ వెల్‌కమ్" అంటూ లేచి రూపాదేవితో కరచాలనం చేశాడు రవికిరణ్.

రవికిరణ్ ఎదురుగా అరుణ్ పక్కన కూర్చుంది రూపాదేవి.

"ఇతను నా ఫ్రెండ్, మిస్టర్ అరుణ్" అని అరుణ్ గురించి రూపాదేవితో చెప్పాడు రవికిరణ్.

"హలో" అంటూ కరచాలనం కోసం చేయి చాపిన రూపాదేవిని చూసి భయపడ్డ అరుణ్ రెండు చేతులూ జోడించి "నమస్తే" అన్నాడు వినయంగా.

చేతిని వెనక్కి తీసుకుని "నమస్తే" అంది రూపాదేవి.

రవికిరణ్ మందహాసం చేశాడు.

"చెప్పండి మేడమ్ ఏంటి విశేషాలు? ఈ రవికిరణ్ చాలా రోజుల తర్వాత గుర్తొచ్చాడే మీకు?" అన్నాడు.



"నోనో నాటెటాల్. పనుల్తో బిజీగా ఉండి వీలుపళ్లేదు. లేకపోతే మీ కంపెనీ అంటే నాకు చాలా ఇష్టం" అంది నవ్వుతూ.

"థాంక్యూ చెప్పండి. ఏం తీస్కుంటారు? " అడిగాడు.

"మీ ఇష్టం" చెప్పింది.

ఇంటర్‌కమ్‌లో మూడు కోక్‌లు చెప్పాడు కిరణ్.

"రియల్లీ మిమ్మల్ని చాలా ఎప్రీషియేట్ చెయ్యాలి మిస్టర్ కిరణ్. మీలాంటి మన సున్న మంచి వ్యక్తి నా ఫ్రెండ్ సర్కిల్లో ఉన్నందుకు నేనెప్పుడూ ప్రౌడ్ ఫీలవుతుం టాను యూనో" అంది రూపాదేవి.

"మరీ అంతలా పొగిడెయ్యకండి మేడమ్. నేను లంచ్ చెయ్యడానికి వీలుండదు" అన్నాడు రవికిరణ్.

ఆ మాటలకు అరుణ్, రూపాదేవి కలసి నవ్వారు.

"విమెన్స్ వెల్ఫేర్ గురించి మీరు చేసిన ధన సహాయం నేను మరచిపోలేను మిస్టర్ కిరణ్. నేనెప్పుడు అడిగినా వెంటనే చెక్కులు జారీచేశారు. నా మీద మీకున్న నమ్మకానికి మీకు కృతజ్ఞతలు తెలియజేస్తు న్నాను" అంది రూపాదేవి.

"ఓ అదా! దానికేముంది మేడమ్. ఫీల్డ్‌లో మీరు పడే కష్టంతో పోలిస్తే నేను చేసిన సహాయమేపాటిది? మీరు ఎప్పుడ నుకుంటే అప్పుడు వచ్చి మీక్కావల్సింది నిర భ్యంతరంగా తీస్కుని వెళ్లవచ్చు" చెప్పాడు రవికిరణ్.

"కానీ మీలాంటి బ్రాడ్‌మైండ్ అందరికీ ఉండాలికదా" అంది.

ఇంతలో కూల్‌డ్రింక్స్ వచ్చాయి.

కోక్ సిప్ చేస్తూ "ఈ హోదా, ఆస్తి, కీర్తి ప్రతిష్టలపై నాకెప్పుడూ నమ్మకంలేదు మేడమ్. వీటిని చూసుకుని నేనెప్పుడూ గర్వపడలేదింతవరకూ. గర్వపడను కూడా! కష్టాల్లో, బాధల్లో ఉన్న వ్యక్తులు నా దృష్టి లోకొచ్చినపుడు వారిని తప్పించుకుని నా సంతోషం నేను చూస్కోవడం నావల్లకాదు" చెప్పాడు రవికిరణ్.

"అది మీ ఔన్నత్యం " చెప్పింది రూపా దేవి.

అరుణ్ ఎం.డి. రవికిరణ్‌వైపే కళ్లప్ప గించి చూడసాగాడు.

"దేవతల్లాంటి అమ్మానాన్నల్ని దేవుడిచ్చి నందుకు నేను అనుక్షణం ఆయనకి కృతజ్ఞ తల్ని తెలియజేస్కుంటూ ఉంటాను నా మనసులో. అన్నయ్యా అంటూ నా చెల్లెలు కిరణ్మయి పలుకుతున్నపుడల్లా ఎంతో పుల కించిపోతుంటాను. నా దృష్టిలో నిజమైన ప్రాపర్టీ అంటే ఇదే! తన గురించి ఆలోచిం చేవాళ్లు, తన కొర్కై బాధపడేవాళ్లు అను క్షణం తన క్షేమం కోరుకునేవాళ్లని కలిగిన వాడే అదృష్టవంతుడు. అటువంటి అనుబం ధాలు లేనివాడు ఎంత ఉన్నా నిజంగా దుర దృష్టవంతుడు" చెప్పాడు రవికిరణ్.

ఔనంటూ తలూపింది రూపాదేవి.

"నిన్నే" రవికిరణ్ మాటలకు, తననితాను మైమరచిపోయిన అరుణ్‌తో అన్నాడు రవి కిరణ్.

"సర్" అన్నాడు ఇహంలోకొచ్చాక ఉలిక్కి పడుతూ అరుణ్.

"ఫైల్స్ కల్యాణితో పంపిస్తాను"

"అలాగే సార్" వెళ్లిపోయాడు అరుణ్.

"మిస్టర్ కిరణ్, ఒక ప్రామిస్ చెయ్యాలి మీరు" చెప్పింది రూపాదేవి.

"ప్రామిసా! దేని గురించి మేడమ్? "

"సుమతి అని చదువుకున్న ఓ మంచి అమ్మాయికి మీ ఇండస్ట్రీలో ఏదైనా జాబ్ ఇవ్వాలి మీరు"

"అలాగే తప్పకుండా. బైదిబై చాలా రోజు ల్నించి పర్సనల్ సెక్రటరీ ఎవరూ లేక ఇబ్బంది పడుతున్నాను. ఏ అవసరమొ చ్చినా టైపిస్ట్ అమ్మాయి కల్యాణిని పిలవా ల్సొస్తోంది. పి.యస్. పోస్టుకోసం పత్రికలో యాడ్ ఇవ్వాలని ఎప్పటికప్పుడు అనుకుం టూనే ఉన్నాను. కానీ మరచిపోతున్నాను"




అన్నాడు.

"అయితే సుమతి మీ పర్సనల్ సెక్రటరీ కాబోతోందన్నమాట" నవ్వుతూ అంది.

"వైనాట్? మీరు చెప్పారంటే అందులో సందేహించాల్సిందేం వుండదు" చెప్పాడు.

"ఓ... థాంక్యూ మిస్టర్ కిరణ్, థాంక్స్ ఎలాట్. సుమతికేం చెప్పమంటారు? "

"ఇక చెప్పడానికేముంది? రేపే వచ్చి జాయినవమనండి"

"అయితే ఈ విషయం తెలిశాక స్పందన కూడా సంతోషపడుతుంది"

"స్పందనా స్పందనెవరు? ప్రసాదరావు గారి అమ్మాయా? "

"అవును, మీకెలా తెలుసు? చాలా ఖచ్చితంగా ఊహించి చెప్పారే. స్పందనా, సుమతీ చాలా క్లోజ్ ఫ్రెండ్స్. సుమతికెక్కడైనా జాబ్ చూడమని స్పందనే చెప్పింది నాతో"

"ఐసీ" సాలోచనగా అన్నాడు రవికిరణ్.

"ఏదైనా ప్రాబ్లెమా కిరణ్? " అడిగింది రూపాదేవి.

"ఏమీలేదు"

"స్పందన మీకు పరిచయమా? "

"లేదు లేదు. మా డాడీ, ప్రసాదరావు గారూ ఇద్దరూ క్లాస్‌మేట్స్. ఆవిధంగా" నసిగాడు రవికిరణ్.

"ఇంకా మీకేమైనా నా హెల్ప్ కావాలా మేడమ్? " అడిగాడు రవికిరణ్.

"మిస్టర్ కిరణ్! అడిగిందే తడవుగా ఉద్యోగం శాంక్షన్ చేశారు. అది చాలు నేవెళతాను" లేచింది రూపాదేవి.

"ఓకే మళ్లీ కలుద్దాం" కరచాలనం చేస్తూ అన్నాడు.

★ ★ ★

స్టాన్లీ కాలేజ్ సమయం ఉదయం పదకొండు గంటలు. ఇంగ్లీషు లెక్చరర్ మూర్తి క్లాసు.

"రేయ్ గురుడు ఈరోజు చెక్స్ ఉన్న కొత్త చొక్కా వేస్కుని వచ్చాడు ఏంటి సంగతి? "

"బర్త్‌డే ఏమోరా"

"ఏమో. మాంచి హుషారుమీదున్నట్లు కనబడ్తున్నాడు"

"ఆంటీ ఈరోజు బ్రేక్‌ఫాస్ట్‌లో పెసరట్టు, ఉప్మా పెట్టి పంపిందేమో"

"పెసరట్టు, ఉప్మానా? గాడిద గుడ్డా! సద్దన్నం తినొచ్చుంటాడు. సద్దిమొఖంనా యాలు"

"ఈరోజు ఏస్టోరీ చెబుతాడో? "

"ఏంటి బాబూ? ఏవీఆర్‌గారి క్లాసులో స్టోరీలూ, పొయిట్రీలేం ఉండవ్-ఓన్లీ డ్రామాస్. అదీ లైవ్" ఈవిధంగా, మగపిల్లలందరూ కామెంట్ చేసుకోసాగారు.

ఫ్రంట్ బెంచీల్లో వున్న కిరణ్మయి, శిరీష, అనుపమ, రాణి ఆసక్తిగా ఏవీఆర్ మూర్తిని గమనించసాగారు.

ఏవీఆర్ మూర్తి కాలర్ బటన్నోసారి సరి చేస్తున్నట్టు నటించి, పొడిదగ్గు దగ్గి ఏదో చెప్పడానికి ఉద్యుక్తుడయ్యాడు.

"చూశావా? ఏఎన్‌ఆర్ స్టిల్లిచ్చాడప్పుడే" వెనక బెంచీల్నుండి అన్నారెవరో. కొంత మంది అమ్మాయిలు నోటికి కర్చీఫ్‌లు అడ్డు పెట్టుకుని నవ్వడం మొదలెట్టారు. అప్పటికే ఏవీఆర్ క్లాసని తెలిసిపోయిన పక్కక్లాసుల వాళ్లంతా మెల్లగా జమకాసాగారు.

"యూసీ" అన్నాడు ఏవీఆర్ తన స్టూడెంట్స్‌తో.

"ఏసీ? " అన్నారెవరో... అంతా నవ్వులు విరిశాయి.

"మై డియర్ స్టూడెంట్స్! ఈరోజు నా లెక్చర్, షేక్స్‌పియర్ అపూర్వ సృష్టి అయిన రోమియో అండ్ జూలియట్ పాత్రల గురించి...నిజంగా షేక్స్‌పియర్‌లేని ఆంగ్ల సాహిత్యాన్ని ఊహించడం చాలా కష్టం. ప్రపంచ సాహిత్యానికి షేక్స్‌పియర్ చేసిన సహాయం మరువలేనిది. రోమియో అండ్ జూలియట్ పాత్రలు ఇద్దరు ప్రేమికులకు ప్రతిరూపాలు. లైలా- మజ్నూ; శకుం

తలా-దుష్యంతులు, ఇంకా చెప్పాల్సివస్తే- మీలో అక్కినేని నాగేశ్వరరావు నటించిన 'దేవదాసు' సినిమా ఎవరైనా చూశారా? " ఏవీఆర్ తన స్టూడెంట్స్‌ని ఉద్దేశిస్తూ అడిగాడు.

"మేం చూళ్లేదు సార్" అన్నారు కొందరు.

"ఎటూ కాలేజీలో చేరాక మీరు దేవదాసు యాక్టింగ్ చేస్తారని తెలిసి చూళ్లేదు సార్" వెనక బెంచీలనుండి అన్నారు.

"నిజంగానా!" స్టూడెంట్స్ చెప్పింది విని పొంగిపోతూ మళ్లీ కాలర్ బటన్నోసారి సరి చేసుకుంటూ అన్నాడు ఏవీఆర్ మూర్తి.

"అవును సార్" అన్నారందరూ ఆవేశంగా.

"మైడియర్ స్టూడెంట్స్! నాపై మీకున్న నమ్మకానికి నేను పొంగిపోతున్నాను. అందుకే ఈరోజు నేను దేవదాసు సినిమాలో ఏఎన్ఆర్ ఎలా నటించినదీ మీ ఎదుట నటించి మరీ చూపించగలిగాను" అన్నాడు ఏవీఆర్‌మూర్తి.

క్లాసంతా చప్పట్లతో మార్మోగిపోయింది. వెనక బెంచీల్నుండి విజిల్స్ కూడా వినపడ్డాయి.

"ఒక గ్లాసుంటే తీస్కోండి" అన్నాడు ఏవీఆర్ సీరియస్‌గా.

"వీడు రిటైరయ్యేవరకూ ఈ కాలేజీ ఏరియాలో స్టీలు గ్లాసులు డైలీ అమ్ముకుంటా బాబాయ్"

"ఎందుకురా? "

"ఎందుకేంటి? వీడి క్లాసులో డైలీ ఓ గ్లాసు కావాలా? ప్రతీ క్లాసులో ఓ గ్లాసంటే, కనీసం అయిదు క్లాసులన్నా తీస్కుంటాడు వీడు. అంటే అయిదు గ్లాసులు. పాకెట్‌మనీకన్నా పనికొస్తుందిరా బాబూ"

"అందుకే అందరూ నిన్ను మట్టిబుర్రంటారు"

"ఎందుకురా బాబాయ్? "

"ఎందుకేంటి? స్టీలు గ్లాసు కిందపడితే పగుల్తుందా? "

"నిజమేరోయ్, తొందర్లో గాజుగ్లాసు అనబోయి స్టీలుగ్లాసు అనేశాను"

వెనకబెంచీల్లో ఇద్దరి స్టూడెంట్ల కామెంట్స్ ఆవిధంగా ఉన్నాయి.

వెనక బెంచీనుంచి ఓ స్టూడెంట్ ఎంతో భక్తిశ్రద్ధలతో పైకిలేచి లెక్చరర్ ఏవీఆర్ మూర్తి దగ్గరకొచ్చి తన పాంటు జేబులోంచి ఓ గాజుగ్లాసు తీసి ఏవీఆర్‌కిస్తూ, "తీసుకోండిసార్. మీకోసమని ఈరోజే కాలేజ్‌కు వచ్చేటప్పుడు దార్లో 'అమ్మనా బ్రదర్స్?' దుకాణంలో కొనుక్కొచ్చాను" అనేసరికి అందరూ నవ్వేశారు.

"అవునూ గ్లాసెందుకే? " శిరీష కిరణ్మయితో అంది.

"లవ్ ఫెయిల్ అయి తాగుబోతుగా మారతాడు హీరో..." చెప్పింది కిరణ్మయి.

"ఓ... ఐసీ" అంది శిరీష

"ఎప్పుడు చూశావే ఆ సినిమా? " రాణి అడిగింది.

"ఈటీవీలో వచ్చిందిలే"

"సినిమా పేరేంటి? " అనుపమ అడిగింది.

"అందుకే క్లాసులో నిద్రపోవద్దని చెప్పేది నీకు. రామాయణం అంతా విని..." రాణి అనుపమని విసుక్కుంది.

"దేవదాసు" చెప్పింది కిరణ్మయి.

"జీవితంలో ఇంకా పైకి రావాలని నిన్ను ఆశీర్వదిస్తున్నాను బాబూ" గ్లాసుని తనకిచ్చిన స్టూడెంట్‌తో అన్నాడు ఏవీఆర్‌మూర్తి.

"అందరూ కలసి పైకి లాగబట్టే ఈరోజు మీ ముందిలా నిలబడ్డాడు సార్ వాడు" అన్నారెవరో.

"ఎందుకు...ఏమైందితనికి? " అడిగాడు ఏవీఆర్ మూర్తి.

"మొన్న ఆదివారం షికారుకని గండిపేట కెళ్లి ఆ నీళ్లల్లో మునిగిపోతున్న వీణ్ణి తలా ఓ చెయ్యేసి పైకి లాగారందరూ" చెప్పారు.

"అలాగా పాపం..." జాలిపడ్డాడు మూర్తి.





"డియర్ స్టూడెంట్స్... మీలో ఎవరైనా సాహసవీరులు బయటికెళ్లి ఓ కుక్కపిల్లని తీసుకొచ్చారంటే, ప్రస్తుతం నేను నటించ బోయే ఈ దేవదాసు పాత్ర రక్తి కడు తుంది" అభ్యర్థించాడు మూర్తి.

"అవునొరే... కుక్కపిల్లెందుకురా? "

"అరె ఈడేంటి మామా... గ్లాసులిమ్మం టాడు. కుక్కపిల్లల్ని తెమ్మంటాడు. అరె... మా అయ్యకి చెప్పి వేరే కాలేజ్‌లో చేర్తా భాయ్" కొంతమంది స్టూడెంట్స్ సంభాష ణలు ఈవిధంగా సాగుతుండగా ఓ స్టూడెంట్ తాను కుక్కపిల్లని తీసుకొస్తానని చెప్పి బైటికెళ్లాడు.



"ఈమధ్య నా ఒంట్లో కొంచెం నలతగా ఉంటోంది మాధవరావు! పేరుకి ఛెయిర్ పర్సన్నే. అయినా, ఫ్యాక్టరీ మేనేజ్‌మెంటంతా అబ్బాయే చూసుకుంటు న్నాడు" అపూర్వ ఇండస్ట్రీస్ యజమాని మాధవరావుతో అన్నాడు ప్రభాకరరావు.

అప్పుడు సమయం రాత్రి ఎనిమిదవు తోంది. డిసెంబర్ నెల కావడంతో చలి ఎక్కువగానే ఉంది. అధునాతనంగా వెలిగి పోతున్న మాధవరావు బంగళా ఆవరణలో అపూర్వ ఇండస్ట్రీస్ తాలూకు సిల్వర్‌జూబిలీ ఫంక్షన్ జరుగుతోంది. నగరంలోని ప్రముఖ పారిశ్రామిక వేత్తలు అందరూ ఆ ఫంక్షన్లో పాల్గొన్నారు. సిటీలోని ఇతర డిగ్నిటరీసందరూ ఉన్నారక్కడ.

పారిశ్రామికవేత్త మాధవరావుకు చాలా పెద్ద సర్కిలుంది సిటీలో. అయినా తన మిత్రుడు ప్రభాకరరావంటే అతనికి ఆపేక్ష. క్లాస్‌మేట్స్ కాకపోయినా ప్రభాకరరావు, మాధవరావులిద్దరూ బిజినెస్‌లో చిన్న స్థాయినుంచి ఉన్నత స్థానానికి చేరుకోగలి గారు. ఇద్దరిమధ్యా రెండు దశాబ్దాల స్నేహం ఉంది. వారిద్దరలా నిలబడి మాట్లాడుకుంటూ ఉండగా చాలామంది వారి దగ్గరకొచ్చి ఇద్దర్నీ విష్ చేసి వెళ్ళసా గారు. గ్లాసుల్లో ఉన్న సాఫ్ట్ డ్రింక్స్‌ని మెల్లగా సిప్ చేయసాగారిద్దరూ.

"ఎవరూ... రవికిరణేగా" అన్నాడు మాధ వరావు.

"అవును... వాడి తండ్రినయినందుకు గర్వపడుతున్నాననుకో" మీసాలు మెలి తిప్పుతూ అన్నాడు ప్రభాకరరావు.

"వెరీగుడ్... నిజంగా అంత మొనగాడ య్యాడా? కిరణ్ ఇండస్ట్రీస్ మేనేజ్ చెయ్య గలుగుతున్నాడా? అప్పుడెప్పుడో కాలేజ్‌లో చదువుతున్నప్పుడు చూశానతన్ని. ఆరేడు సంవత్సరాలైంది. ఒకసారి వీలు చూసుకుని నా దగ్గరకు తీసుకురా. అతడిని చూడాల నుంది. వెరీ స్మార్ట్ బాయ్" మెచ్చుకున్నాడు మాధవరావు.

"గుడ్ జోక్" ప్రభాకరరావ్.

"ఎందుకు? " మాధవరావ్.

"కాకపోతే ఏమిటి? వీలు చూసుకుని నీ దగ్గరకు పిలుచుకురావడంకాదు. ప్రస్తుతం మా అబ్బాయి రవికిరణ్ ఈ ఫంక్షన్లోనే పార్టిసిపేట్ చేస్తున్నాడు" అన్నాడు ప్రభాక రరావు.

"ఓ... వెరీగుడ్. చూపించు. ఏడీ? ఎక్కడ? " మాధవరావు మాటల్లో క్యూరి యాసిటీ తొంగిచూసింది.



ఇరవై అయిదేళ్ళ అపూర్వ అందమైన అమ్మాయేకాదు, మర్యాదస్తురాలు. అణకువ, ఆప్యాయత, అభిమానం ఆమె ఆభరణాలు. ఆమె ధరించిన నీలిరంగు శారీ ఆమె అందాన్ని ద్విగుణీకృతం చేస్తోంది. తెల్లని మేనిఛాయ, మంచి హైటు, విరబోసిన నల్లని కురులు... మెడలో డైమండ్ నెక్లెస్... చెవులకు ఖరీదైన జూకాలు... లిప్ స్టిక్ సహాయం లేకుండానే ఎర్రగా మెరు స్తోన్న పెదవులు.

ఆమె తండ్రి మాధవరావు అరేంజ్ చేసిన అపూర్వ ఇండస్ట్రీస్ తాలూకు ఫంక్షన్లో అపూర్వ లేడీ ఆఫ్ ది ఈవెనింగ్‌లా ఉంది.



అవును మరి. కోట్ల ఆస్తికి అధిపతులైన మాధవరావు, జానకిల ఏకైక గారాలపట్టీ ఆమె. కానీ ఎం.బి.ఎ. చదువుకున్న అపూర్వకు తను ధనవంతురాలన్న గర్వం ఏమాత్రం లేదు. ఆమె ఫ్రెండ్స్ చాలా మంది ఇదే విషయం అపూర్వను అడుగుతుంటారు. కనీసం జీన్స్, టీ షర్టుల వంటివి కూడా ధరించదామె. ఎప్పుడు చూసినా చీర, జాకెట్టులో నిండుగా సింపుల్‌గా ఉంటుందామె.

ఆమెలో అందరూ మెచ్చుకునే అంశమేమిటంటే కడలి నురుగులాంటి అందమైన తెల్లని ఆమె నవ్వు. కేవలం అపూర్వ నవ్వితే చాలు. ఎదుటి వ్యక్తి అటెన్షన్ ఇటు డైవర్టవుతుంది. తేటవంటి తెలుగుదనానికి, తెలుగు సంస్కృతికి వారసురాలిలా ఉంటుంది అపూర్వ.

తన స్నేహితురాళ్ళతో మాట్లాడుతూ, నవ్వుతూ చాలా బిజీగా ఉంది అపూర్వ.

"ఇంకో జోక్ చెబుతానే..." రిక్వెస్టింగ్‌గా అంది సుస్మిత.

"వద్దు సుస్మితా... నవ్వుని కంట్రోల్ చేసుకోలేకపోతున్నాను" అంది అపూర్వ.

"నువ్వు నవ్వాలనేకదా దాని ప్రయత్నమంతా" చెప్పింది కరుణ.

"ఏదేమయినా అపూర్వా... యువ్వార్ ఎ లక్కీ గర్ల్" అంది అనిత.

"దేనిగురించి? "

"ఒకటా రెండా... ఎన్నని చెప్పమంటావ్. నీకు అందం ఉంది, ఆస్తి ఉంది. ఒక్కతే కూతురువి. పైగా ఎం.బి.ఎ. చదువుకున్నావ్. కేవలం నీ నవ్వుతో అందరూ నీకు దాసోహమంటారు" అనిత చెప్పింది.

"ఇంకా" కొంటెగా అడిగింది అపూర్వ.

"ఇంకా అంటే, కొన్ని యాంటినిమ్స్ కూడా ఉన్నాయి. అవి... నువ్వు లేటెస్టు అమ్మాయిల్లా మోడ్రన్‌గా ఉండవు. జీన్స్ వేస్కోవు. మార్కెట్లో కొచ్చిన కొత్త కార్లు కొనవు. ఔటింగ్ కూడా అంతంత మాత్రమే! వెల్ ఎడ్యుకేటెడ్ అయి ఉండి కూడా ఇంగ్లీషులో మాట్లాడవు. ఎప్పుడూ తెలుగే మాట్లాడతావు. ఫాస్టుఫుడ్డు తినవు. అన్నీ ఉండి ఇంత లేటెస్టు సమాజంలో పెరుగుతూ పాత తెలుగు సినిమాల్లో వాణిశ్రీ లా డ్రెస్సింగ్" ఇంకా అనిత చెప్పబోతుంటే.

"చాలు చాలు కాస్త ఆపుతావా నీ కాకిగోల" అడ్డుపడ్తూ అంది కరుణ. సుస్మిత కరుణను సపోర్టు చేసింది.

"ప్లీజ్... దాన్ని చెప్పనీయండే" ఇద్దర్నీ ప్రాధేయపడ్తూ అంది అపూర్వ.

"ఏంటి చెప్పనిచ్చేది? దాని మొఖం... దానికేం తెలుసు? నువ్వు మోడ్రన్‌గా ఉండవట? హవ్వ! ఎవరైనా వింటే నవ్వుతారు అనితా! మోడ్రన్‌గా ఉండటమంటే నీ ఉద్దేశమేంటి? మనం ధరించే బట్టల్లోనూ, తినే తిండి, తిరిగే కార్లలోనూ ఉంటుందా? నిజంగా నీకు అటువంటి అభిప్రాయమే కనుక ఉంటే నువ్వు పొరబడినట్టే. మన భావాలు, మన ఆలోచనలు ఆధునికంగా ఉండాలి. అసలు ఆధునికతంటే ఏంటి? జీన్స్ పాంటు కత్తిరించుకోడం, జుట్టు కత్తిరించుకోడం, పాప్‌సాంగో లేక రాప్‌సాంగో పాడుకోవడం కాదు. అసహ్యకర వస్త్రధారణ, జుగుప్స కలిగించే ప్రవర్తన ఆధునికత ఎలా అవుతుంది? " కరుణ నిలదీసింది.

"అఫ్‌కోర్స్... కానీ అనిత ఎనాలిసిస్ నాకు నచ్చింది. నేను చేస్తున్నదీ, చెయ్యాల్సినదీ అంటూ సమస్యని రెండు భాగాలుగా వివరించి మరీ చెప్పిందామె" అంది అపూర్వ.

"ఇంకా చెప్పందే? " అంది అనిత... ప్రశ్నార్థకంగా చూసింది అపూర్వ.

"ఇప్పుడు అపూర్వలో ఉన్న మంచి లక్షణాల గురించి చెబుతాను"

అనిత అలా అనేసరికి ఈసారి ఆశ్చర్యపోవడం కరుణ, సుస్మితల వంతయింది.

అనిత ఏదో చెప్పబోతుండగా "ఎక్స్‌క్యూ

జ్మి" అపూర్వ ఇండస్ట్రీస్‌లో అసిస్టెంట్ మేనేజర్‌గా పన్జేస్తున్న పార్థసారథి అపూర్వ స్నేహితురాళ్లని ఉద్దేశిస్తూ అన్నాడు. అందరూ సైలెంటయిపోయి పార్థసారథివైపు చూశారు.

"మేడమ్... మీ డాడీ పిలుస్తున్నారు"

"అలాగే మీరు పదండి" అని చెప్పి పార్థసారథిని పంపాక,

"సుస్మితా, కరుణ, అనిత! మీరు డిన్నర్ తీసుకోకుండా మాత్రం వెళ్ళొద్దు. ఒకవేళ నాకు టైమ్ దొరికితే నేనే మీ దగ్గరికొస్తాను... ఓకే" అంటూ చెప్పి తండ్రి మాధవరావుని వెతుకుతూ బయల్దేరింది అపూర్వ.

"ఓ... ఇక్కడున్నారా" వీళ్ళిద్దరయితే తన మమ్మీ డాడీలు.

మరి వారిద్దరి పక్కన ఆ ఇద్దరెవరు? తన తండ్రి వయసున్న ఒక వ్యక్తి, అతని పక్కన బ్రౌన్ కలర్ సూట్‌లో ఉన్న ఓ అందమైన యువకుడు మనసులో అనుకుంటూ దగ్గరకొచ్చింది అపూర్వ.

"కమాన్ బేబీ" మాధవరావు.

"రామ్మా" జానకి.

"షి ఈజ్ మై ఓన్లీ డాటర్ అపూర్వ. అపూర్వా, ప్రభాకర్రావని మై ఓల్డ్ అండ్ బెస్ట్‌ఫ్రెండ్"

"నమస్తే అంకుల్" రెండుచేతులూ వినయంగా జోడిస్తూ అంది అపూర్వ.

"నమస్తే" నవ్వుతూ చేతులెత్తి ఆశీర్వదిస్తూ అన్నాడు ప్రభాకర్రావ్.

"అమ్మా అపూర్వా... ప్రభాకర్రావుగారు కిరణ్ అండ్ కిరణ్ ఇండస్ట్రీస్ ఛెయిర్‌పర్సన్. అండ్ హి ఈజ్ మిస్టర్ రవి కిరణ్... ఎ వెరీగుడ్ జెంటిల్మాన్ అండ్ ఎం.డి. ఆఫ్ ది ఎంటర్‌ప్రైజ్. ప్రభాకర్రావుగారి అబ్బాయి" రవికిరణ్ణి ఉద్దేశిస్తూ అన్నాడు మాధవరావు.

రవికిరణ్ రెండు చేతులూ జోడించి "నమస్తే" అన్నాడు అపూర్వతో.

అపూర్వ ప్రతి నమస్కారం చేసింది.

'అపూర్వ అందం ముచ్చట గొలిపే విధంగా ఉంది' మనసులో అనుకున్నాడు రవికిరణ్. రవికిరణ్ ముఖంలోని ప్రశాంతత గమనించాక అతనేదో ఇండస్ట్రీకి ఎం.డి.లా అనిపించలేదామెకి. ఏదో ప్రశాంతమైన అడవిలో ఓ ఆశ్రమాన్ని నడిపే వ్యక్తిలా ధీరగంభీరంగా అగుపించాడామెకి. సరిగ్గా ఆ క్షణంలోనే స్థిరమైన అపూర్వ హృదయస్పందన వేగం పెరిగింది.

అపూర్వ తదేకంగా అలా రవికిరణ్ణి రెప్ప లార్పకుండా చూస్తూ ఉండగా రవికిరణ్ తత్తరపడి తల నేలకి వాల్చాడు.

ఈ దృశ్యాన్ని గమనించిన అపూర్వ తల్లి జానకి లోపల్లోపల నవ్వుకుంది. ఆమె ఉద్దేశం వేరేవిధంగా ఉంది. అవును... సరిగ్గా ఆమె కోరుకున్నది కూడా ఇదే! రవికిరణ్ణి చూసిన మొదటిక్షణంలోనే తమ ముద్దుల కూతురు అపూర్వకు రవికిరణ్ తగిన జోడీగా ఆమె భావించింది. భర్త మాధవరావుతో ఆరోజే మాట్లాడి ఎలాగైనా సంబంధం ఖాయం చేసుకోవాలని భావించిందామె.

"మీరు పదండన్నయ్యగారూ" జానకి.

"కమ్ కిరణ్" ప్రభాకర్రావ్.

"వాళ్ళిద్దర్నీ అలా ఒంటరిగా ఫ్రీగా మాట్లాడుకోనివ్వండి అన్నయ్యగారూ... ఇద్దరూ యువతరానికి చెందినవాళ్ళు. మన తరం వేరు కదా! అబ్బాయి ఫ్యాక్టరీ అజమాయిషీ చూస్తున్నాడు. మా అపూర్వ కూడా బిజినెస్ గురించి చదువుకుంది. రేపొద్దున అపూర్వ తన ఇండస్ట్రీని రన్ చెయ్యాలంటే అనుభవజ్ఞుల సలహాలు అవసరం కదా!" అలా సుదీర్ఘమైన డైలాగ్ జానకి చెప్పేసరికి ప్రభాకర్రావు అవునంటూ తలూపాడు.

కానీ తన మనసులో ఏదో మూల చిన్న సంశయం కలక్కపోలేదతనికి. జానకి లాజిక్‌కి బిత్తరపోయినట్టయింది ప్రభాకరరా



వుకి, ఈ సీనేంటో మాధవరావుకి ఓ పట్టాన అర్థంకాలేదు. 'ఆడవారి మాటలకు అర్థాలే వేరులే' పాట గుర్తొచ్చింది మాధవ రావుకు.

"కిరణ్... అపూర్వా... మీరిద్దరూ మాట్లా డుకుంటూ ఉండండి. కిరణ్! ఐ విల్ జాయిన్ యు లేటర్" చెప్పి మాధవరావు దంపతులను అనుసరించాడు ప్రభాకర రావు.

అపూర్వ, కిరణ్‌లు ఎదురెదురుగా ఉన్నారు.

తన తల్లి చేసిన పనికి మనసులోనే థాంక్స్ చెప్పుకుంది అపూర్వ. అపూర్వతో మాట్లాడ్డానికి కొన్ని సెకన్లు తటపటాయిం చాడు రవికిరణ్. ఒకసారి రవికిరణ్ణి, తర్వాత చుట్టూ ఉన్న వాళ్ళని, మళ్ళీ తల వంచి నేలని ఇలా మార్చిమార్చి చూడసా గింది అపూర్వ. ఆమె గుండెపొరల్లో అల జడి, ఓ తీయని ప్రకంపన, ఏమిటిది?

"సార్! కూల్‌డ్రింక్ తీసుకుంటారా!"

వారిద్దరి మధ్యనున్న నిశ్శబ్దాన్ని భగ్నంచె య్యడానికా అన్నట్టు అడిగాడు డిఫరెంట్ సాఫ్ట్ డ్రింక్ గ్లాసుల్ని ట్రేనిండా అమర్చుకొచ్చినతను.

"తీసుకోండి" తనో గ్లాసు తీసుకుంటూ అపూర్వతో అన్నాడు రవికిరణ్.

"థాంక్స్" చెప్పిందామె.

"నోనో... థాంక్స్ నేనే చెప్పాలి"

"ఎందుకు? "

"చెప్తాను. ముందు మీరు కూర్చోండి" తను కూర్చుంటూ అన్నాడు రవికిరణ్.

కుర్చీలో రిలాక్సయిందామె.

"ఎందుకంటే..." రవికిరణ్ చెప్పబోతుం డగా, అసిస్టెంట్ మేనేజర్ పార్థసారథొచ్చి

"మేడం... సారీ ఫర్ ద డిస్టర్బెన్స్. డాడీ మిమ్మల్ని కలవమన్నారు కదా" అన్నాడు.

"థాంక్స్ పార్థసారథిగారూ... నేను డాడీని కలిశాను. ప్లీజ్" అంది.

"ఓ... సారీ మేడమ్" నొచ్చుకుంటూ వెళ్ళి పోబోతూ మళ్ళీ

"మేడమ్ మీకు ఇంకా ఏమైనా కావాలా? అయామ్ ఎట్ యువర్ సర్వీస్" విన యంగా అన్నాడతను.

"థాంక్స్ వన్సెగెయిన్ పార్థసారథి గారూ... దయచేసి మీరు"

"అలాగే అలాగే" వెళ్ళిపోతూ అన్నాడ తను నవ్వుకుంటూ.

"సారీ రవికిరణ్‌గారూ" నొచ్చుకుంటూ అందామె.

"ఇట్స్ ఓకే" డ్రింక్ సిప్ చేస్తూ అన్నాడు.

తనూ మెల్లగా సిప్ చెయ్యసాగిందామె.

"మీరేదో చెప్తుండగా" గుర్తుచేసింది అపూర్వ.

లైట్స్ వెదజల్లే కాంతులకి అపూర్వ ధరిం చిన డైమండ్ నెక్లెస్ వింతవింత రంగుల్ని సంతరించుకుంటూ మిరుమిట్లు గొలపసా గింది. ఆ ఫంక్షన్‌కొచ్చిన చాలామంది ఆహూతులు వీరిద్దర్నీ గమనించసాగారు.

అపూర్వ దగ్గరి బంధువు ఒకామె అపూర్వ దగ్గరికొచ్చి ఆమె చెవిలో ఏదోచెప్పే సరికి 'ఛీ పో' అంటూ సిగ్గుతో కసురుకుంది అపూర్వ.

నవ్వుకుంటూ వెళ్ళిపోయిందామె.

"ఓ అదా..." అంటూ రవికిరణ్ చెప్పడా నికి ఉద్యుక్తుడవుతుండగా

"వావ్ వాట సర్‌ప్రయిజ్... మిస్టర్ రవి కిరణ్. ఫైనల్లీ ఐ ట్రేస్డ్ యు" రూపాదేవి గట్టిగా అనేసరికి అపూర్వ కనుబొమలు చిట్లించి రూపాదేవివైపు అసహాయంగా చూసింది.

"అపూర్వా... జెస్ట్ ఎ మినిట్" అంటూ లేచి రూపాదేవితో కలసి మాట్లాడుతూ కొంత దూరం నడచివెళ్ళాడు రవికిరణ్.

"సో... వాటెబౌట్ సుమతి? " అడిగింది రూపాదేవి.

"నాట్ టు వర్రీ... షి ఈజె వెరీనైస్ గర్ల్... చాలా మంచి అమ్మాయి. కష్టపడి పన్జేస్తోంది. ఆమె సిన్సియారిటీ నాకు




నచ్చింది"అన్నాడు రవికిరణ్.

"థాంక్స్ రవికిరణ్... సుమతికి ఓ దారి చూపించి ఆమెకు లైఫిచ్చారు" మెచ్చుకుంటూ అంది.

"ఇట్స్ ఓకే. మిమ్మల్ని ఈ ఫంక్షన్లో చూసి ఆశ్చర్యపోయాను సుమా" అన్నాడు.

"వై? అపూర్వ ఇండస్ట్రీస్ యజమాని మాధవరావుగారి వైఫ్ జానకి నాకు చాలా క్లోజ్. ఫంక్షన్ తాలూకు ఇన్విటేషన్ కార్డు ఇవ్వడమే కాక ఫంక్షన్‌కు తప్పక రావాలంటూ కనీసం అరడజను సార్లయినా ఫోన్ చేశారామె" చెప్పింది.

"నన్నెవరు ఆహ్వానించారో అడగండి? " రవికిరణ్ అడిగాడు నవ్వుతూ.

"గుడ్ జోక్... మీరందరూ పారిశ్రామికవేత్తలు... ఒకే సంఘానికి చెందిన వాళ్ళు" నవ్వుతూ అందామె.

"బతికించారు. ఇంకా నయం, కేపిటలిస్టులనలేదు. సంతోషం" అన్నాడు నవ్వుతూ.

"టూమచ్" బిగ్గరగా నవ్వుతూ అందామె.

రవికిరణ్ రూపాదేవిలిద్దరూ నవ్వుతూ తుళ్లుతూ మాట్లాడుకుంటున్న దృశ్యాన్ని దూరంనుంచి గమనించసాగింది అపూర్వ. తను తాగుతున్న డ్రింక్ వెగటుగా అనిపించి పారబోసిందామె. అసహనంగా ఉందామెకు. అప్పటిదాకా తన అధీనంలో ఉన్న తన వస్తువునెవరో సడెన్‌గా వచ్చి లాక్కుపోయినట్టు విలవిల్లాడింది అపూర్వ మనసు. రవికిరణ్ తనెదుట కూర్చున్నంతసేపు తీయగా ఉన్న డ్రింక్ అతను వెళ్ళగానే చేదుగా ఎందుకనిపించింది? తామిద్దరి పరిచయమై గంట కూడా కాలేదు ఏమిటిది? ఈ అటాచ్‌మెంట్ ఏమిటి?

తను చదువుకున్న రోజుల్లో తన చుట్టూ ఎంతో అందమైన అబ్బాయిలు తిరిగేవాళ్ళు కానీ అప్పుడెప్పుడూ కలగని ఫీలింగ్, ఏదో వింతయిన మత్తు కలిగించే మధురమైన ఫీలింగ్ తనకు రవికిరణ్ణి చూడగానే ఎందుకు కలిగింది? రవికిరణ్ కూడా తన లాగే ఫీలవుతున్నాడా? ఏమో! ఏమిటిది? అపూర్వ మనసు పరుగిడసాగింది.

"అన్నట్టు చెప్పడం మరచిపోయాను. ఇందాక నా ఎదుట కూర్చునుంది ఎవరనుకున్నారు? " అడిగాడు రవికిరణ్.

"ప్చ్..." తెలీదంటూ పెదవి విరిచింది రూపాదేవి.

"ఆమే అపూర్వ... మాధవరావుగారి ఓన్లీ డాటర్" చెప్పాడు.

"రియల్లీ? జానకి కూతుర్రా. అయితే ఇప్పుడే అపూర్వతో మాట్లాడతాను. మీరున్నారుకదా" అంది.

"ఓకే పదండి" ఇద్దరూ కలిసి అపూర్వ దగ్గరకెళ్తుండగా, రూపాదేవి వద్ద కెవరో వచ్చి

"జానకమ్మగారు పిలుస్తున్నారు" అన్నారు.

"సారీ మిస్టర్ రవికిరణ్, మిమ్మల్ని మళ్ళీ కలుస్తాను" వెళ్ళబోతూ అంది రూపాదేవి.

"ఓకే. ఏకంగా డిన్నర్ తీసుకునేప్పుడు కలుద్దాం" అన్నాడు.

మెల్లగా వచ్చి అపూర్వ ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుంటూ, "సారీ అపూర్వగారూ! మీకు కంపెనీ ఇవ్వలేకపోయాను" నొచ్చుకుంటూ అన్నాడు.

రవికిరణ్ రావడంతో మళ్ళీ వసంతం తిరిగొచ్చినట్టయిందామెకి. మళ్ళీ వాతావరణం ఆహ్లాదంగా అనిపించసాగింది అపూర్వకు. ఆమె ముఖం తేజోవంతమైంది.

"ఫర్వాలేదు" అంటూ "ఎవరావిడా? " అడిగింది అపూర్వ.

"ఆవిడ తెలీదా? సిటీలో చాలా ఫేమస్ పర్సనాలిటీ. రూపాదేవిగారని స్త్రీ స్వేచ్ఛ కోసం పోరాడుతున్నారు"

"అలాగా..." అంది. కాసేపు ఇద్దరిమధ్యా మళ్ళీ మౌనం.

"ఐ థింక్ మీరు ధరించింది డైమండ్ నెక్లెసనుకుంటా" ఏదో ఒకటి మాట్లాడాలి కదా అని అడిగాడు రవికిరణ్.

"అవును... బావుందా?" నెక్లెసునోసారి చేత్తో తడుముకుంటూ నవ్వుతూ అడిగింది అపూర్వ.

"మీ నవ్వంత సూపర్‌గా లేదు మీ నెక్లెస్" అన్నాడు కాజువల్‌గా.

రవికిరణ్ తన నవ్వునలా పొగడ్డంతో తెల్లగా ఉన్న అపూర్వ బుగ్గలు ఎరుపెక్కాయి. సిగ్గుపడుతూ అపూర్వ చూసిన చూపుకి, తన కుర్చీలో ఇబ్బందిగా కదిలాడు రవికిరణ్.

"మీరు ఏ కాలేజిలో చదువుకున్నారు?" అడిగాడు.

చెప్పిందామె.

"మీరు ఎం.బి.ఎ. చదివారుకదా. మీ లైఫ్ ఏంబిషనేమిటి? ఇండస్ట్రీని రన్ చెయ్యడమా లేక? ..." అడిగాడు

రవికిరణ్ కళ్ళల్లోకి అలాగే తదేకంగా ఆరాధనపూర్వకంగా చూడసాగిందామె. అపూర్వకు రవికిరణ్ అడిగే విషయాలేవీ వినబడ్డంలేదు. అలాగే ఆ డిసెంబర్ చలి రాత్రిలో తామిద్దరూ ఒకర్నొకరు చూసుకుంటూ గడిపెయ్యాలని కోరికగా ఉందామెకు.

"హలో మేడమ్" చిటికేస్తూ అడిగాడు.

"అ...హ...అ..." బిత్తరపోతూ ఇహంలోకొచ్చింది అపూర్వ.

"నేనడిగింది మీకర్థమైందా?" అడిగాడు.

"అయింది" చెప్పింది.

"నేనేమడిగాను?" అడిగాడు.

"నా నవ్వు బాగుందని అన్నారుగా" అంది.

"అయితే మీరు పడిపోయారు" నవ్వుతూ అన్నాడు.

'అవును. పడిపోయాను రవికిరణ్! నీ మాయలో పడిపోయాను. నీ ప్రేమలో పడిపోయాను. నీ చూపుల వలలో చిక్కుకుపోయాను. ప్లీజ్... నన్ను ప్రేమతో ఒకసారి 'అపూర్వా' అని పిలవరూ' ఇలా రవికిరణ్తో ఎన్నో మాట్లాడాలని, ఏదేదో చెప్పెయ్యాలని ఉంది అపూర్వకు.

"నా ఉద్దేశం మీరు అయోమయంలో పడిపోయారు. మీరు ఏదో ఆలోచనలో పడ్డారు. దేని గురించో లోపల్లోపల ఫీలవుతున్నట్లు మిమ్మల్ని చూస్తుంటే నాకనిపిస్తోంది" అన్నాడు రవికిరణ్ మందహాసం చేస్తూ. ఇంతలో,

"మేడమ్ సారీ ఫర్ ద ఇన్‌కన్వీనియెన్స్. మీకు ఫోన్" కార్డ్‌లెస్ అందిస్తూ అన్నాడు పార్థసారథి.

"పార్థసారథిగారూ, మీరు మీ లిమిట్స్ క్రాస్ చేస్తున్నారు. నాకెంతో ముఖ్యమైన వ్యక్తితో మాట్లాడుతున్నానని చెప్పండి. మీరు మళ్ళీ కనపడితే నేనొప్పుకోను" కోప్పడింది. అపూర్వ మరుసెకన్లో పార్థసారథి కనబడితే ఒట్టు. ఫోన్తోసహా మాయమయిపోయాడతను.

"నాకెంతో ముఖ్యమైన వ్యక్తి" అపూర్వ తన గురించి అన్న ఆ మాటలోని స్పార్క్ గమనించి ఇబ్బంది ఫీలయ్యాడు రవికిరణ్.

★ ★ ★

"అడగటం మరిచాను. అన్నట్టు నీ జర్మనీ ప్రోగ్రామెప్పుడు?" కూతురు కిరణ్మయి అందించిన టీ కప్పు నందుకుంటూ రవికిరణ్‌ని అడిగాడు ప్రభాకర్‌రావు.

"ఈ నెల థర్డ్ వీక్‌లో వెళ్ళాలనుకుంటున్నాను డాడీ. డేట్ ఇంకా కన్‌ఫర్మ్ చేసుకోలేదు" తనూ ఓ కప్పునందుకుంటూ అన్నాడు రవికిరణ్.

"మరి సెమినార్ గురించి ఫైల్ ప్రిపేర్ చేసుకున్నావా?" తండ్రి అడిగాడు.

"ఎస్ డాడీ, ఆ పనిమీదే ఉన్నాను. దానికితోడు కొన్ని ఎసైన్‌మెంట్స్ కూడా ప్రిపేర్ చేస్కోవాలి" చెప్పాడు రవికిరణ్.

"గోహెడ్. ఏ విషయం గురించైనా డౌటొస్తే నన్నడుగు. ఓ.కే." అన్నాడు ప్రభాకరరావు.

"ష్యూర్ డాడ్..."

"మళ్ళీ మొదలైందా మీ బిజినెస్ గొడవ.

 

అసలు మిమ్మల్ని అనాలండి. నిన్న సాయంత్రం నేను మీకేం చెప్పాను? " అప్పుడే వచ్చిన దమయంతి భర్తని కసురు కుంటూ అడిగింది.

"దేని గురించి? " టీ కప్పు ట్రేలో పెడుతూ భార్యతో అన్నాడు ప్రభాకర్రావ్.

"అడిగారూ... నేను ముందే అనుకు న్నాను ఇలా అడుగుతారని" అంది.

"గంటక్రిందట చెప్పిన విషయమే గుర్తుం డదు నాకు. నిన్న సాయంత్రం చెప్పిన విష యమంటే ఇరవైనాలుగ్గంటలైంది ఇప్పటికి. ఎలా గుర్తుంటుంది చెప్పు? " ప్రశ్నించాడు.

"చాలు. ఆపండిక! ఇటువంటి విష యాల్ని కూడా మీరు వేళాకోళంగా తీసిప డేస్తే ఎలా? " కోపంగా అంది దమయంతి.

"ఏమైంది మమ్మీ? దేని గురించి ఈ కన్ ఫ్యూజన్? డాడీ మరచిపోయానంటు న్నారు. పోనీ నువ్వయినా చెప్పొచ్చుకదా" రవికిరణ్ తల్లినడిగాడు.

"అదేరా... నీ గురించి. స్పందనతో నీ పెళ్లి విషయం" దమయంతి మాటలు కంప్లీట్ కాక మునుపే.

"ఓ అదా... అదేమంత ముఖ్యమైన విష యమని? నేను ఇంకేదో సీరియస్ మేటరను కుని హడలిపోయాను. బతికించావు పో" రిలాక్సవుతూ అన్నాడు రవికిరణ్.

"ఓరే ఫూల్... నీకు నీ పెళ్లి విషయం సీరియస్ మేటర్ కాదా? పెళ్లంటే ఏంటి? మనిషి జీవితంలో అతిముఖ్యమైన ఘట్టం. అటువంటి విషయాన్ని తేలిక చేసి మాట్లా డుతున్నావా? ఇలా అయితే ఈ విష యంలో నీకు నేనెలాంటి సాయం చేయ లేను" హెల్ప్‌లెస్‌గా ఫీలింగిస్తూ చెప్పింది కిరణ్మయి.

చెల్లెలు కిరణ్మయి మాటలకు చప్పట్లు చరిచారు తండ్రీకొడుకులు.

"అలా పెట్టమ్మా గడ్డి వీడికి. అప్పుడైనా వస్తుంది బుద్ధి. చూశావురా వెధవా? కనీసం నీ చెల్లెలికున్నపాటి జ్ఞానం కూడా లేదు నీకు" దమయంతి రవికిరణ్ణి కసిరింది.

"మమ్మీ... జ్ఞానమంటే గుర్తొచ్చింది. డాడీ వినండి... ప్రస్తుతం నా పెళ్లికంటే ముందు మన కిరణ్మయికి పెళ్లిచేస్తే బాగుం టుందని నా ఉద్దేశం. ఎందుకంటే జీవి తంలో పెళ్లియొక్క ప్రాముఖ్యత, నాకంటే దానికే ఎక్కువగా తెలిసినట్టు దాని మాట ల్నిబట్టి నాకర్థమవుతూ ఉంది అన్నాడు రవికిరణ్

"య్యూ..." రెండు చేతుల్తో కొట్టడానిక న్నట్టు రవికిరణ్ మీదికి రాబోయిన కిరణ్మ యిని తప్పించుకున్నాడు రవికిరణ్.

"చూడమ్మా" ఏడ్చినంత పన్జేసింది కిర ణ్మయి.

అది చూసి హాయిగా నవ్వుకున్నాడు కిరణ్.

దమయింతి, ప్రభాకర్రావులు మందహా సంచేశారు. కానీ ఆ సంతోషం ఎక్కువసేపు నిలవలేదు. ఆ ప్రశాంతత నిజంగా తుపాను ముందు నెలకొన్న మౌనంలాం టిదే.

"మమ్మీడాడీ... స్పందనతో పెళ్లి ప్రస్తా వన వచ్చింది కాబట్టి నేను ఒక విషయం మీకు చెప్పాలనుకుంటున్నాను"

రవికిరణ్ ముఖాన్ని చూస్తే, అది నవ్వు లాటగా చెబుతున్న విషయంగా దమ యంతి, ప్రభాకర్రావులకు అనిపించలేదు. కొడుకు చెప్పబోతున్న విషయాన్ని జాగ్ర త్తగా ఆలకించసాగారు. తన అన్నయ్య అలా సడెన్‌గా ఏదో ముఖ్యమైన విషయం డిక్లేర్ చెయ్యబోయే సంగతి ఊహించలేదు కిరణ్మయి. అందుకే ఆమె రవికిరణ్ చెప్పబోయే విషయాన్ని ఆస క్తిగా ఆలకించసాగింది.

"తటపటాయించక నీ మనసులో ఉన్న విషయం చెప్పెయ్యి. ఏ నిర్ణయమైనా పెళ్లి కిముందు తీసుకుంటేనే ఇరువురికీ క్షేమ కరం" అన్నాడు ప్రభాకరరావు. అవునంటూ దమయంతి తలూపింది.



"అదీ... అది..." గొణిగాడు రవికిరణ్.

"అదీలేదు, ఇదీలేదు. నీ మనసులో ఉన్న విషయం చెప్పేయ్. మేం నీ తల్లిదండ్రులం. నీ మనసులో ఉన్న విషయాన్ని మాకు కాకపోతే ఇంకెవరికి చెబుతావ్?" అన్నారిద్దరూ.

"మరేంలేదు. స్పందనతో పెళ్లి నాకిష్టం లేదు" ఒకేఒక మాటని బాంబులా పేల్చాడు రవికిరణ్. ఆశ్చర్యపోయారిద్దరూ. కిరణ్మయికి విషయం అర్థంకాలేదు.

కొన్ని క్షణాల నిశ్శబ్దం తర్వాత...

"ఎందుకిష్టంలేదు? ఇంతకుముందు మీరిద్దరిమధ్యా ఏదైనా పరిచయం ఉందా?" ప్రభాకర్రావడిగాడు.

"పోనీ ఆ అమ్మాయి తరఫున ఏమైనా సమస్యుందా?" దమయంతి అంది. ఇద్దరికీ జవాబు చెప్పక మౌనంగా ఉండిపోయాడు రవికిరణ్. హుక్కా పీలుస్తూ భార్య ముఖాన్ని, కొడుకు రవికిరణ్ ముఖాన్ని మార్చి మార్చి చూడసాగాడు ప్రభాకర్రావ్. 'ఏమై ఉంటుంది?' అతని బుర్రని ఇదే ప్రశ్న తొలుస్తూ ఉంది.

'ఏదో తప్పక ఉంటుంది' దయమంతి తన మనసులో అనుకుంది.

"స్పందనకు సహనం తక్కువ. దీనికంటే ఎక్కువ ఆమె గురించి నాకు తెలీదు" ముక్తసరిగా అన్నాడు రవికిరణ్.

"ఓస్ అంతేనా! వయసులో ఉన్న అమ్మాయికి ఆమాత్రం 'విసురు' సహజంరా నాన్నా... పెళ్లయితే అంతా సర్దుకుంటుంది" నవ్వుతూ అంది దమయంతి.

"ఎస్.ఎస్." అన్నాడు ప్రభాకర్రావ్.

"ప్లీజ్ మమ్మీ. ఈ విషయం ఇంతటితో ఆపేస్తేనే మంచిది. అసలే బిజినెస్ టెన్షన్స్‌తో ఇంటికొచ్చిన నాకు రిలీఫ్ ఎంతో అవసరం. ఇంకా అదనపు టెన్షన్లు నాకొద్దు"

రవికిరణ్ మాటలకు అడ్డు తగులుతూ "కానీ..." అంటూ దమయంతి ఏదో చెప్పబోగా.

"నో మమ్మీ! పెళ్లి చేస్కోవాలనే ఉద్దేశం ఉండాలేకానీ అమ్మాయిలకూ, అబ్బాయిలకూ కొదవేముంది" అన్నాడు కిరణ్.

"ఆ విషయం మాకూ తెలుసులేవోయ్. కానీ స్పందన స్వయానా నా క్లాస్‌మేట్ అండ్ మై క్లోజ్‌ఫ్రెండ్ ప్రసాదరావు కూతురు. ప్రసాదరావు గురించి నీకు సరిగ్గా తెలీదు కిరణ్" అన్నాడు ప్రభాకర్‌రావు.

"ప్రసాదరావంకుల్ మంచి వ్యక్తి కాదని ఎవరన్నారు?" అడిగాడు.

"మరి..." అంది తల్లి.

"చూడబ్బాయ్. అనుభవంతో చెప్తున్నాను. పెళ్ళంటే ఒక కమిట్‌మెంట్. పెళ్ళి కాకమునుపు ఇండివిడ్యువల్‌గా కొన్ని అభిప్రాయాలున్నా పెళ్ళి అనే బంధం ఏర్పడ్డాక భార్యాభర్తలిద్దర్నీ ఆ కమిట్‌మెంట్ కలిపి ఉంచుతుంది. నువ్వు వయసులో చిన్నవాడివి. నీకు తెలీదు. నా మాట విను కిరణ్. నువ్వు ఊం అన్నావంటే, నీ జర్మనీ ప్రోగ్రాం కంటే ముందు ప్రసాదరావింటికి వెళ్లి మనం వివాహం నిశ్చయం చేసుకుని వద్దాం" ప్రభాకర్రావన్నాడు.

"అవున్రా నాన్నా... మీ నాన్నగారు చెప్పిందే రైటు" అంది దమయంతి.

"ఏంటి రైటు? ఆ అమ్మాయితో పెళ్ళి వద్దు మొర్రో అని ఒకవైపు అన్నయ్య చెప్తుంటే, పెళ్ళిచూపులు, నిశ్చయతాంబూలాలు అంటారేమిటి?" కోప్పడింది కిరణ్మయి.

"నువ్వు ఊర్కోవే. చిన్నపిల్లవి. నీకెందుకు పెద్ద విషయాలు? నువ్వు అవతలికిపో" కిరణ్మయిని కసురుకుంది దమయంతి.

"కిరణ్మయి చెప్పిందే కరెక్టమ్మా" అన్నాడు రవికిరణ్.

"ఒక విషయం నాకు ఆశ్చర్యాన్ని కల్గిస్తోంది. అదేంటంటే రవికిరణ్ వివాహం గురించి. నా స్నేహితుడు ప్రసాదరావు వాళ్ళ అమ్మాయి స్పందన ప్రసక్తి తీసుకురా




నంతవరకు నేను ఆలోచించనేలేదు. తీరా మొదటిసారి వచ్చిన ప్రపోజలే ఈ విధంగా కాంట్రవర్సీకి గురవుతుందని నేనూహించ లేదు. రియల్లీ వెరీబ్యాడ్" అన్నాడు ప్రభాక రరావు దీర్ఘంగా నిట్టూర్చుతూ.

"ఒక ఐడియా..." కళ్లు పెద్దవి చేస్తూ చెప్పింది కిరణ్మయి.

ఏమిటన్నట్టు ముగ్గురూ కిరణ్మయివైపు చూశారు.

"మనం ప్రసాదరావంకుల్ వాళ్లింటికి ఒక మెసేజ్ పంపిద్దాం. అదేంటంటే పెళ్లి చూపులు, అవన్నీ తర్వాత నిర్ణయించుకో వచ్చు ముందు మనందరం ఫ్రెండ్లీగా వాళ్ళింటికి వస్తున్నట్లు చెబుదాం. లేకపోతే వారంతా కలిసి మనింటికొచ్చినా సరే! జస్ట్ గెట్ టుగెదర్ లాంటిదన్నమాట" చెప్పింది కిరణ్మయి.

"ఐడియా బాగానే ఉందికానీ, వెళ్ళడానికి ఓ అకేషనుండాలికదా" చెప్పింది దమ యంతి.

"అకేషనంటే?"

"ఓ సందర్భం"

"ఫ్రెండింటికి వెళ్ళడానికి కారణాలేముం టాయి. మీ పిచ్చిగాని... సడెన్‌గా అలా వెళ్ళి ఓ సర్‌ప్రయిజివ్వాలి" ప్రభాకరరావ న్నాడు.

"అలాగే మీరంతా వెళ్ళండి. నాకు వేరే బోలెడు పనులున్నాయి" అని చెప్పి లేచివె ళ్ళిపోతున్న రవికిరణ్ వంక దిగ్భ్రాంతిగా చూస్తుండిపోయారు అందరూ.

"అబ్బాయి ప్రవర్తన చూస్తుంటే, అతడికి స్పందనంటే బొత్తిగా ఇష్టం లేనట్టు నాకని పిస్తోంది. మనకేం తక్కువని? మనకున్నది ఒక్కడే కొడుకు. అతనికిష్టంలేని పని ఎందుకు చెయ్యాలి మనం?" భర్తతో చెప్పింది దమయంతి.

"నువ్వు చెప్పేది నిజమే దమయంతీ. ఈ విషయాన్ని ఇలా వదిలేద్దాం. మన రవికి రణే ఎవరయినా అమ్మాయిని ఇష్టపడతా డేమో చూద్దాం" అన్నాడు.

"అంటే మీ ఉద్దేశం?"

"అదే ఎవరైనా అమ్మాయిని ప్రేమించి..."

"వీడికంత తీరిక్కూడానా? ఎప్పుడు చూసినా ఫోన్లు, ఫైళ్లు, ఆ కంప్యూటర్లు. ఇదేగా వాడి జీవితం"

"పోనీ ఎవరైనా అమ్మాయి వీణ్ణి ప్రేమి స్తుందేమో చూద్దాం. అరె... అవును. అమ్మాయంటే గుర్తొచ్చింది. మొన్న మన మాధవ్‌గాడింట్లో ఫంక్షన్‌కెళ్ళినప్పుడు వాడి కూతురు. ఏం పేరు... అది. ఆc అపూర్వ. ఎస్. అపూర్వ. చాలా బాగుందా అమ్మాయి. సూపర్‌గావుంది. మన రవికిర ణ్‌కైతే భలేజోడీ"

"ఎవరు? జానకి కూతురి గురించా మీరు చెబుతోంది?"

"అవును"



"ఏంటి, అమ్మాయిగారు బ్యాంకాఫీసర య్యాక మమ్మల్ని బొత్తిగా మరచిపోయి నట్టు కనబడుతోంది" సోఫాలో కూర్చుంటూ స్పందనతో అంది సుమతి.

"నీవనుకుంటున్నంత సీన్లేదుగానీ, నీ సంగతి చెప్పు ఎలా ఉంది నీ కొత్త

ఉద్యోగం? " సుమతి ఎదురుగా కుర్చీలో కూర్చుంటూ అడిగింది స్పందన.

"అయామ్ వెరీఫైన్ స్పందనా... ఈ విషయంలో" నీకూ, రూపాదేవిగారికి నేనెంతో రుణపడి ఉన్నాను" అంది సుమతి.

"రియల్లీ... అంత బాగుందా నీ జాబ్"

"నిజం స్పందనా... రవికిరణ్‌గారు చాలా గ్రేట్. ఆయన గురించి ఎంత ఎక్కువగా చెప్పినా తక్కువే అవుతుంది. డబ్బు, హోదా ఉన్న వ్యక్తుల్లో కూడా మంచివాళ్ళు ఉంటారని నిజంగా రవికిరణ్‌గారిని చూశాకే నాకు తెలిసింది"

"మెరిసేదంతా బంగారం కాదు అనే సామెత విన్నావో లేదోకానీ నీవు జాయినయి కొద్దినెలలే కదా అయింది. అప్పుడే నీ యజమాని గురించి, అతని అర్హత గురించి మెరిట్ సర్టిఫికెట్ ఇవ్వాల్సిన అవసరం లేదనుకుంటా సుమతీ! నువ్వు చాలా తొందరపడుతున్నావు. వసంతకాలం వచ్చాకేకదా కోయిలకూ కాకికీ మధ్య తేడా తెలిసేది? "

"నో స్పందనా... నెవర్. నీ అభిప్రాయాన్ని నేను ఖండిస్తున్నాను. అతను చాలా మంచివాడు"

"నీవన్నట్టు అతను నిజంగా మంచివ్యక్తే అయితే అంతకన్నా కావలసినదేముంటుంది సుమతీ? "

"రవికిరణ్‌గారు నీకు తెలుసా? "

"తెలీదు"

"మరి నీకు తెలియని వ్యక్తిపై నిందారోపణ చెయ్యడం తప్పుకదా"

"తొందర్పడి మగవాళ్లని నమ్మకూడదు సుమతీ..."

"ఆడవాళ్లని నమ్మొచ్చా? "

"అమ్మాయ్ సుమతీ! నువ్వెప్పుడొచ్చావ్? సుమతి వచ్చిందని నీవైనా చెప్పలేదే స్పందనా? అమ్మా నాన్నా బావున్నారా? "

అప్పుడే వచ్చిన స్పందన తల్లి అన్నపూర్ణ సుమతి నడిగింది.

అన్నపూర్ణని చూడగానే సుమతి లేచి నిలబడి నవ్వుతూ మాట్లాడింది.

"సుమతి ఉద్యోగంలో జాయినైంది మమ్మీ"

"నిజమా సుమతీ! చాలా సంతోషం. మంచి వార్త చెప్పావు. మీరిద్దరూ మాట్లాడుకుంటూ ఉండండి. ఇంతలో నేను కాఫీ కలుపుకుని తెస్తాను"

"కాఫీ ఒక్కటే సరిపోదాంటీ. స్వీట్ కూడా కావాలి. స్పందనకు జాబ్ వచ్చాక మీరు నాకు స్వీట్ పెట్టలేదు"

"తప్పకుండా. అందుకే సుమతీ. మా అమ్మాయికున్న ఫ్రెండ్సందరిలోనూ నువ్వంటేనే నాకిష్టం. ఎంత మర్యాద? ఎంత కలివిడితనం? " వంటగదిలోకెళ్తూ చెప్పింది అన్నపూర్ణ.

"అంకుల్ లేరా స్పందనా? "

"లేరు. ఏదో పనుందంటూ పొద్దున్నే వెళ్ళిపోయారు"

"పోస్టింగ్ ఎక్కడిచ్చారు నీకు? "

"ఇక్కడే"

"వెరీగుడ్"

"సుమతీ.. మీ బావగారూ... అక్కయ్యా బావున్నారా? "

"బావున్నారు స్పందనా. అన్నట్టు స్పందనా. నీవు జాబ్‌లో సెటిలై నీకాళ్లపై నువ్వు నిలబడ్డావుకదా! ఇక పెళ్లిచేసుకో"

"పెళ్ళి చేసుకోవడం అంత అవసరమంటావా సుమతీ"

"ఇది మరీ బావుంది. భోంచెయ్యడం, స్నానం చెయ్యడం, నిద్రపోవడం, ఆలోచించడం అవసరం అనుకుంటే ఇదీ అవసరమే. ఈ సుదీర్ఘ జీవితపయనంలో మనకంటూ ఓ తోడూ నీడా ఉండటం చాలా అవసరం స్పందనా. శారీరకంగానే కాదు మానసికంగా కూడా మనిషికి తృప్తి అవసరం కదా"

"బాగా చెప్పావమ్మాయ్. మేం ఎవరు

చెప్పినా దీని తలకెక్కడం లేదు. ఈ మైసూర్‌పాక్ నా చేత్తో నీకు తినిపిస్తా. ఇదిగో" అంటూ సుమతి నోట్లో స్వీట్ కుక్కింది అన్నపూర్ణ నవ్వుతూ.

స్వీట్ తిన్నాక, "అయ్యో ఆంటీ... మీరు నిజంగా స్వీట్ తినిపించారే" అంటూ మొహమాటపడింది సుమతి. నవ్వింది స్పందన.

"ఇంతకీ నువ్వు చేసే ఉద్యోగమేంటో ఎక్కడో చెప్పలేదేం?" అన్నపూర్ణ అడిగింది.

"కిరణ్ అండ్ కిరణ్ ఇండస్ట్రీసని సిటీలోనే ఆంటీ"

"కిరణ్ ఇండస్ట్రీస్ అంటే... రవికిరణ్"

"అవును. ఎం.డి. ఆయనే. రవికిరణ్ గారు మీకు తెలుసా ఆంటీ?"

"తెలియకపోవడమేంటి? రవికిరణ్ నాన్నగారైన ప్రభాకరరావుగారు స్పందన డాడీ క్లాస్‌మేట్స్‌కదా. అదీకాక" అన్నపూర్ణ ఇంకా ఏదో చెప్పబోయేంతలో,

"మమ్మీ... ఇక చాలు. కిచెన్లో పోపు మాడిన వాసనేస్తోంది నువ్వెళ్లు..." చిరుకోపంగా అంది స్పందన.

"సుమతి చాలా మంచిపిల్ల. నన్ను చెప్పనీవే" అంటూ అర్థించిన అన్నపూర్ణతో.

"ప్లీజ్ మమ్మీ, ప్లీజ్. ఈ ఒక్కసారి నామాట వినవూ" రిక్వెస్టింగ్‌గా అంది స్పందన.

విషయమేంటో సుమతికి అర్థంకాలేదు. అయితే సుమతి ఒక విషయం తెలుసుకుంది. అది అన్నపూర్ణ తనతో చెప్పాలనుకుంటున్న ఒక ముఖ్యమైన విషయాన్ని స్పందన చెప్పనివ్వడంలేదని! అన్నపూర్ణ వెళ్ళిపోయాక.

"ఏమిటి విషయం?" అడిగింది సుమతి స్పందన కళ్లలోకి సూటిగా చూస్తూ.

"నథింగ్. ఏమీలేదు. అన్నట్టు నీకు జీతమెంతిస్తున్నారు?" టాపిక్‌ని డైవర్ట్ చెయ్యాలనే ఉద్దేశంతో అడిగింది స్పందన.

"చచ్చుప్రశ్నలడక్కు, నేనడిగిందానికి ముందు సమాధానం చెప్పు?" సుమతి మాటల్లో సీరియస్‌నెస్.

"నీకేమైంది సుమతి? ఎప్పుడూ ఇన్ని ప్రశ్నలడగ్గా నిన్ను చూడలేదు. మనమధ్య అనవసర విషయాల గురించి డిస్కషనెందుకు?" సుమతి మాటల్ని కొట్టిపారేయాలనే ప్రయత్నం.

"ఆ చెయ్యి ఇటివ్వు" స్పందన కుడి అరచేతిని లాక్కుని తన తలపై ఉంచి,

"మన స్నేహంపై ఒట్టు. అసలు విషయమేంటో నాకు ఇప్పుడే చెప్పాలి నీవు" పట్టుబట్టింది సుమతి. ఇక స్పందనకు చెప్పక తప్పలేదు.

"రవికిరణ్"

"ఆఁ రవికిరణ్... చెప్పు త్వరగా"

"రవికిరణ్‌ని చేసుకోమని నన్ను బలవంత పెడుతున్నారు"

"ఎవరు?"

"ఇంకెవరికుంటుంది ఆ హక్కు? మమ్మీ డాడీ"

"ముందు వెంటనే మీ అమ్మానాన్నల కాళ్లకు దండం పెట్టుకో"

"ఎందుకు?"

"ఎందుకేమిటే పిచ్చీ స్వర్గాన్ని నీ కాళ్ల చెంతకు తెచ్చినందుకు"

"అంత సీనుందా?"

"నీకు... నీకు నిజంగా పిచ్చిపట్టిందే. ఆ పిచ్చిలో పడిపోయి మంచీచెడూ విచక్షణ తెలుసుకోలేకపోతున్నావు" పళ్లు పటపట కొరుకుతూ చెప్పింది సుమతి.

"కానీ నాకిష్టంలేదు" పెదవి విరుస్తూ అంది స్పందన.

"వై? వై? ఎందుకని? రవికిరణ్‌గారికేం తక్కువని? అతను కోరుకుంటే సంబంధాలు లైను కడతాయి"

"చేస్కోమను ఎవరొద్దన్నారు? ఒకటి కాకపోతే పది"

"నిజం చెప్పావే. కడుపు నిండిన వాడి ఎదుట పంచభక్ష్యపరమాన్నాలు పెడితే

ప్రయోజనమేంటి? ఆడవాళ్ళ కళ్లల్లోకి సూటిగా చూసి మాట్లాడని రవికిరణ్ గురించేనా నువ్వు మాట్లాడుతున్నది? అందుకేనా ఇందాక నువ్వు మగవాళ్లని నమ్మకూడదు, మెరిట్ సర్టిఫికెట్లివ్వకూడదంటూ చెప్పింది. అసలు విషయం నాకిప్పుడర్థమైంది. అంత అన్యాయం నీకేం చేశాడని ఆయన మీద నీకంత కసి? " అడిగింది సుమతి.

"అతనికి పొగరెక్కువ" మూతి విరుస్తూ చెప్పింది స్పందన.

"రవికిరణ్‌కు పొగరా? " నోరు తెరిచింది సుమతి.

"అంతేకాదు, తాను ధనవంతుడినన్న అహంకారం"

స్పందన ఆరోపణలకు పెద్దగా నవ్వింది సుమతి. నవ్వుతూ "అయితే అర్జంటుగా నీవు ఓ వ్యక్తిని కలవాలి" అంది.

"ఎవరిని? " స్పందనకు అర్థం కాలేదు.

"మెంటల్ డాక్టర్" అంటూ చెప్పిన సుమతిని మెల్లగా కొట్టబోయింది స్పందన.

"ప్లీజ్ స్పందనా, ఫర్ గాడ్స్‌సేక్ ప్లీజ్. నీ వెల్‌విషర్‌గా చెబుతున్నా నీ అవివేకంతో ఒక మంచి మనిషిని, ఒక మంచి అనుబంధాన్ని దూరం చేసుకోకు. ఎంతో అదృష్టముంటే కానీ రవికిరణ్ వంటి భర్త నీకు లభించడు" తన ఫ్రెండ్‌ని అభ్యర్థిస్తూ అంది సుమతి.

"కొంపదీసి మా అమ్మానాన్నలేమైనా నూరిపోశారా నీకు? క్లాసు మీద క్లాసు పీకుతున్నావ్ సుమతీ" అడిగింది స్పందన.

"నువ్వలా అనుకుంటే నీ ఖర్మ" నిట్టూర్చింది సుమతి.

"సుమతీ! నీ తెలివితేటలపై నీకు నమ్మకముందా? " అడిగింది.

"అదే నేనూ అడుగుతున్నది. ఇంత తెలివైన దానివి నువ్వేనా ఇలా మాట్లాడుతున్నదని నేను ఆశ్చర్యపోతున్నాను" అంది సుమతి.

" ఏది మంచో ఏది చెడో తెలుసుకోలేనంత వెర్రితనం ఉందా నాలో? "

"లేదు ముమ్మాటికీ లేదు. నిజంగా నిన్ను, నీ ధైర్యాన్ని నేను ఎంతగానో మెచ్చుకుంటూ ఉంటాను. మా ఇంట్లో సైతం నీ గురించే చెబుతూ ఉంటాను. అంతేకాదు, నీవంటి అమ్మాయి నాకు స్నేహితురాలిగా దొరికినందుకు ఎంతో గర్వపడుతుంటాను కూడా" తన ఫ్రెండ్‌ని మెచ్చుకుంటూ చెప్పింది సుమతి.

"అయితే జాగ్రత్తగా విను. మమ్మీ డాడీలకు సైతం చెప్పని ఓ నిజాన్ని నీకు చెప్పబోతున్నాను" అంది స్పందన.

స్పందన ఏం చెబుతుందో? అని ఆసక్తిగా వినసాగింది సుమతి.

"రవికిరణ్‌తో నాకు పెళ్లి ఇష్టమే" స్పందన చెప్పింది. నమ్మడానికి సుమతికి చాలా టైం పట్టింది. నమ్మలేని ఓ గొప్ప నిజాన్ని నమ్మక తప్పని పరిస్థితి కలిగింది సుమతికి.

రెండు కళ్లూ పెద్దవి చేసి "నువ్వు చెప్తోంది నిజమా స్పందనా? " మళ్లీ స్పందనని అడిగింది సుమతి.

"అవును, ముమ్మాటికీ ఇది నిజం. ఇది ఎంత నిజమంటే" అంటూ అందుబాటులో ఉన్న కత్తి తీసుకుని ఎర్రటి యాపిల్ని మధ్యలోంచి కోసి రెండు ముక్కలయ్యాక, "ఈ ఆపిల్ రెండు భాగాలైనంత నిజం" తన కళ్లలోని ఎర్రదనాన్ని కప్పి పెడుతూ అంది స్పందన.

ఎప్పటికప్పుడు మారిపోయే వాతావరణంలా నీ ప్రవర్తన విచిత్రంగా ఉంటుంది స్పందనా. ఎవరినెప్పుడు కరుణిస్తావో, ఎప్పుడు కోప్పడతావో ఆ భగవంతుడికే తెలియాలి తప్ప నిన్నర్థం చేస్కోవడం మా తరం కాదు. ఇందాక నీవన్న మాటల్నిబట్టి చూస్తే రవికిరణ్‌ని నువ్వు పెళ్లి చేస్కోవడం అసంభవమనిపించింది. మళ్లీ అదే స్పందన అసంభవాన్ని సంభవంగా మార్చబోతున్న




శుభవార్తని ఈ చెవులే విన్నాయి" అంది సుమతి ఆశ్చర్యంగా.

"ఒక విషయమైతే ముమ్మాటికీ నిజం సుమతీ" అంది స్పందన. ఏ విషయమన్నట్టు స్పందనవైపు ఆసక్తిగా చూసింది సుమతి.

"ఫెమినిస్టు రూపాదేవి శిష్యురాలనైన నేను ఒక మగవాణ్ణి ప్రేమించి పెళ్లి చేసుకోవడమన్నది జరగని పని" అంది స్పందన స్థిరంగా.

"మరి అలాగయితే రవికిరణ్ నీపై ఆశలు పెంచుకున్నాడేమో?" అంది సుమతి ఏదో కనిపెట్టినట్టు అభినయించి.

"డోన్ట్‌బి క్రేజీ... తన కారుని నిర్లక్ష్యంగా నడుపుతూ నన్ను ఏక్సిడెంట్ చెయ్యడానికి ప్రయత్నించాడతను. అతడి ప్రేమని స్వీకరిస్తానని నువ్వెలా అనుకున్నావ్?" ప్రశ్నించింది స్పందన.

"ఇది మరీ బాగుంది. ఓ వైపు అతనంటే ఇష్టంలేదంటున్నావ్. ఇంకోవైపు అతణ్ణి పెళ్లాడబోతున్నట్టు చెబుతున్నావ్. ఇంకాసేపు నేనిక్కడే కూర్చుంటే నీపిచ్చి నాకు ఎక్కేలా ఉంది. నేవెళతాను. దయచేసి నన్నొదిలెయ్యవే" లేచి రెండు చేతుల్నీ జోడించిన సుమతి పరిస్థితి చూసి పడీపడీ నవ్వింది స్పందన. స్పందన నవ్వుతో శ్రుతి కలిపింది సుమతి. కానీ ఆమె పరిస్థితి ఏడవలేక నవ్వినట్టుగా ఉంది.

"రెండు విధాలుగా ఆలోచించి రవికిరణ్‌ని పెళ్లి చేస్కోవాలని నిర్ణయించుకున్నాను" అంది స్పందన సాలోచనగా. అర్థం కానట్టు చూసింది సుమతి.

"నంబర్‌వన్... డాడీ మాటంటే నాకెంతో గౌరవం. అప్పుడప్పుడూ మమ్మీతో అయినా గొడవ పడతానుగానీ డాడీ అంటే నా దృష్టిలో దైవం! నాకు ఊహ తెలిసినప్పట్నుంచీ డాడీ నన్నెంతగానో ప్రేమగా, అపురూపంగా పెంచారు. కొడుకునీ కూతుర్నీ నా ఒక్కర్లోనే చూసుకున్నారాయన. తాను చిన్నప్పట్నుంచీ ఎంతో అభిమానించే తన క్లాస్ మేట్ కొడుకు రవికిరణ్ కావడం ఓ కోఇన్సిడెన్స్. అతడినే మా ఇంటి అల్లుడిగా ఊహించుకుని నాకోసం ప్రపోజ్ చేశారు. ఈ విషయం గురించే రాత్రంతా నేను నిద్ర మేల్కొని తీవ్రంగా ఆలోచించాను. నన్నింతగా ప్రేమించే నా పేరెంట్స్ నిర్ణయం సమంజసమేనని నాకు తోచింది. నంబర్‌టూ రవికిరణ్ గురించి నేను అనవసరమైన అపోహలు పెంచుకుంటున్నానేమో అని కూడా అనిపించింది. అకారణంగా అతణ్ణి ద్వేషిస్తున్నానేమో అనే భావన కూడా కలిగింది నాలో... సో... ఈ పెళ్లికి ఒప్పుకుంటే అన్ని విధాలా బాగుండచ్చేమో" అంది స్పందన.

"కానీ పెళ్లనేది పూర్తిగా మన వ్యక్తిగత జీవితానికి సంబంధించిన విషయం స్పందనా... ఎవరి సంతోషం కోసమో మనం చేసుకున్న అగ్రిమెంటుకాదు పెళ్లంటే. అది హృదయానికీ జీవితానికీ సంబంధించిన విషయం" వివరించింది సుమతి.

"నువ్వేమీ అనుకోనంటే ఓ మాట చెబుతాను. సహనం లేని వాళ్లు, కోపాన్ని తట్టుకోలేని వాళ్లు సొంత నిర్ణయాలు తీసుకోకూడదు. ఎందుకంటే భవిష్యత్తులో వారు తీసుకున్న నిర్ణయాలే వారి మనుగడకు ప్రశ్నార్థకాలుగా పరిణమించే అవకాశముంది" అనికూడా అంది సుమతి.

"రవికిరణ్‌ని పెళ్లి చేస్కోవడానికి మించిన అదృష్టం లేదని చెప్పిన నువ్వేనా సుమతీ ఇలా మాట్లాడుతున్నావ్?" అంది స్పందన.

"అవును, ఆ మాటపై ఇప్పటికీ ఎప్పటికీ స్థిరంగా ఉంటాను నేను. కానీ సమస్య అది కాదు. రవికిరణ్‌ని కనీసం టెన్‌పర్సెంట్ కూడా ప్రేమించలేని నీవు అతడికి హండ్రెడ్ పర్సెంట్ ప్రేమని ఎలా ఇవ్వగలవు?" అడిగింది సుమతి.

ఆమె ప్రశ్నలోని లాజిక్‌కి అప్రతిభురాలయింది స్పందన. 'టాంక్‌బండ్ మీద తనతో తన అసహాయస్థితిని వెళ్లబోసుకుంటూ వలావలా ఏడ్చిన సుమతేనా ఇంత తెలివిగా ఇంత మెచ్యూర్డ్‌గా మాట్లాడుతోంది?' అనుకుని విస్తుపోయింది స్పందన.

"అయితే ఇంతకీ నీ ఉద్దేశమేంటే?" స్పందన ప్రశ్నలో అల్లరితనం, అసహనం తొంగిచూశాయి.

"నా ఉద్దేశంలో వివాహమంటే రెండు ఆత్మల కలయిక. దాపరికాలు, సంకోచాలు, ఈగోలు, అపార్థాలు ఇంకా ఇతర మానసిక వైకల్యాలంటని ఓ పవిత్రబంధం వివాహం! అది ఓ ప్రేమైక జీవనపథంవైపు భార్యాభర్తలు చేసే నిరంతర ప్రయాణం" అంది సుమతి ఉద్వేగంగా.

"హౌ స్వీట్!" అంటూ సుమతి బుగ్గల్ని మురిపెంగా చేతుల్తో స్పృశించింది స్పందన.

"ఎనీవే నే వెళ్లొస్తా స్పందనా. నీ వివాహ జీవితం నిత్యవసంతంలా ఉండాలని కోరుకుంటున్నాను" అంటూ స్పందనతో కరచాలనం చేసింది సుమతి.

వెళ్తున్న సుమతిని అలాగే చూస్తూ గేటు వద్దే నిలబడింది స్పందన. ఎన్నో రకాల ఆలోచనలు స్పందనని చుట్టుముట్టాయి. స్నేహితురాలు సుమతి చెప్పిన మాటలే ఆమెకు పదేపదే వినిపించసాగాయి.

★ ★ ★

సమయం సాయంకాలం ఆరు నలభై అయిదు..

తాజ్ షెరటన్ హోటల్‌లోని ఎక్స్‌క్లూజివ్ విభాగం... ఎటు చూసినా అద్దాల మయం. రంగురంగుల ఎలక్ట్రిక్ దీపాల ఎరేంజ్‌మెంట్... ఒక మోస్తరు వెలుతురులో వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది. బయట చలిగాలి మొదలైంది.

హాలు మధ్యలోని టేబిల్ వద్ద ఇద్దరు వ్యక్తులు ఎదురెదురుగా కూర్చుని ఉన్నారు. ఆ ఇద్దరిలో ఒకరు కిరణ్ అండ్ కిరణ్ ఇండస్ట్రీస్ ఎమ్.డి. రవికిరణ్. మరొకరు రవికిరణ్ క్లాస్‌మేట్ అండ్ ఐ.ఎ.ఎస్ అధికారి చక్రవర్తి. చక్రవర్తికి పెళ్లయింది. కిరణ్‌కీ అతడికి మధ్య మంచి ఇంటిమసీ ఉంది. చక్రవర్తికి చెన్నైలో పోస్టింగిచ్చారు. వారిద్దరూ కలిసి చాలా రోజులు అవడం చేత ఎన్నో విషయాలు మాట్లాడుకునే అవకాశం దక్కింది. నాన్ తింటూ డిస్కషన్ మొదలెట్టారిద్దరూ.

"నీ జాబ్ ఎలా సాగుతోంది చక్రవర్తీ?" అడిగాడు రవికిరణ్.

కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుంటూ "పేరుకి అధికారినే అయినా జాబ్ శాటిస్‌ఫాక్షన్ ఎంతమాత్రమూ లేదు కిరణ్" అన్నాడు చక్రవర్తి.

"అదేమిటీ" రవికిరణ్ ఆశ్చర్యం వ్యక్తం చేశాడు.

"అవును ఐ.ఎ.యస్ అయితే ఏమిటంట?, నిర్ణయాలేవీ మా చేతిలో ఉండవు. మేం జస్ట్ బ్యూరాక్రాట్స్‌మి. ఎన్నో లొసుగులుంటాయి. కొన్ని విషయాల్లో తప్పు అని తెలిసినా తప్పనిసరయి చెయ్యాల్సి వస్తుంది. మాపై ప్రెషర్ పడుతుంది. సర్వీస్ సాధించడంకోసం ఆ రోజుల్లో రాత్రింబవళ్లు కష్టపడి చదువుకునేప్పుడు ఐ.ఏ.యస్ ఆఫీసరై అది చెయ్యాలి, ఇది చెయ్యాలి, సమాజాన్ని మార్చెయ్యాలి, పేదవారి కోసం పాటుపడాలి అంటూ ఎన్నో ఊహించుకునేవాణ్ణి. కానీ తీరా సర్వీస్ సాధించాక నేను సాధించేది, ఉద్ధరించేది ఏమీ ఉండదని తెలిసింది. పైనుండి వచ్చే ఆదేశాల ప్రకారం నడుచుకోవాలి. అలా కాదని ఎదురు తిరిగితే మళ్లీ నీళ్లు దొరకని ఏ ఏజెన్సీ ఏరియాకో ట్రాన్స్‌ఫరవుతుంది. సిటీలో ఉండే సౌకర్యాలు మనకు అక్కడ దొరకవు.

"ఫ్రస్ట్రేషన్... ఇదంతా చూశాక నేనొక




నగ్నసత్యం తెలుసుకున్నాను. అదేమిటంటే పౌరుషం, ఆత్మాభిమానం, ఆత్మగౌరవం లాంటివి ఉన్న వ్యక్తికి ప్రభుత్వ ఉద్యోగం పనికిరాదు. అటువంటి మనిషి బ్యూరోక్ర సీలో నరకయాతన అనుభవిస్తాడు.

"ఊడలు దిగిన ఈ మహా అవినీతి ప్రపంచంలో బ్యూరోక్రసీ, రాజకీయాలు లింకప్ అయి ఉన్నాయి. ఏదో మహాప్ర ళయం వచ్చి అంతా కొట్టుకుపోతే తప్ప ఏ ఒక్క వ్యక్తీ, సంస్థ దీన్ని ప్రక్షాళన చెయ్యా లేరు".

"మరి గ్లోబలైజేషన్ సంగతేంటి? " అడి గాడు రవికిరణ్.

"అఫ్‌కోర్స్... దానివల్ల కొన్ని అంతర్జాతీ యపరమైన ప్రయోజనాలు లేకపోలేదు. కానీ అంతకన్నాముందు మనం మన సంక్షేమం చూసుకోవాలికదా! మన సహజ వనరులకి, ఆర్థికపరమైన సమానత్వానికి భంగం కలగనంతవరకు మాత్రమే గ్లోబలై జేషన్ అభిలషణీయం. మన దేశం ప్ర ధానంగా వ్యవసాయంపై ఆధారపడి ఉంది. ఇప్పటికీ జనాభాలో అధికశాతం వ్యవసా యంపై ఆధారపడి ఉన్నారు. ఇటువంటి స్థితిలో గాట్ ఒప్పందాలు మన రైతులకు భవిష్యత్తు లేకుండా చేస్తాయి. ఇప్పుడు నీకో ఇండస్ట్రీ ఉంది. నేనో ప్రభుత్వ అధికా రిని. మనమెలాగైనా బతగ్గలం. సమస్య మన గురించి కాదుకదా!" చెప్పాడు చక్ర వర్తి. తింటూ చక్రవర్తి చెబుతుంది వినసా గాడు రవికిరణ్.

"అసలు ఈ సిస్టంలోనే పెద్ద లోపము న్నట్టు నాకనిపిస్తోంది కిరణ్"

"ఎలా? "

"లిటరసీ పర్సెంటేజ్ జీరోగా ఉన్నప్పుడు మనవాళ్లు ప్రజాస్వామ్యాన్ని ప్రవేశపెట్టారు. అక్షరాస్యత లేని దేశంలో ప్రజాస్వామ్య ప్రయోగం మితంలేని వంచన అనికదా అబ్రహం లింకన్ చెప్పింది"

"అవును"

"ప్రజాస్వామ్యమంటే ఏమిటి? ప్రజలకు సంపూర్ణ హక్కులు ఉండటం. వారిలో అక్ష రాస్యతే లేకపోతే హక్కుల గురించి ఎలా తెలుస్తుంది. మరి అక్షరాస్యత కావాలంటే ప్రాథమిక సదుపాయాలైన రోటి, కపడా ఔర్ మకాన్ ఈ మూడూ ఉండాలికదా! చూడగా ఇది ఓ పెద్ద ఫార్సులా అనిపి స్తోంది. ఎందుకంటే ఇప్పటికీ మనదేశంలో కోట్లమంది ఈ రోజు గడిస్తే చాలు అను కుంటూ నిస్తేజంగా తమ బతుకులు వెళ్లదీ స్తున్నారు" చక్రవర్తి మాటలకు నిట్టూర్చాడు రవికిరణ్.

"సిస్టర్ ఎలా ఉంది? నీ పిల్లలు శ్రావ్య, సందీప్‌ల గురించి చెప్పు" అడిగాడు.

"కల్యాణి బాగానే ఉంది. సందీప్‌కన్నా చదువులో శ్రావ్యే బెస్ట్" చెప్పాడు చక్రవర్తి.

"చక్రవర్తీ! ఒక విషయం నాకు ఆనం దాన్ని, ఆశ్చర్యాన్ని కల్గిస్తోంది. చదువు లోనూ ఇంకా క్రియేటివ్ వర్క్సులోనూ అమ్మాయిలు అబ్బాయిలకన్నా షార్ప్‌గా ఉంటారెప్పుడూ" అన్నాడు రవికిరణ్.

"అవును కిరణ్. ప్రపంచ వ్యాప్తంగా స్త్రీలు ఎంతో పేరు ప్రఖ్యాతులు సాధిస్తున్నారు. ఇది చాలా గొప్ప విషయం" అన్నాడు చక్ర వర్తి.

"కారణం ఏమై ఉంటుంది? " కుతూహ లంగా అడిగాడు రవికిరణ్.

"ఏముంది? వారికి సునిశిత పరిశీలనా దృష్టి, నిదానంగా ఆలోచించి అర్థం చేసు కునే కెపాసిటీ ఉంటాయి. ఇంతకీ నువ్వు పెళ్లెప్పుడు చేసుకుంటున్నావ్? నీ పెళ్లికి మేమంతా రావాలనుకుంటున్నామోయ్" చెప్పాడు చక్రవర్తి.

"ష్యూర్... నా పెళ్లికి చీఫ్ గెస్ట్‌లు మీరే. కానీ విషయమేంటంటే ఇప్పట్లో నా మేరేజ్ జరిగే సూచనలులేవు" అన్నాడు రవికిరణ్.

"అదేం? ఇంకా నేను..." ఏదో చెప్పాల నుకున్న చక్రవర్తి తనకభిముఖంగా రవికిర ణ్‌కు కుడిపక్క నించున్న ఓ అందమైన

అమ్మాయిని చూసి తడబడ్డాడు. ఆమె ముఖంలో చిరునవ్వు. ఎవరీమె? రవికిరణ్ గర్ల్‌ఫ్రెండా? ఏమో! అని రకరకాలుగా ఆలోచించసాగాడు.

"చక్రవర్తీ... నువ్వేదో చెప్పాలని" అంటూ ఆగి, చక్రవర్తి చేసిన సైగనర్థం చేసుకున్నాడు. తల తిప్పి పక్కకు చూశాడు. అంతే! రవికిరణ్‌కు నోట మాటరాలేదు. లేచి నిలబడ్డాడు రవికిరణ్. ఎందుకైనా మంచిదని తనూ లేచాడు చక్రవర్తి.

"బావున్నారా రవికిరణ్? " తెల్లని పలువరస తళుక్కుమని మెరవగా అడిగిందామె నవ్వుతూ.

"ఓ అపూర్వా మీరా? వాట్ ఎ సర్‌ప్రయిజ్' అన్నాడు రవికిరణ్.

"చక్రవర్తీ ఈమె అపూర్వ. అపూర్వ ఇండస్ట్రీసని..." రవికిరణ్ మాటలు పూర్తికాకముందే

"అలాగా, మిమ్మల్ని కలుసుకోవడం చాలా ఆనందం. నేనూ..." అంటున్న చక్రవర్తితో,

"చక్రవర్తి... రవికిరణ్‌గారు చెప్పారుకదా" పూర్తి చేసింది అపూర్వ.

"అవునవును. మిస్టర్ కిరణ్... మరి నేను బయల్దేరతాను. ఫైనాన్స్ సెక్రటరీ అజిత్‌వర్మని మీటవ్వాలి" వెళ్లబోతున్న చక్రవర్తితో

"అలాగే, మళ్లీ ఎప్పుడు కలవడం? " అడిగాడు రవికిరణ్.

"ఇంకెప్పుడు? మీ పెళ్లిలోనే" అంటూ చక్రవర్తి రవికిరణ్‌తో షేక్‌హేండ్ ఇవ్వగా, చక్రవర్తి మాటలకు ఉలిక్కిపడ్డాడు రవికిరణ్. క్రీగంట రవికిరణ్ణి గమనించిన అపూర్వ నవ్వుకుంది.

చక్రవర్తి వెళ్లిపోయాక "కూర్చోండి" తనూ కూర్చుంటూ అపూర్వతో అన్నాడు రవికిరణ్.

"మళ్లీ మనం ఇంత త్వరగా మీటవుతామని అనుకోలేదు" ముంగురులు పైకి తోసుకుంటూ అంది అపూర్వ.

అవునంటూ నవ్వాడు రవికిరణ్.

"మీరేం తీసుకుంటారు? " రవికిరణ్ణి అడిగింది.

"ఏదైనా జ్యూస్" చెప్పాడు.

"రెండు ఆరెంజ్ జ్యూస్" బేరర్‌తో చెప్పిందామె.

"మిమ్మల్నిలా కలవడం నాకు సర్‌ప్రైజింగా ఉంది" చెప్పాడు.

"మీకేమైనా ఇబ్బంది కలిగించానా? " అడిగింది.

"అబ్బే అలాంటిదేమీలేదు"

"మీ కారు చూసి హోటల్లో మీరు తప్పక ఉంటారని ఎక్స్‌పెక్ట్ చేశాను" చెప్పింది అపూర్వ.

"అలాగా"

జ్యూస్ కొద్దిగా సిప్‌చేసి, "ఏదయినా మాట్లాడండి" అంది అపూర్వ.

"ఏం మాట్లాడమంటారు? " అడిగాడు జ్యూస్ సిప్ చేస్తూ.

"ఏదో ఒకటి చెప్పండి"

"ఏదో ఒకటంటే? ఆ, మీరు అందంగా ఉంటారు. ఈ శారీలో మీరు ఇంకా బావున్నారు" గబగబా చెప్పాడు.

రవికిరణ్ మాటలతో అపూర్వకు నవ్వాగలేదు.

"అంతేనా? ఇంకా" అడిగింది.

"మీరే చెప్పాలి" అన్నాడు రవికిరణ్.

నవ్వింది అపూర్వ.

ఏమిటన్నట్లు చూశాడు రవికిరణ్.

గొంతు సవరించుకుని, "మీరు నా శారీ గురించి చెబుతుంటే మా ఫ్రెండ్స్ అనిత, కరుణల మధ్య జరిగిన చిన్న ఆర్గ్యుమెంట్ గుర్తొచ్చింది" అంది అపూర్వ.

"ఐసీ" అన్నాడు రవికిరణ్.

"డ్రెస్సింగ్ విషయంలో నేను లేటెస్టుగా ఉండనని అనిత అభియోగం. కేవలం మనం ధరించే బట్టలవలన మనం నాగరికులం అనిపించుకోమని కరుణ అభి





ప్రాయం. కరుణకు సుస్మిత సపోర్టు. ఇదంతా మా ఇంట్లో ఫంక్షన్ రోజు జరిగిన డిస్కషన్" చెప్పింది.

"నిజమే, కరుణ, సుస్మితలు చెప్పింది కరెక్ట్" చెప్పాడు రవికిరణ్.

"అయితే మీరు కూడా మా కరుణ, సుస్మితల అభిప్రాయాలతో ఏకీభవిస్తున్నారన్న మాట"

"అవును, అంతర్గతంగా మనిషి యొక్క భావాలు ఉన్నతంగా ఉండాలి. నిజమైన నాగరీకుడంటే అతనే. వ్యక్తియొక్క బాహ్య ప్రవర్తన ఉన్నతంగా ఉన్నట్టు అనిపించినా, అంతర్గతంగా అతను ఉన్నతుడు కాకపోవచ్చు కాబట్టి ఒక మనిషి యొక్క వేషభాషల్నిబట్టి, అతని ప్రవర్తననుబట్టి అతణ్ణి మంచి వ్యక్తిగా జడ్జ్ చెయ్యడం చాలా తప్పు" స్థిరంగా చెప్పాడు రవికిరణ్. అంతటితో ఆగలేదతను

"ఈ నాగరికత అనే పదానికి, మంచితనానికి మంచి లింకుంది" చెప్పాడు.

"ఎలా? " అడిగింది.

"అసలు సివిలైజ్డ్ అంటే ఏమిటి? " అడిగాడు.

"నాగరికంగా"

"నాగరికంగా అంటే? "

"సివిలైజ్డ్"

"అలాక్కాదు... పామరులైన ఒక సంఘాన్ని వెలుగులోకి తీసుకొచ్చి వారికి విద్యాబోధ చెయ్యడం లేదా ప్రొసీజర్ నేర్పించడం దటీజ్ సివిలైజ్డ్"

"అర్థమైంది" చెప్పింది అపూర్వ.

"చిన్న విషయాల్ని కూడా మీరు సునిశితంగా పరిశీలిస్తారే. మీలో మంచి గాంభీర్యం ఉంది. అంటే మీ ఆలోచనల్లో" అంది అపూర్వ.

"గాంభీర్యం అనేది ఒకవిధంగా పెద్ద పదం. దాని గురించి చెప్పాలంటే" మొదలు పెట్టాడు రవికిరణ్.

"వద్దు" అంది అపూర్వ నవ్వుతూ. శృతి కలిపాడు రవికిరణ్.

"నా మాటల్తో బోర్ ఫీలవుతున్నారా? " అడిగాడు.

"నోనో నెవర్... రెండు మూడేళ్ల క్రితం మిమ్మల్ని నేను కలవలేకపోయినందుకు బాధపడుతున్నాను" చెప్పింది.

అపూర్వ మాటలకు నవ్వాడు రవికిరణ్. నవ్వుతూనే "సేమ్ మీలాంటి ఒకతను 'షాజహాన్‌కొచ్చిన ఐడియా నాకొచ్చుంటే ఎంత బావుణ్ణు తాజ్‌మహల్ కట్టేవాణ్ణి. కులీకుతుబ్‌షాకు వచ్చిన ఆలోచనే నాకు వస్తే చార్మినార్ కట్టేవాణ్ణి... నేను భూమ్మీద కొచ్చేసరికి అన్నీ కట్టేశారు. అంతా అయిపోయింది' అని బాధపడ్డాడట" చెప్పాడు రవికిరణ్.

రవికిరణ్ మాటలతో అపూర్వకు నవ్వాగలేదు.

"ఏమో అనుకున్నా మీలో మంచి సెన్సాఫ్ హ్యూమరుంది సుమా" అంది.

"నాలోనేకాదు మీలోనూ ఉండాలి. ఆ మాటకొస్తే అందర్లోనూ సెన్సాఫ్ హ్యూమరుండాలి. సరదాగా మాట్లాడుకోవాలి. హాయిగా నవ్వుకోవాలి. టెన్షన్ ఫ్రీగా ఉంటుంది. ఎంతో రిలీఫ్, ఆరోగ్యానికి మంచిది. అపూర్వగారూ! మనిషి సంఘజీవని ఊరికే అన్లేదు. ఒంటరితనమనేది మనకై మనం కల్పించుకున్నదే. అంతేకానీ లేకపోతే అది ప్రకృతి ధర్మానికి విరుద్ధమైన విషయం" చెప్పాడు రవికిరణ్.

'మీరు నిజం చెప్పారు రవికిరణ్... ఈ ఒంటరి జీవితం ఎటువంటి ఒడిదుడుకులు లేకుండా హాయిగా సాగిపోవాలంటే మీలాంటి మంచి వ్యక్తి తోడుకావాలి. ఎదుటి వ్యక్తిని అర్థం చేస్కోవడానికి ప్రయత్నించే మీవంటి విశాల హృదయం కల మనిషి నీడలో నిశ్చింతగా ఈ నావ పయనం సాగిపోవాలి. అది చాలు కిరణ్. నాకది చాలు. ఇంకే ఆస్తి, హోదాలు నాకవసరంలేదు. మీరు నా తోడుంటే చాలు...

జీవన పయనంలో ఎప్పుడూ నా వెంటే ఉంటానని మీరిచ్చే అభయం చాలు' ఈవిధంగా తనలోతాను ఆలోచిస్తున్న అపూర్వ కళ్లు అప్రయత్నంగా చెమ్మగిల్లాయి.

ఆ విషయం రవికిరణ్ గమనించకుండా ఉండేందుకు తలవంచుకుని టేబిల్ పై అందంగా అలంకరించిన ఫ్లవర్‌వాజ్‌లోని పూలను తడమసాగింది.

"మీ హాబీలేంటి?" అడిగాడు రవికిరణ్. ఏదో ఆలోచనల్లో ఉన్న అపూర్వకు అది వినబళ్లేదు.

"హలో మేడమ్" అన్నాడు కొద్దిగా వాయిస్ పెంచి.

"ఆఁ..." ఉలిక్కిపడుతూ రవికిరణ్ వంక చూసింది అపూర్వ.

"మీ అభిరుచుల గురించి చెప్పండి" అన్నాడు.

"పొయిట్రీ చదవడం, రాయడం, ప్రకృతి ఆరాధన... మీలాంటి మంచి వారితో స్నేహం... ఇంకా ట్రావెలింగ్" చెప్పింది అపూర్వ.

"అయితే మీరు ఇండస్ట్రియలిస్ట్‌గా పనికిరారన్నమాట"

"అదేం?"

"అంటే వ్యాపారవేత్తలకుండే ఒక్క లక్షణం కూడా మీకు లేదు. అంటే బిజినెస్‌ని డెవలప్ చెయ్యాలనే తపన, దీక్ష, ప్రాక్టికల్‌గా ఆలోచించడం, వినిమయవాదం ఇవేమీ మీకు లేవు" చెప్పాడు.

"అక్కడే మీరు పొరబడ్డారు మిస్టర్ రవికిరణ్. హాబీస్ గురించి నేను మీకు చెప్పాను. అది మనిషి యొక్క ప్రవృత్తిపరమైన లక్షణాలు. ఇక నా ప్రొఫెషన్ గురించి చెప్పాలంటే నేను ఎమ్.బి.ఎ చదివాను. ఇండస్ట్రీ విషయాలూ చూస్తుంటాను. కాబట్టి నా వృత్తికి ప్రవృత్తికి ఎంతో తేడా వుంది" చెప్పింది అపూర్వ.

"ఈ సందర్భంలో నా హృదయపూర్వక అభినందనలు అందుకోండి మిస్ అపూర్వా... ఎందుకంటే ఎక్కడో ఎవరికో తప్పించి ఇటువంటి భిన్నమైన రెండు పార్శ్వాలు ఒక దగ్గర ఇమడటం కష్టం. పేరుకు తగ్గట్టు మీరో అపూర్వమైన వ్యక్తి" మెచ్చుకుంటూ అన్నాడు కిరణ్.

"మీ గురించి చెప్పండి" అంది అపూర్వ.

"కిరణ్మయి అని నాకో చెల్లెలుంది. తాతయ్య అప్పజెప్పిన చిన్న వ్యాపారాన్ని డాడీ కష్టపడి పదింతలు చేశారు. నేనూ, కిరణ్మయంటే మా తల్లిదండ్రులకు పంచప్రాణాలు. అందుకే కిరణ్ అండ్ కిరణ్ ఇండస్ట్రీసని పేరు పెట్టారు. కిరణ్మయి కాలేజ్‌లో చదువుతోంది. మా డాడీ అభిప్రాయం ప్రకారం చూస్తే..." అంటూ రవికిరణ్ చెప్తుండగా కోటు జేబులోని సెల్ మోగింది.

"జస్టెమినిట్" అంటూ అపూర్వకు చెప్పి సెల్‌ని చెవి దగ్గరుంచుకుని "రవికిరణ్ హియర్" అన్నాడు.

"అనుపమా చౌదరి... ఎవరో గుర్తు రావట్లేదే... ఆ అదే స్ట్రైక్ కావడంలేదంటున్నాను. నన్ను కాస్త ఆలోచించుకోనివ్వండి. ఆ అయితే! ఇప్పుడా? మార్నింగ్ ఆఫీస్‌లో కలవమని చెప్పండి. వీల్లేదా? నైట్ ఫ్లైట్‌కే ఢిల్లీ వెళ్తున్నారా? మంచిది. వస్తున్నా" అంటూ సెల్ ఆఫ్ చేసి అపూర్వవైపు అసహాయంగా చూశాడు రవికిరణ్.

"వెళదామా" లేచి నించుంటూ చెప్పింది అపూర్వ.

★ ★ ★

"ఇవి చేతులు కాదు" ప్రసాదరావు గొంతు బొంగురు పోయింది. ప్రభాకరరావు రెండు చేతులూ పట్టుకుని బతిమాలసాగాడతను. అతని కళ్ల వెంట కన్నీళ్లు ధారాపాతంగా కారుతున్నాయి. నువ్వు తప్ప నాకు వేరే దిక్కులేదన్నట్టు ప్రవర్తించసాగాడు ప్రసాదరావు.

ప్రసాదరావు అంత ఎమోషనల్ అవుతాడని ఊహించలేదు ప్రభాకరరావు. అసలత





నికి ఎలా చెప్పాలో ఎలా సముదాయిం చాలో ప్రభాకరరావుకి చేతకావడంలేదు.

"ఊరుకో, ప్రసాదరావ్... ఊరుకో కంట్రోల్ యువర్ సెల్ఫ్" ప్రసాదరావుని ఓదార్చడానికి ప్రయత్నించసాగాడతను.

దీనికంతటికీ ఓ కారణముంది. అదేమి టంటే స్పందనతో వివాహానికి రవికిరణ్ అయిష్టత చూపుతున్నాడని, తను స్పంద నని తన కోడలిగా చేసుకుంటానని ప్రసాద రావుకు చేసిన వాగ్దానం నిజమే అయినా ఇది రెండు జీవితాలకు సంబంధించిన విష యమని, మారే కాలంతోపాటు పిల్లల అభి ప్రాయాలకూ విలువనివ్వాలని, అందుచేత స్పందనను తన కోడలిగా చేసుకోలేకపోతు న్నందుకు బాధపడుతున్నానని, కేవలం ఈ చిన్నకారణం వలన తమ స్నేహం దెబ్బతి నకూడదని ఫోన్లో ప్రసాదరావుని అభ్యర్థిం చాడు ప్రభాకరరావు.

అది వింటూనే ఆఘమేఘాలపై వచ్చి వాలాడు ప్రసాదరావు. ఎన్ని అవాంతరాలొ చ్చినా తన కూతుర్ని రవికిరణ్‌కిచ్చి చెయ్యా లనే దృఢ సంకల్పంతో ఉన్నాడతను. అందుకోసం ఎన్ని విషమ పరీక్షలకైనా సిద్ధంగా ఉన్నాడతను.

"ముందీ మంచి నీళ్ళు తాగు" నీళ్లిస్తూ అన్నాడు ప్రభాకరరావు. ప్రసాదరావు మంచినీళ్లు తాగాక.

"ప్రసాదరావ్... నువ్వు నా క్లాసమే ట్‌వి... నా స్నేహితుడివి. నీపై నాకె ప్పుడూ కోపంలేదు. ఉండదు. అంతవరకూ ఓకే. కానీ ప్రస్తుత పరిస్థితులు వేరుగా ఉన్నాయి. నా అభిప్రాయం ప్రకారం ఇదీ ఒకవిధంగా మంచి మార్పే ఎందుకంటే మన రోజుల్లో జరిగిన వివాహాలకీ, ఇప్పుడు జరుగుతోన్న దానికి తేడా ఉంది. ఎరేంజ్డ్ మేరేజెస్ చేసుకుని మనం హాయిగానే ఉన్నాం. నేటి జనరేషన్ అది తప్పంటు న్నారు. పరస్పరం ఒకరి అభిరుచులు వేరొ కర్తో కలవాలంటున్నారు. ప్రేమించుకో వడం, తమ తమ ఇష్టాఇష్టాల గురించి చర్చించుకోవడం ఎటువంటి సిగ్గు, బిడియం లేకుండా ఫ్రీగా మూవ్ అవుతున్నారు. రేపొద్దున కలసి జీవించేవాళ్లు కాబట్టి తమ భవిష్యత్తుని ముందే డిజైన్ చేసుకుంటు న్నారు నేటి యువతీ యువకులు. కాబట్టి మనం మన పిల్లల వెల్‌విషర్స్ అయినందు చేత, వారి సంతోషమే మన సంతోషం కదా! మనం మన పెద్దరికాన్ని వారిపై బల వంతంగా ఎందుకు రుద్దాలి? వారినెందుకు ఇబ్బందుల పాల్జెయ్యాలి? చిన్నప్పట్నుంచీ వారినెంతో గారాబంగా పెంచి వారి ఇష్టాఇ ష్టాల్ని ఎంతో గౌరవించాం కదా! వారు కోరుకున్నది వారికిప్పించి వారు సంతో షంతో గంతులు వేసినప్పుడు, వారి కళ్లలో మెరిసే కాంతిని చూసి మనమానందిం చామా లేదా? చిన్నచిన్న విషయాల్లోనే మనం మన పిల్లల అభిప్రాయాలకు అంత విలువిచ్చినపుడు, జీవిత భాగస్వామిని ఎంపిక చేసుకునే విషయంలో మనం మన పిల్లలకు స్వేచ్ఛని ఎందుకివ్వకూడదు? ఇది వారి జీవితాలకు సంబంధించిన విషయం కదా! వాళ్లనే నిర్ణయించుకోనిద్దాం ప్రసాద రావ్! రవికిరణ్ స్పందనతో తన పెళ్ళి ప్రపోజల్ని తిరస్కరించాక ఎందుకని నేను వాడిని అడగలేదు? ఎందుకంటే అతను పెద్దవాడయ్యాడు. ఇండస్ట్రీ సూపర్‌వైజ్ చేస్తున్నాడు. పరిస్థితుల్ని అర్థంచేసుకోగ లడు. కాబట్టి ఒక మెచ్యూర్డ్ వ్యక్తిపై నేను నా పెద్దరికాన్ని రుద్దడం హాస్యాస్పదమే కాదు. అవివేకం కూడా!" చెప్పాడు ప్రభాక రరావు.

"రవికిరణ్‌కు, స్పందనకూ మధ్య మనస్ప ర్థకు కారణమేంటో నేను చెబుతాను" అన్నాడు ప్రసాదరావు.

"ఏం జరిగిందో చెప్పమని నిన్ను నేను అడిగానా? రవికిరణ్‌కూ స్పందనకూ మధ్య మనస్పర్థలున్నాయని నువ్వే నీ నోటితో చెప్పావు కాబట్టి, మీ అమ్మాయి కూడా రవి

కిరణంటే అయిష్టంగా ఉందని నువ్వు చెప్ప కనే చెప్పావు. అంచేత ప్రాబ్లెం సాల్వ్ అయిపోయింది. అంతేకాదు, మీ అమ్మా యికి తనకిష్టంలేని బలవంతపు పెళ్ళి చెయ్యాలని నువ్వు ప్రయత్నిస్తున్నావ్? దీనికి మీ అమ్మాయే కాదు చట్టం కూడా నిన్ను క్షమించదు" దృఢంగా పలికాడు ప్రభాకరరావు.

"తమ మంచి చెడ్డల గురించి పిల్లలకేం తెలుసు ప్రభాకరరావు?" అడిగాడు ప్రసాద రావు.

"అడ్డాలనాడు పిల్లలుగానీ, గెడ్డాలొచ్చాక పిల్లలేంటయ్యా నీ వెర్రి కాకపోతే" అన్నాడు ప్రభాకరరావు.

"నువ్వెన్నయినా చెప్పు ప్రభాకరరావు. స్పందన్ని రవికిరణ్‌కే ఇచ్చి చెయ్యాలని నేను దృఢంగా నిశ్చయించుకున్నా. ఇది బాగా ఆలోచించిన మీదట నేను తీసుకున్న నిర్ణయం. నా నిర్ణయంలో మార్పులేదు. మా అమ్మాయి స్పందనకు నీ కొడుకు రవి కిరణే తగిన జోడీ. రవికిరణ్ నీడలోనే మా అమ్మాయి జీవితం చల్లగా సాగిపో తుందనే గట్టి నమ్మకం నాకుంది" చెప్పాడు ప్రసాదరావు.

"కథ మళ్ళీ మొదటికే వచ్చిందని దీన్నే అంటారు. ఇందాకట్నుంచి నేను చెప్పింది చెవిటివాడి ముందు శంఖమూదినట్టుగా తయారైంది" అన్నాడు ప్రభాకర్రావ్.

ప్రభాకర్రావ్ మనసులో మాధవరావ్ కూతురు అపూర్వ మెదులుతోంది. ఆరోజు ఫంక్షన్లో మాధవ్‌రావు భార్య జానకి మాటలు, ప్రవర్తన గుర్తొచ్చాయతనికి. అపూర్వ నిజంగా అపూర్వే! తమ రవికిరణ్ అపూర్వల జంట చాలా బావుంటుంది. తన స్నేహితుడు ప్రసాదరావు కూతురు స్పంద న్నయితే తనింత వరకూ చూడనేలేదు. అంతమాత్రాన ప్రసాదరావన్నా, అతని కూతురు స్పందనన్నా తనకి ఇష్టంలేక పోలేదు. కానీ స్వయానా రవికిరణే స్పంద నతో పెళ్ళి వద్దంటున్నాడు కదా! నిజానికి స్పందనంటే సదభిప్రాయమే ఉంది ప్రభాక ర్రావుకు. లేకపోతే స్పందనని చూడక ముందే స్పందన్ని చేస్కోమని రవికిరణ్‌కు తను ఎందుకు ప్రపోజ్ చేస్తాడు? కానీ ప్రసాదరావు ధోరణే ఎంతకీ మింగుడు పడ టంలేదు తనకి. 'వద్దురా బాబూ' అని తాను మొత్తుకుంటున్నా వినేటట్టులేడు. అతడికేవిధంగా అర్థమయ్యేలా చెప్పాలో తనకు అర్థంకావడం లేదు. ప్రసాదరావు తమ అబ్బాయిపై ఆశలు పెంచుకున్నం దుకుగాను తనే మళ్ళీ ఓసారి రవికిరణ్‌కు నచ్చచెబితే ఎలా ఉంటుంది? ఈవిధంగా ప్రభాకర్రావ్ ఆలోచనలు పరిపరివిధాలా పరుగిడసాగాయి.

"నువ్వు ఎక్కువ మాట్లాడితే, నీ కొడుకుని కిడ్నాప్ చేసి మరీ తీసుకెళ్ళి నా కూతురి మెళ్ళో తాళి కట్టిస్తాను" నవ్వుతూ అన్నాడు ప్రసాదరావు

"ఏడిశావ్. చేస్కోవద్దని నేను చెప్పానా? ఇద్దరికీ ఇష్టంలేనప్పుడు పెళ్ళెందుకన్నాను?" అన్నాడు ప్రభాకర్రావ్.

"మనిద్దరం గట్టిగా నిర్ణయించుకుంటే, మన పిల్లలిద్దరూ ఓ ఇంటివాళ్ళయిపోతారు. ఇక మనస్పర్థలంటావా? నిదానంగా అవే సర్దుకుంటాయ్. అందుకే పెళ్ళి చేసి చూడు, ఇల్లుకట్టి చూడు అని ఊరికే అనలేదు" అన్నాడు ప్రసాదరావు.

"అయితే ఇంతకీ నువ్వేమంటావ్?" ప్రభాకర్రావడిగాడు.

"అనేదేముంది? రవికిరణ్ణి నువ్వు ఒప్పించు. మా అమ్మాయిని ఒప్పించే పూచీ నాది" భరోసాగా అన్నాడు.

"అలాగే... అబ్బాయిని మరోసారి కదిలి స్తాను. బలవంతపెట్టను. కానీ ఈసారి కూడా రవికిరణ్ వద్దని చెబితే ఇక నువ్వు ఈ పెళ్ళి విషయం పూర్తిగా మరిచిపోవ ల్సిందే" హెచ్చరికలా అన్నాడు.

"అలా జరగడానికి వీల్లేదు" ప్రసాదరావు

మాటల్లో ఎంతో నమ్మకం, విశ్వాసం ధ్వనించాయి.



"ఇప్పుడు నేనడగబోయే ప్రశ్నకి నువ్వు సూటిగా సమాధానం చెప్పు? " రాత్రి భోజనాలయ్యాక ప్రభాకర్రావ్ తన కొడుకు రవికిరణ్ణి అడిగిన ప్రశ్న అది. ఏదో మేగజైన్ని తిరగేస్తూ కూర్చున్నాడు రవికిరణ్. కిరణ్మయి టి.వి. చూస్తోంది. డైనింగ్ టేబుల్ సర్దుతోంది దమయంతి.

"ఏ విషయం గురించి? " మేగజైన్లోంచి తలెత్తకుండానే అడిగాడు కిరణ్.

"నువ్వు ఎవరైనా అమ్మాయిని ప్రేమిస్తున్నావా? " తండ్రి అడిగాడు.

తండ్రి మాటలకు మేగజైన్ పడేసి నవ్వసాగాడు రవికిరణ్. కొడుకు నవ్వుతో శ్రుతి కలిపింది దమయంతి. ఏమిటన్నట్టు తల తిప్పి వీళ్లకేసి చూసింది కిరణ్మయి.

"మీరడిగిన ప్రశ్న చాలా ఆసక్తిగా ఉంది డాడీ! నిజంగా నేనుగానీ, లేకపోతే నన్నెవరయినా కానీ ప్రేమిస్తే ఎంత బావుంటుంది? " అన్నాడు నవ్వుతూ.

"ఇంటర్నెట్లో నీ ఫొటో, వివరాలు ఇచ్చెయ్యి అన్నయ్యా! ఫ్యాన్స్ మెయిల్స్తో నీ ఇ-మెయిల్ నిండిపోతుంది" చెప్పింది కిరణ్మయి.

"కిరణ్, బీ సీరియస్! నాకు నీ సమాధానం కావాలి" ప్రభాకర్రావ్ అడిగాడు.

"నో డాడీ" చెప్పాడు తల అడ్డంగా ఊపుతూ.

"ఆర్యూ ష్యూర్? " మళ్ళీ అడిగాడు.

"ఎస్ డాడీ" చెప్పాడు.

"అయితే నేను చెప్పబోయే ఓ మాట వింటావా? "

"తప్పకుండా!"

"అయితే నా క్లాస్మేట్ ప్రసాదరావు కూతురు స్పందన్ని పెళ్ళిచేసుకో. చదువుకుంది. సిటీలోనే బేంక్ ఆఫీసర్గా చేస్తోంది" చెప్పాడు.

"కానీ డాడీ..."

"ఇక చాలు. కానీ అంటూ కహానీలు చెప్పకు. పెళ్ళయ్యాక అన్నీ సర్దుకుంటాయ్"

కొంతసేపటిదాకా మౌనంగా ఉండిపోయాడు రవికిరణ్.

"రేపు ఆదివారం. రేపొద్దున్నే మనమంతా ప్రసాదరావింటికి వెళ్తున్నాం. వీలయితే నిశ్చితార్థం కూడా రేపే" ఆజ్ఞ జారీ చేశాడు. ఒకసారి తల్లి దమయంతివైపు చూశాడు రవికిరణ్.

అర్థంచేస్కుని "వాడేదో చెప్పాలనుకుంటున్నాడండీ" భర్తతో అంది దమయంతి.

ఏమిటన్నట్టు చూశాడు ప్రభాకర్రావ్.

"ఇక నిశ్చితార్థాలెందుకు? ఏకంగా పెళ్లే చేస్కుంటాను" అన్నాడు.

"అదీ అలా అన్నావు బావుంది" రవికిరణ్ణి మెచ్చుకుంటూ అన్నాడు.

"కానీ ఇప్పుడు కాదు. జర్మనీ వెళ్లొచ్చాక" కిరణ్ చెప్పిన మాటకు చల్లబడ్డారంతా.

★ ★ ★

అంజనాశ్రీవాత్సవ..... ఐ.పి.ఎస్..... డి.ఐ.జి.... ఉమెన్ ప్రొటెక్షన్ సెల్, సమయం ఉదయం పదకొండు గంటలు.

"గుడ్మార్నింగ్ మేడమ్" అంజనా శ్రీవా

త్సవని విష్‌చేసింది రూపాదేవి.

"ఓ మీరా... రండి...రండి" ఆహ్వానించింది అంజన. ఇద్దరిదీ దాదాపు ఒకే వయసు.

"పేపర్లో మీ గురించి చదువుతున్నాను. ఉమెన్ వెల్ఫేర్ గురించి మీరు బాగా ఫైట్ చేస్తున్నారు. కంగ్రాట్స్" నవ్వుతూ చెప్పింది అంజన.

"థ్యాంక్సండీ... సమర్థురాలైన ఒక పోలీసు అధికారిణిగా మీకు తొలి నుండి మంచి పేరుంది. ప్రస్తుతం మీరు ఉమెన్ ప్రొటెక్షన్ సెల్ బాధ్యతలు నిర్వహిస్తున్నారు. ఆ విధంగా మీరు స్త్రీల సమస్యల్ని ఇంకా దగ్గర్నుండి చూడగలుగుతున్నారు. స్త్రీల సమస్యలకు జస్టిస్ చేసే అవకాశం మీకుంది" చెప్పింది రూపాదేవి.

"అఫ్‌కోర్స్"

"మీరు నిర్వహిస్తున్న వింగ్ యొక్క విశేషాలు చెప్పండి"

"ష్యూర్. సాంకేతికంగా మనమెంతో విజయం సాధించినా, స్త్రీకి సమానత్వం ఇచ్చే విషయంలో మన సమాజం ఎంతో వెనకబడి ఉంది. నేను చూస్తున్న వింగ్‌లో ఎక్కువ శాతం వివాహ సంబంధ సమస్యలే వస్తుంటాయి"

"అంటే మన వివాహ విధానంలో ఏదయినా లోపముందంటారా?"

"విధానం గురించి నేను చెప్పడంలేదు. మన ఆలోచనా విధానంలోనే తేడా ఉంది. ఒక చిన్న ఉదాహరణ చెబుతాను. సమాన వయసుగల కోడలు, కూతురు కలిగిన ఓ స్త్రీ ఉందనుకోండి. ఆ ఇద్దరూ కలసి ఓ తప్పు చేశారు. అక్కడ ఆ అత్తగారి జస్టిస్‌లో ఎంత తేడా ఉంటుందో తెలుసా? ఆమె తన కూతుర్ని వెనకేసుకొస్తుంది. అదే తప్పు చేసిన కోడల్ని మాత్రం దండిస్తుంది. కోడలు పరాయి మనిషి అనే అభిప్రాయం ఉంటుందామెకి. న్యాయంచేసే విషయంలో తన, పర బేధాలేమిటి? ఈమె కూతురు వేరే ఇంటికి కోడలిగా వెళ్ళినప్పుడు ఇదే పరిస్థితి ఆమెకూ ఎదురవుతుంది. ఈ సంఘటనతో ఆ ఇంటి మగవారికి (భర్త, మామ, మరిది) ఏ విధమైన సంబంధం ఉండదు. ఇప్పుడు స్త్రీకి నిజమైన శత్రువెవరో మీరే చెప్పండి? స్త్రీలకు అన్యాయం చేస్తూ, స్త్రీల బతుకుల్ని కాలరాస్తూ, తప్పుడు విలువలు నేర్పిస్తూ మన సమాజాన్ని పతనంవైపు తీసుకెళ్తున్నది స్త్రీయే! పురుషుడు కాదు.

"మరి వరకట్న వేధింపులు?" అడిగింది రూపాదేవి.

"అక్కడికే వస్తున్నా... ఫలానా వాళ్ళ అమ్మాయిని చేసుకుంటే నీకు అంత డబ్బు ఇచ్చేవాళ్ళు. ఇంత ఫర్నీచర్ వచ్చేది. వాళ్ళు అదిస్తారు. ఇదిస్తారు. ఈ దరిద్రపుగొట్టు దాన్ని చేసుకోవడంవల్ల అన్ని విధాలా నష్టపోయామంటూ తనకొడుక్కీ, భర్తకూ విషబీజాల్ని నూరిపోసేది ఎక్కువగా స్త్రీయే రూపాదేవిగారూ... ఇప్పుడు మీరే చెప్పండి? ఎవరి హక్కుల్ని ఎవరు కాలరాస్తున్నారో? మన కుటుంబ వ్యవస్థకు తూట్లుపెట్టి, ఛిన్నాభిన్నం చేస్తున్నది స్త్రీయేనండీ. ఒకప్పుడు జాయింట్ ఫ్యామిలీసుండేవి. ఆ విషయం ఇప్పటికీ పాతతరానికి చెందిన పెద్దలు గర్వంగా చెప్పుకుంటారు. మరి ఆ సిస్టం ఎలా విచ్ఛిన్నమైందో తెలుసా మీకు? ఆ ఇంటికి కోడళ్లుగా వచ్చిన స్త్రీలు పన్నిన పన్నాగం వల్ల ఉమ్మడి కుటుంబ వ్యవస్థ తునాతునకలైంది. అంతెందుకండి? ఒక దగ్గర భార్యాభర్తలిద్దరూ తమ ఇద్దరి పిల్లల్తో హాయిగా సంసారం చేస్కుంటూ ఉంటారనుకోండి. భర్త తమ్ముడు అంటే మరిది ఆ ఇంటికి వచ్చాడనుకోండి. అప్పుడతగాడికి వదినిచ్చే ట్రీట్‌మెంట్ ఎలా ఉంటుందో మీకు తెలుసా? మరి అదే మరిది స్థానంలో ఆమెగారి తమ్ముడొచ్చినప్పుడు చూడాలి! ఎన్ని గారాలు పోతుందో? ఎంత మర్యాద చేస్తుందో. కాబట్టి మన సమాజంలో

 

కుటుంబ వ్యవస్థ ఏ విధంగా నడవాలో చూసేది చాలా భాగం స్త్రీయే! మరి అటు వంటప్పుడు పురుషుణ్ణి దోషిగా నిలబెట్టడం తప్పుకదా!"

"మీరు పక్షపాతధోరణిలో మాట్లాడుతు న్నారేమో ఒకసారి ఆలోచించండి అంజనా శ్రీవాత్సవగారూ? " అడిగింది రూపాదేవి.

"ముమ్మాటికీ ఇది నిష్పక్షపాత ధోరణి. నేను ప్రాక్టికల్‌గా గమనిస్తున్న విషయా లివి. కేసుని జాగ్రత్తగా స్టడీ చేస్తే విషయాలు ఆటోమేటిగ్గా అర్థమైపోతాయి" చెప్పింది అంజనా శ్రీవాత్సవ.

"మనది పురుషాధిక్య సమాజం అంటారు కదా! మరి దాని గురించి మీరేం చెబు తారు? " అడిగింది.

"అఫ్‌కోర్స్. అందులో కొంత నిజం లేక పోలేదు. స్త్రీ అభివృద్ధిని చూసి పురుషుడు 'ఈగో' ఫీలవుతాడు. దానికి ఉదాహరణ మాటిమాటికీ మన చట్టసభలో వీగిపో తున్న మహిళా రిజర్వేషన్ బిల్లు. స్త్రీ ఎప్పుడూ తనకు అనుకూలంగా ఉండాలను కుంటాడు పురుషుడు. అది అతని సహజ గుణం" చెప్పింది అంజనా శ్రీవాత్సవ.

"మరి స్త్రీకి పురుషుడు తనకు అనుకూ లంగా ఉండాలనుకునే హక్కు లేదా? " అడి గింది రూపాదేవి.

"మీరు సమస్యను స్త్రీ, పురుషుల వ్యక్తిగత అభిప్రాయాలవైపు లాగుతున్నారు. వ్యక్తిగత అభిప్రాయాలకీ, న్యాయానికీ చాలా డిఫరె న్సుంది" ఖండించింది అంజనా శ్రీవాత్సవ.

"ఈ విషయంలో నేను మిమ్మల్ని పూర్తిగా వ్యతిరేకిస్తున్నాను మేడమ్! మీరు స్త్రీ ద్వేషిలా మాట్లాడుతున్నారు. అలాగైతే ప్రచార సాధనాల్లో, సినిమాల్లో స్త్రీని ఎలా వ్యాపార వస్తువుగా తయారుచేశాడో మగ వాడు గమనించారా మీరు? " అడిగింది.

"వారిని నగ్నంగా యాక్టింగ్ చెయ్యమని ఎవరు చెప్పారు? ఎందుకు వెళ్ళాలి? కష్ట పడి పనిచేసి నీతిగా బతకొచ్చు కదా! అలా బతకరు. ఎందుకుంటే ఫాల్స్ ప్రిస్టేజ్. డబ్బుకీ, విలాసాలకు, సుఖానికి అలవాటు పడి, మన సమాజాన్ని మరింత పతనం చేస్తున్నారు" చెప్పింది అంజన.

"కొన్ని పురుష సంపాదన లేని కుటుంబా లుంటాయి. బాధ్యతలు నిర్వహించవలసి ఉంటుంది. మరి అటువంటప్పుడు ఏ కూలి పనో లేక కుట్టు మిషనుపనో చేస్తే సంపా దన సరిపోదు. అందుకని తప్పని సరి పరి స్థితుల్లో స్త్రీలకు కమిట్‌కాక తప్పదు" చెప్పింది రూపాదేవి.

"అంటే డబ్బు అవసరం ఎక్కువున్న పరి స్థితిలో స్త్రీ అలా నగ్నంగా వ్యాపార ప్రకట నలకు వెళ్ళచ్చుంటారా? అలా వెడితే మగ వాడు ఆ స్త్రీని వ్యాపారవస్తువు చేశాడనే ఆరోపణ ఎంతవరకు సమంజసం? న్యాయం అనేది అందరికీ ఒకేవిధంగా వర్తిస్తుంది.

"ఇంజనీర్లు, డాక్టర్లు, ఎన్.ఆర్.ఐలు, పబ్లిక్, ప్రైవేట్ సెక్టర్లలో పెద్ద అధికార్లు వీళ్ళంతా చదువుకున్న వాళ్లే కదా! కానీ దురదృష్టమేమంటే నేను చూస్తున్న వింగ్‌లో వీరికేసులే ఎక్కువగా ఉన్నాయి. దీన్ని బట్టి మనకేం అర్థమైందంటే, విద్యకూ వివేకానికీ సంబంధం లేదని! విద్యావ్యవస్థ నేడి కంప్లీట్‌గా వ్యాపారమయమవడంచేత, ఎల్.కే.జీ నుండి ఇంజనీరింగ్ వరకు ఎన్నో లక్షలు ఖర్చుపెట్టిన వాళ్లు, తాము పెట్టిన డబ్బుకి మరింత ఎక్కువ డబ్బు కావాలంటారు కానీ సేవ, మానవత్వం, మంచితనం అంటూ టైమ్ వేస్ట్ చేస్కోరు" చెప్పింది అంజనాశ్రీవాత్సవ.

"మీ వాదనతో నేను ఏకీభవిస్తాను" అంది రూపాదేవి.

"ఈ డిగ్రీలు, యూనివర్సిటీల పట్టాలు, డాక్టరేట్‌లు ఆయా మనుషులకు వ్యక్తిగ తంగా అభివృద్ధి చెందడానికి పనికొస్తాయేమో కానీ, దానివల్ల సమాజానికి ఒరిగేదేమీ లేదు" అంది.

"అవును"



# ఏరిన ముత్యాలు

* మనం ప్రేమించే దాన్ని బట్టి మనం తీర్చిదిద్దబడతాము, రూపుదిద్దుకుంటాము.

-గోథె

* గొప్పపనుల సుగంధమే పేరు, ప్రతిష్ఠలు.

-సోక్రటీస్

* ప్రపంచాన్ని మార్చాలన్న ప్రయత్నం కంటే ముందు తమను తాము మార్చుకోవడం అత్యంత పవిత్ర కార్యము.

-లియో టాల్‌స్టాయ్

* సహనం కోల్పోవడం అన్నది యుద్ధంలో ఓడిపోవడం అవుతుంది.

-గాంధీజీ

* మన ఈరోజు ఆలోచనల పరిణామమే రేపటి జీవితం.

-మార్క్స్

* క్రియారహితమైన ఆలోచన వైఫల్యం అయితే, ఆలోచనారహితమైన పని మూర్ఖత్వం అవుతుంది.

-పంచతంత్రం

* ఇతరులకు మనం అందించే ఆనందం పదిరెట్లై తిరిగి మనలని చేరుతుంది.

-జె.పి.వాస్వాని

* ఆనందం అన్నది ఇతరులతో మనకున్న సామరస్యంపై ఆధారపడి ఉటుంది.

-బెర్ట్రాండ్ రస్సెల్

* బాధ్యతలను నిర్వహించడమే వాటినుంచి విముక్తి పొందే ఏకైక మార్గం.

-రాబర్ట్ సీన్

* క్రమశిక్షణను మనం కష్టాలు అనే పాఠశాలలో నేర్చుకుంటాము.

-గాంధీజీ

* క్రమశిక్షణ నుండే జీవితం తన విలువను పొందుతుంది. కాబట్టి జీవితపు క్రమశిక్షణ అన్నది జీవితం కంటే చాలా విలువైనది.

-తిరుక్కురళ్

* స్నేహితుడిగా ఉండడమే స్నేహితుడిని సంపాదించుకోవడానికి మంచి మార్గం.

-ఎమర్సన్

* బలహీనుల మార్గపు అవరోధాలు బలవంతుల పాలిట విజయసోపానాలు అవుతాయి.

-థామస్ కార్లైల్

సేకరణ: వాకాడ శ్రీనివాసరావు

"ఆసక్తి కలిగించే ఓ కేసు గురించి మీకు చెబుతాను. దానికంటే ముందు ఓ కాఫీ తాగుదాం" చెప్పింది అంజనాశ్రీవాత్సవ.

"ష్యూర్"

కాఫీ తాగాక చెప్పడం మొదలెట్టింది అంజన.

"ఒక స్త్రీ తన భర్తపై కట్నం వేధింపు కేసు ఫైల్ చేసింది. పోలీసులు భర్తని స్టేషన్‌కు పిలిపించారు. ఎంక్వయిరీ మొదలైంది. భర్త అమాయకుడు. అతనికి ఈమెని చేసుకున్నప్పుడు మంచి ఉద్యోగ ముండేది. ఈమెకు విలాసాలెక్కువ. పెళ్ళి కానంతవరకు నీతిగా న్యాయంగా తన ఉద్యోగం చేసుకున్న అతను భార్యకు దాసోహమన్నాడు. లంచాలు తీసుకోవడం మొదలెట్టాడు. ఇద్దరు పిల్లలు పుట్టారు. భర్త తరపువారినెవరినీ ఇంటికి రానిచ్చేదికాదు. ఆమె తరపువాళ్లంతా ఇంటిమీదపడి పంది కొక్కుల్లా తినేవాళ్లు. ఇద్దరు పిల్లల్నీ తన అధీనంలో ఉంచుకుందామె. అతణ్ణి కేవలం సంపాదించే యంత్రంలా చూశారు ఇంట్లో వారంతా. ఈ నేపథ్యంలో ఒకరోజు లంచం తీసుకుంటుండగా అతను పట్టుపడ్డాడు. సస్పెండ్ చేశారు ముందు. ఎంక్వయిరీ పూర్తయ్యాక అతణ్ణి సర్వీస్‌నుంచి డిస్మిస్ చేశారు. రెక్కలు తెగిన పక్షిలా అయిందతని పరిస్థితి. సంపాదన లేదు. గౌరవం అసలే లేదనుకోండి. సుఖజీవనానికి అలవాటు పడ్డ శరీరం. ఆదాయం లేదని ఎలా సమాధాన పడుతుంది. ఈమె మంచి వయసులో ఉంది. ఓ మంచి డబ్బున్న పార్టీని లోబరుచుకుంది. ఆమె భర్త తేనె తుట్టలాంటి వాడైతే వీళ్లంతా తేనెటీగలు. తేనెనంతటినీ పీల్చేశాక తుట్టెతో పనేముంటుంది? ఎలాగైనా అతణ్ణి వదిలించుకోవాలి. కేసు పెట్టింది. వాస్తవం ఇది. ఎంక్వయిరీ చేసిన పోలీసులకే అతగాడిపై జాలేసింది. సో... కొన్ని కేసులీవిధంగా ఉంటాయి రూపాదేవి గారూ!" అంజన చెప్పింది.

"మరి కట్నకానుకలు తీసుకుని పెళ్లిచేసుకున్న కొంతమంది మగవాళ్లు ఆ తర్వాత ఇదికావాలి, అదికావాలి అంటూ కాపురం చేసిన కొద్దికాలంలోనే వారినెంతో వేధించి, ఆ తర్వాత ఆమెని చంపేసి, దాన్ని ఆత్మహత్యగా చిత్రీకరించి, మళ్లీ కట్నకానుకలు తీసుకొచ్చే కొత్త అమ్మాయిలకోసం అర్రులు చాచడం లేదా? దీనికేమంటారు? ఇక్కడ పురుషుడి పాత్ర అసమంజసంగా అన్యాయంగా లేదా అంజనా శ్రీవాత్సవగారూ? దీని గురించి మీరేమంటారు? " అడిగింది రూపాదేవి.

"ఈ విషయంలో మీకు ఇందాకే చెప్పాను. ఈ విధంగా జరగడానికి ఆ ఇంటి అత్త, ఆడపడుచులే కారణమవుతున్నారు. వారి ప్రేరణే లేకపోతే పురుషుడు అంత దారుణానికి ఒడిగట్టడు. అయిందానికీ, కానిదానికీ ఇలా ప్రతి చిన్న విషయానికీ కోడల్ని మందలిస్తుంటే, భర్త మనసులో తన భార్యమీద ఒకరకమైన నెగెటివ్ ఫీలింగ్ చోటుచేసుకుంటుంది. ఈ విధంగా పురుషుడి మనసు విషపూరితం చేస్తున్నదెవరు? అతడి అమ్మా, చెల్లెళ్లే కదా? " ఎదురు ప్రశ్నించింది అంజన.

"అంటే దీన్నిబట్టి చూస్తే మీరు టోటల్‌గా పురుష పక్షపాతిలా నాకు అనిపిస్తున్నారు. మీరు ఒక స్త్రీ అయిఉండి స్త్రీవాదిలా ఎందుకు మాట్లాడరు? " అడిగింది రూపాదేవి.

"మీరు మళ్లీ పొరపడుతున్నారు రూపాదేవీ! అసలు స్త్రీవాదం, పురుషవాదాలేంటి అర్థంలేకుండా? సృష్టి నిర్మాణంలోనే స్త్రీపురుషులిద్దరికీ సమాన ప్రతిపత్తిని కల్పించాడు దేముడు. స్త్రీ లేని పురుషుడు, పురుషుడు లేని స్త్రీ జీవితాలు అసంపూర్ణాలవుతాయి. వాదమెప్పటికీ న్యాయం కాదుకదా? " చెప్పింది అంజనాశ్రీవాత్సవ.

"అయాంసారీ అంజనగారూ! మీ వాద



నతో నేను ఏకీభవించలేను. ఎందుకంటే పుట్టుకతోనే పురుషునికంటే బలహీనురాలిగా జన్మించిన స్త్రీ 'సబల' ఎలా అవుతుంది? సృష్టిలోనే ఇద్దరి మధ్యా సమానత్వం లేదని దీంతో ఋజువైందికదా? మరి సృష్టిలోనే స్త్రీపురుషులిద్దరికీ సమాన ప్రతిపత్తి ఉందని మీరు చెప్పే మాట వితండవాదం కాదా? " ప్రశ్నించింది రూపాదేవి.

"నేను చెప్పిన సమాన ప్రతిపత్తి బలాబలాలగురించి కాదు. అలా అయితే ఎంతో బలమైన ఏనుగు బలహీనమైన మనిషి చెప్పినట్టు చెయ్యడం మనం చూడ్డంలేదా? ప్రాతినిధ్యత గూర్చి నేను చెప్పాను, బలంగురించి కాదు" చెప్పింది అంజన.

"మీ మాటల్ని బట్టి చూస్తుంటే ఎంతో అపురూపంగా చూసుకునే వ్యక్తి మీకు భర్తగా లభించి ఉండాలి. యామైరైట్? " రూపాదేవి అడిగింది.

"ఇందులోనూ మీ అభిప్రాయం తప్పే. ఎందుకంటే ఒకవేళ మంచిభర్త లభించకపోతే మొత్తం పురుష సమాజంపైనే అసహ్యం పెంచుకోవడం సమంజసమంటారా? సమస్యని జాగ్రత్తగా పరిశీలించండి. న్యాయం మాట్లాడండి. వాదమనేది ప్రచండమైన సూర్యకాంతిపై కప్పబడిన ఓ మబ్బుతునకలాంటిది. కాలమనే గాలిపాటుకి చెల్లాచెదురవుతుంది. అంటే కాలానుగుణంగా ఎన్నో వాదాలు వస్తాయి పోతాయి. వాటి ఉనికి, శక్తి తాత్కాలికం. ధర్మం, సత్యం... ఇవి అఖండమైన తేజస్సులాంటివి. ఈ వాదాలూ, అభిప్రాయాలూ ఆ తేజస్సు ముందు అల్పమైనవి" చెప్పింది అంజనా శ్రీవాత్సవ.

★ ★ ★

'విజాతి ధృవాల నడుమ ఆకర్షణ ఉంటుందని శాస్త్రం చెబుతుంది. ఏదైతే అసంభవమని అందరూ ఊహించారో నేడదే సంభవమైంది. అవును... సంభవమైంది. రవికిరణ్ జర్మనీ నుండి రావడం, ఇరువర్గాల మధ్య సమాలోచనలు సాగడం, ఒక ఒప్పందం కుదరడం, టైముకి ముహూర్తాలు కుదరడం, రవికిరణ్ స్పందనల వివాహం జరిగిపోవడం .... అంతా ఒక ప్రణాళిక ప్రకారం చకచకా జరిగిపోయాయి.

ఒక ఒరలో రెండు కత్తులు ఇమడవంటారు. ఈ పెళ్లి అన్ని అనుమానాలకు, అపనమ్మకాలకూ, అభిప్రాయాలకు, అయిష్టాలకూ చరమగీతం పాడింది. నిజానికి రవికిరణ్, స్పందనల పెళ్లి నమ్మలేని ఓ నగ్న సత్యం. ఒక అద్భుతం. స్పందన స్నేహితురాలు సుమతి ఈ నిజాన్ని నమ్మలేకపోయింది. ఇతర స్నేహితురాళ్లు రేవతి, పద్మ, మాలతిలు స్పందన పెళ్లికొచ్చి వెళ్లారు.

రవికిరణ్‌తో స్పందన పెళ్లివార్త విని సంతోషంతో తలమునకలయింది రూపాదేవి. స్పందన తల్లితండ్రులయిన అన్నపూర్ణ, ప్రసాదరావులకయితే ఒకటే ఆనందం. స్నేహితుడు ప్రభాకరరావు తన విన్నపాన్ని గౌరవించినందుకు గర్వంతో పొంగిపోయాడు ప్రసాదరావు.

రవికిరణ్ ఫ్రెండ్ చక్రవర్తి ఫ్యామిలీతో సహా చెన్నై నుండి వచ్చి రవికిరణ్ దంపతుల్ని ఆశీర్వదించి వెళ్లాడు. ఎంతో వైభవంగా జరిగిన రవికిరణ్ వివాహానికి సిటీలోని ప్రముఖులందరూ వచ్చారు. అలాగే స్పందన పనిచేసే బ్యాంకులోని ఆమె కొలీగ్స్ అందరూ వచ్చారు. ఇండస్ట్రియలిస్టు మాధవరావు, జానకి దంపతులు కూడా వచ్చారు.

స్నేహితుడి కుమారుడి వివాహం మాధవరావుకి వేడుక కలిగించినా రవికిరణ్ణి తన కుమార్తె అపూర్వకు జోడీగా ఊహించుకున్న మాధవరావు భార్య జానకి అసంతృప్తికి లోనయింది.

పెళ్లికి అపూర్వ రాలేదు. రవికిరణ్తో తన వైవాహిక జీవితాన్ని ఎంతో అందంగా




ఊహించుకున్న అపూర్వ హృదయం గాయ పడింది. ఆమె కన్న పంచరంగుల కలలన్నీ కల్లలయిపోయాయి. రవికిరణ్ణి మానసికంగా ఆరాధించిన అపూర్వ రవికిరణ్ లేని తన భవిష్యత్ జీవితాన్ని ఊహించలేకపోతోంది.

పెళ్లికాకముందే ఎన్నో వ్యక్తిగత అభిప్రాయ భేదాలకు వేదికగా నిలిచిన వీరిద్దరి జీవితం రాబోయే భవిష్యత్తులో ఇంకెన్ని సంచలనాలకు కేంద్రమౌతుందో? ఏదేమైనా వైవాహిక పవిత్రబంధం వీరిద్దర్నీ ఒకచోట కలిపింది. ఊహకందని దాంపత్య జీవితానికి తెర లేచింది.

★ ★ ★

రవికిరణ్, స్పందనల శోభనపు రాత్రి. అదో విశాలమైన గది. ఎటు చూసినా మల్లెల తోరణాలే. అంతా పువ్వుల మయం. ఒక అద్భుతమైన సెంట్ వాసనతో గది గుబాళిస్తోంది. నిశ్శబ్దవాతావరణం. అన్ని పూలమధ్య డబుల్ కాట్ పై స్పందన కూర్చున్న దృశ్యం. అన్నీ రోజా పువ్వులున్న పూదోట మధ్యలో ఒకే ఒక మల్లెపూవున్నట్టుంది. గడియ పెట్టి మెల్లగా రవికిరణ్ తనవైపు రావడాన్ని గమనించింది స్పందన.

రవికిరణ్‌తో తన పెళ్లి ప్రపోజల్ నడిచినా తామిద్దరికీ ఇంత త్వరగా పెళ్లవుతుందని ఊహించలేదు స్పందన. 'మనచేతిలో ఏమీ లేదని' తన తల్లి అప్పుడప్పుడూ చెప్పడం గుర్తొచ్చిందామెకు.

"పిచ్చితల్లీ! రవికిరణే నీకు నిజమైన గిఫ్టమ్మా" అని తండ్రి చెప్పడం గుర్తొచ్చింది.

అంతెందుకు, తన ప్రాణస్నేహితురాలు సుమతి కూడా రవికిరణ్ణి ఎంతో వెనకేసుకొచ్చింది. తమ పెళ్లికొచ్చిన చాలామంది తామిద్దరి జంట ఎంతో ముచ్చటగా ఉందని చెప్పడం తన చెవులారా వింది.

తన స్నేహితురాళ్లు రేవతి, లేఖ, పద్మ "అదృష్టమంటే నీదేనే.. అందగాణ్ణి, కోటీశ్వరుడైన బిజినెస్ మాగ్నెట్‌ని పట్టేశావ్" అంటూ ఒకింత ఈర్ష్య ధ్వనించేలా చెప్పడం తను గమనించకపోలేదు.

"మీ ఆయన చాలా మంచివాడే. పీటల వరకూ వచ్చి ఆగిపోయిన నా పెళ్లిని తనే మధ్యవర్తిగా నిలబడి వేరే పెళ్లి చేశాడని, ధర్మాత్ముడనీ డాడీ ఎప్పుడూ అంటారు..." పద్మ మాటలు తన చెవుల్లో మార్మోగ సాగాయి.

రవికిరణ్ మంచివాడు. మనసున్న వ్యక్తి. ధర్మాత్ముడు, పుణ్యాత్ముడు. ఎదుటివారికి సాయపడే గుణం. ఇలా ఎవర్ని కదిలించినా రవికిరణ్ గొప్పతనం గురించి చెబుతుండగా తన ఒక్కత్తికి మాత్రం అతనెందుకని శత్రువులా, చెడ్డవాడిలా కనిపించాడు? అవసరానికి, మించి లేక అకారణంగా అతణ్ణి వేధించానా? స్పందన ఆలోచనలు ఈవిధంగా సాగుతుండగా....

"స్పందనా!" అని రవికిరణ్ ఆప్యాయంగా పిలిచాడు. కళ్లు నేలకు వాల్చింది స్పందన.

"స్పందనా! ఇంకా కోపం తగ్గలేదా? " అడిగాడు.

రవికిరణ్ అలా అడిగేసరికి స్పందన హృదయం కరగడం ప్రారంభించింది. స్పందన గెడ్డం కింద చెయ్యిపెట్టి ఆమె తల పైకెత్తాడురవికిరణ్. ఇద్దరి కళ్లూ కాసేపు మాట్లాడుకున్నాయి.

అతని చురుకైన చూపులకు స్పందించిన స్పందన అంతరంగం ఇక ఎక్కువసేపు రవికిరణ్‌తో బెట్టుచేసి ప్రయోజనం లేదనిపించి, ఊగిసలాడుతుండగా స్పందన భుజమ్మీద రవికిరణ్ చేయి వెయ్యడంతో ఆమె పెదవులు కంపించాయి. స్పందన పక్కనే డబుల్ కాట్ పై కూర్చున్నాడు రవికిరణ్. ఏవిధమైన తడబాటుకి లోనుకాక స్పందనని తన గుండెలకేసి సుతిమెత్తగా, ఆ తర్వాత గట్టిగా హత్తుకున్నాడు రవికిరణ్.

రవికిరణ్ కౌగిట్లో ఒదగడానికి సంకేతమన్నట్టుగా రవికిరణ్ వీపుని తన చేతుల్తో



చుట్టింది స్పందన. అదే అదనుగా స్పంద నని ముద్దుల్లో ముంచెత్తాడు రవికిరణ్. అతని చర్యలు ఆమెకు వింతయిన అనుభూతుల్ని, సుఖాన్ని, ఆనందాన్ని కలగజెయ్యసాగాయి. మెల్లగా స్పందన పట్టుని విడిపించుకుని ఆమెతో

"నేనడిగిన ప్రశ్నకు నువ్వు జవాబు చెప్పలేదు స్పందనా? " అడిగాడు.

"ఇది జవాబు కాకపోతే మరేంటి? " రవికిరణ్ణి అడిగిందామె, నవ్వుని అదిమిపెడుతూ.

"ఈ నిజం నేను నమ్మలేకపోతున్నాను" అన్నాడు.

ఏ నిజం? అన్నట్టు అతనివైపు చూసిందామె.

"అదే... నువ్వింత తొందరగా కరుణిస్తావన్న నిజం" అన్నాడు నవ్వుతూ.

"అవన్నీ ఇప్పుడెందుకు? పెళ్లికాకముందు జరిగిన విషయాలవి..." చెప్పింది.

"నా జర్మనీ ప్రోగ్రాం కనుక లేకుంటే మనిద్దరి పెళ్లి లాస్ట్‌మంత్‌లోనే జరిగుండేది..." స్పందనకు చెప్పాడు రవికిరణ్.

"మనిద్దరం మన పేరెంట్స్‌కు రుణపడి ఉన్నాం" అన్నాడు మళ్ళీ స్పందన నడుము చుట్టూ చెయ్యివేస్తూ.

"నాకు తెలుసు. మా డాడీ ప్రోద్బలం లేకుంటే ఈ పెళ్లి జరిగేది కాదు" చెప్పింది స్పందన.

"నీలాంటి అమ్మాయిని భార్యగా పొందడాన్ని నా అదృష్టంగా భావిస్తున్నాను" చెప్పాడు.

"ఎందుకు? "

"ఎందుకంటే కోపాన్ని, నిరసనని తెలియ చెయ్యడానికి నువ్వేమాత్రం మొహమాటపడవు. భయపడవు. నిజానికి ఎదుటి వ్యక్తిని తాత్కాలికంగా హర్ట్ చేసినా, మనసులో ఉన్నదున్నట్టు బయటకు చెప్పేవాళ్లంటే నాకిష్టం. అటువంటి వ్యక్తుల మనసుల్లో కల్మషం ఉండదు. కుట్రలుండవు. డేరింగ్ మనస్తత్వంతో, దూసుకెళ్లే తత్వంతో ఆధునిక మహిళకు ప్రతిరూపం నువ్వు స్పందనా! సెమినార్ అటెండ్ అవడానికి నేను జర్మనీ వెళ్లాక పురుషుల్తో సమానంగా స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను అనుభవించే అక్కడి స్త్రీలను చూసిన ప్రతిక్షణం నువ్వే గుర్తొచ్చేదానివి నాకు. ఇండియా వెళ్లగానే నిన్ను వివాహం చేసుకోవాలని అనుకున్నాను. మా పేరెంట్స్ కోరిక కూడా అదే. నీ ఉద్రేకాన్ని చూసి నేను తొలిరోజుల్లో విస్తుపోయినా పెళ్లి తర్వాత అంతా సర్దుకుంటుందని భావించాను. స్త్రీలు సహజంగా సున్నిత మనస్కులని, ఎంత ప్రేమించగలరో అంత ద్వేషించగలరనీ ఎక్కడో చదివాను. నీ వ్యక్తిత్వం నన్ను ఆకర్షించింది. అందం కూడా... కష్టపడి చదివి బ్యాంక్ ఆఫీసర్ ఉద్యోగం సాధించిన నీ పట్టుదల అబ్బురమనిపించింది. నేటి ఆధునిక సమాజంలోని యువతులకు నీవు ఓ ఆదర్శం స్పందనా!" అంటూ అభినందించాడు రవికిరణ్.

అటుపైన ఆమెను మెల్లగా మంచంపై పడుకోబెట్టి పక్కన చేరాడు. అతడు చెప్పినవన్నీ విన్నాక స్పందనలో అతడిపట్ల మరింత అనురాగం పెల్లుబికింది. ఆ శోభనపురాత్రిలోని ఒక్క నిముషాన్ని కూడా వృధా చెయ్యదలుచుకోలేదు వాళ్లు. ప్రేమ సామ్రాజ్యపు అంచుల్ని తాకారు.

★ ★ ★

ఇండస్ట్రియలిస్టు మాధవరావు ఇల్లు. సమయం ఉదయం తొమ్మిది గంటలు.

"ఈ టైముకి డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చుని నా గురించి వెయిట్ చేసే అపూర్వకి ఈరోజు ఏమైంది? రాత్రి లేటుగా నిద్రపోయిందా? లేక బ్రేక్‌ఫాస్ట్ అవసరం లేదా? " తన గడియారం వంక చూస్తూ భార్య జానకిని అడిగాడు మాధవరావు.

"అమ్మాయి ఉదయం ఆరుగంటలకే నిద్ర లేచింది" చెప్పింది జానకి.




"మరి..." అడిగాడు మాధవరావు.

"అపూర్వా..." కేక వేసింది జానకి.

అపూర్వ దగ్గర్నుంచి సమాధానం లేదు.

"పైన కూర్చుని ఏం చేస్తున్నావ్? మీ డాడీ నీ గురించి వెయిట్ చేస్తున్నారు" మళ్ళీ అరిచింది జానకి.

"వస్తున్నా..." అపూర్వ దగ్గర్నుంచి వచ్చింది జవాబు. మెట్లుదిగి వస్తున్న అపూర్వతో.

"అమ్మా అపూర్వా! ఈరోజు నీకేమైంది?" ఆశ్చర్యంతో అడిగాడు మాధవరావు.

తండ్రి కెదురుగా టేబిల్ దగ్గర కూర్చుని తన పేరెంట్స్‌ని ఓసారి చూసింది అపూర్వ. ఆమె కళ్లు ఎర్రబడి ఉన్నాయి. కొంచెం నీరసంగా ఉన్నట్టు కనిపించిందామె.

"అపూర్వా... నీ ఆరోగ్యం బాగోలేదా? డల్‌గా ఉన్నావ్" అటూ అపూర్వ నుదుటిపై అరిచేత్తో చెక్‌చేస్తూ అడిగాడు మాధవరావ్.

"అరె... లైట్ టెంపరేచర్ ఉన్నట్టుందే. జానకీ డాక్టర్ వసంత్‌కు ఫోన్ కలుపు" జానకితో అన్నాడు మాధవరావు.

"నో మమ్మీ... నాకు బాగానే ఉంది. అంతగా అయితే టాబ్లెట్ వేసుకుంటాను" ఫోన్ వద్దకెళ్ళబోతున్న జానకి చెయ్యి లాగుతూ అంది అపూర్వ.

"అపూర్వా... ఏదైనా ప్రాబ్లమా? ఈ డాడీ దగ్గర నువ్వేదో దాచాలని ప్రయత్నిస్తున్నట్టు నాకనిపిస్తోంది" చెప్పాడు మాధవరావు.

"అలాంటిమీలేదు డాడీ... ఆయామ్ ఆల్‌రైట్" చెప్పింది అపూర్వ.

"టిఫిన్ తీసుకో" చెప్పాడు. ఒక ఇడ్లీ మాత్రం తీసుకుందామె.

"నా అనుమానం నిజమే!" కాఫీ కలుపుతూ అంది జానకి.

"దేని గురించి?" భార్య జానకినడిగాడు మాధవరావు.

"ప్రభాకరరావుగారి అబ్బాయి రవికిరణ్ వెడ్డింగ్‌కార్డ్ వచ్చినప్పట్నుంచి అపూర్వ అదోలా ఉండటాన్ని నేను గమనించాను", చెప్పింది జానకి.

"అవునవును. పెళ్లిక్కూడా రాలేదు. ఏదో పనుందని చెప్పిందికదా!" అన్నాడు మాధవరావు.

"నేను మీకో విషయం చెప్పాలనుకుంటున్నానండీ. ఆరోజు మనింట్లో ఫంక్షన్ జరిగినప్పుడు, ప్రభాకరరావుగారి అబ్బాయి రవికిరణ్‌ని చూడగానే, అతడు మనమ్మాయి అపూర్వకు సరైన జోడీ అని నేను భావించాను. మీరు వారద్దరికీ పరిచయం చేయించినప్పుడు మనమంతా వాళ్ళకు అడ్డుగా ఉంటామని భావించి, నేనే మీ అందర్నీ పక్కకు తప్పించాను. రవికిరణ్, అపూర్వలకు ఏకాంతాన్ని కల్పించినట్టవుతుందని నేనే ఆ పని చేశాను. కానీ ప్రభాకరరావు తన కొడుకు పెళ్ళి ఇంత త్వరగా చేస్తాడని నేనూహించలేకపోయానండీ అదే నేను చేసిన తప్పు... లేక మన దురదృష్టమో! అలా జరిగింది. దీన్నిబట్టి చూస్తే మనమ్మాయి రవికిరణ్‌పై ఆశలు పెంచుకుందేమో అని నాకనిపిస్తోంది" బాధపడుతూ చెప్పింది జానకి.

"అలాగా నాకు తెలియకుండా ఇంత కథ నడిచిందా?" ఆశ్చర్యపోతూ అన్నాడు మాధవరావు.

"అపూర్వా... అమ్మ చెప్తున్నది నిజమా?" అపూర్వ నడిగాడు.

అంతే! అపూర్వ వెక్కి వెక్కి ఏడుస్తూ తల్లి జానకిని కౌగలించుకుంది. జానకి కళ్లు సజలమయ్యాయి. కూతురు అపూర్వని ఓదార్చసాగిందామె. ఈ దృశ్యం చూసిన మాధవరావు నిర్ఘాంతపోయాడు. "ప్రభాకరరావు నా స్నేహితుడు. గత పదిహేనేళ్ళుగా అతను నాకు పరిచయం. అప్పుడెప్పుడో పదిపదకొండేళ్ల వయసులో ఉన్నప్పుడు రవికిరణ్ణి చూశాను. అబ్బాయి బాగున్నాడు.

నిజమే. జానకీ! నాకు వంద పన్నులుంటాయి. కనీసం నువ్వయినా నాకప్పుడు ఎందుకని చెప్పలేదు? ఆరోజు వీలుకాకపోతే ఫంక్షన్ జరిగిన మరుసటి రోజు చెప్పాల్సింది. ప్రభాకర్రావు నా స్నేహితుడు. అతను నామాట కాదనేవాడు కాదు. ఇప్పుడంతా అయిపోయాక బాధపడి ప్రయోజనమేంటి? అమ్మా అపూర్వా! పిచ్చితల్లీ! నువ్వు రవికిరణ్ణి ప్రేమిస్తున్న విషయం కనీసం మీ అమ్మకైనా చెప్పకపోయావా? " అన్నాడు మాధవరావు.

"పోన్లే... రవికిరణ్ కాకపోతే, అతనికంటే మంచి అందగాడూ, ఆస్తిపరుణ్ణి నీకిచ్చి చేసే బాధ్యత నాది. సరేనా? రవికిరణ్‌కు పెళ్లయిపోతే వచ్చే నష్టమేంటీ? దేశంలో అబ్బాయిలకు కొదవుందా? " కూతురికి నచ్చచెప్పాడు మాధవరావు.

"డాడీ! నేను రవికిరణ్ణి మనస్ఫూర్తిగా ప్రేమించాను. అతనితో కలిసి నా జీవితాన్ని పంచరంగులమయంగా ఊహించుకున్నాను. రవికిరణ్ మంచి వ్యక్తి. నాతో చాలా ఫ్రీగా మాట్లాడేవాడు. తొందర్లోనే నేను రవికిరణ్‌కు నా ప్రేమ విషయం చెప్దామనుకున్నాను. కానీ నాది కేవలం ఒన్‌సైడెడ్ లవ్ అని రవికిరణ్ పెళ్లి తర్వాత తెలిసింది. నేను తప్పు చేశాను. రవికిరణ్ మనసులో ఏమున్నదీ తెలుసుకోలేకపోయాను. అంతా నా ఖర్మ... నా జీవితంలో మొదటిసారిగా నేను అభిమానించిన వ్యక్తి అతడు. నా మనసుని ఏరోజైతే రవికిరణ్‌కు అంకితం చేశానో ఆరోజే నేనూ రవికిరణ్ వేరు వేరు కాదని భావించాను. డాడీ! మీరు ఎన్ని సంబంధాలయినా తీసుకురాగలరు కానీ రవికిరణ్ణి మాత్రం తీసుకురాలేరు కదా? నా మనసుని రవికిరణ్‌కి చ్చేసి నేను వేరే వ్యక్తిని పెళ్లి చేసుకుని సుఖంగా ఎలా ఉండగలను? ఈ హృదయంలో కేవలం ఒక్క రవికిరణ్‌కే చోటుంది. రవికిరణ్ నాకు దక్కినా దక్కకపోయినా నా హృదయంలో వేరే వ్యక్తికి చోటులేదు" చెప్పింది అపూర్వ.

"పిచ్చిదానిలా మాట్లాడకు. పెళ్లయిపోయాక ఇక రవికిరణ్ నీవాడు ఎలా అవుతాడు? ఒక పెళ్లయిపోయిన వ్యక్తి గురించి ఇలా అతిగా ఊహించుకోవడం సభ్యత కాదు. అతని దారి వేరు, నీ దారి వేరు. నోర్మూసుకుని డాడీ చెప్పినట్టు విను.." కూతుర్ని మందలించింది జానకి.

"అవునమ్మా.... నీకు తగిన వరుడితో నీ వివాహం జరిపిస్తానని చెప్పాకదా! ఇక నువ్వు రవికిరణ్ గురించి మర్చిపో. అప్పుడే నీకు మనశ్శాంతి..." మాధవరావు అన్నాడు.

"ప్లీజ్ డాడీ! నాక్కొంత వ్యవధివ్వండి. రవికిరణ్ణి మరిచిపోగలనేమో ప్రయత్నిస్తాను. నా ఆలోచనల్లోంచి, నా మనసులోంచి నా హృదయంలోనుండి అతని జ్ఞాపకాల్ని చెరిపివేయగలనేమో ప్రయత్నిస్తాను. దయచేసి అప్పటిదాకా నాపెళ్లి ప్రస్తావన తీసుకురావద్దు..." వేడుకుంది అపూర్వ.

తమ ఒక్కగానొక్క కూతురికి ఈ విధమైన పరిస్థితి ఎదురైనందుకు మాధవరావు, జానకి దంపతులు బాధపడ్డారు. అపూర్వ చెప్పింది నిజమే అని భావించిన ఆ ఇద్దరూ మౌనం వహించారు. కాలమే అన్ని సమస్యల్ని పరిష్కరిస్తుందని భావించి ఊరడిల్లారు.

★ ★ ★

"అయామ్ సారీ జానకి గారూ! ఈరోజు సాయంత్రం నేను చాలా బిజీగా ఉన్నాను. ఒక పెద్ద ఫంక్షన్ ఆర్గనైజ్ చెయ్యాలి" రూపాదేవి జానకితో అంది.

"ఏమిటా ఫంక్షన్? " జానకి అడిగింది.

"అనాథ పిల్లలకు బట్టలు, ఇతర వస్తువులు ఇంకా రిఫ్రెష్‌మెంట్స్‌ని డిస్ట్రిబ్యూట్ చెయ్యాలి.." చెప్పింది రూపాదేవి.

"బైదిబై ఈ అమ్మాయి మీ డాటర్ అపూర్వ అనుకుంటాను.." జానకి పక్కనున్న అపూర్వని గమనించి చెప్పింది రూపాదేవి.




అవునంది జానకి.

"నమస్తే మేడమ్..." అంది అపూర్వ.

తలూపింది రూపాదేవి.

అపూర్వకి రిలీఫ్‌గా ఉంటుందని ఒక ఔట్‌డోర్ ప్రోగ్రాం ప్రపోజ్ చేసింది జానకి. ఇంతలో జానకిని కలవడానికి రూపాదేవి రావడంతో తనని కూడా రమ్మంది. ఓ ఫంక్షన్‌కు వెళ్లాల్సిఉందని రూపాదేవి చెప్పింది.

"పోనీ మేం ఆ ఫంక్షన్‌కు రావచ్చా?" అడిగింది జానకి.

"ష్యూర్. వైనాట్? మీరిద్దరూ తప్పక రావొచ్చు. ఫంక్షన్ ఈవినింగ్ ఫైవ్‌కు మొదలవుతుంది. ఇంకా ఆ ఫంక్షన్‌కు అటెండవుతున్న డిగ్నిటరీస్ గురించి చెప్పాలంటే సెక్రటరీ ఫర్ ఛైల్డ్ అండ్ సోషల్ వెల్‌ఫేర్, డిస్ట్రిక్ట్ కలెక్టర్, మున్సిపల్ కమీషనర్ అండ్ ఫంక్షన్‌ని స్పాన్సర్ చేస్తున్న కిరణ్ అండ్ కిరణ్ ఇండస్ట్రీస్ ఎం.డి మిస్టర్ రవికిరణ్"

రూపాదేవి నోటంట రవికిరణ్ పేరు వినగానే జానకి అపూర్వ వైపు చూసింది. అపూర్వ కళ్లు మిలమిలా మెరిశాయి.

"సారీ.. మేం ఫంక్షన్‌కు... " జానకి చెప్పేలోగానే

"వస్తున్నాం..." పూర్తిచేసింది అపూర్వ. జానకి సైలెంటయిపోయింది.

"రవికిరణ్ అంటే?" రూపాదేవినడిగింది జానకి.

"ఎస్. రవికిరణ్.. ఎ నైస్ జెంటిల్ మాన్... చాలాచాలా మంచివ్యక్తి. ఇటీవలే అతనికి మ్యారేజ్ అయింది. నాకో అనుమానం. రవికిరణ్ మీకు తెలియకపోవడమేమిటి? మీరు నిర్వహించిన అపూర్వ ఇండస్ట్రీస్ ఫంక్షన్లో... ఆరోజు మీ డాటర్ అపూర్వతో రవికిరణ్ మాట్లాడుతూండగా నేను చూశాను. అతనారోజు మీ అతిథుల లిస్ట్‌లో ఉన్నాడు. కావాలంటే ఒకసారి చెక్ చేస్కోండి" చెప్పింది రూపాదేవి.

సమాధానం కోసం తడుముకోవడం జానకి వంతయింది.

"మేడమ్... టీ తీసుకోండి" చెప్పింది అపూర్వ.

ఫంక్షన్ అయిపోయాక కూతురు అభ్యర్థనపై జానకి ఒకతే కారు తీసుకునివెళ్ళిపోయింది. రూపాదేవి కూడా వెళ్ళిపోయింది.

తన కారు వద్దకెళ్తున్న రవికిరణ్‌ను పలకరించింది అపూర్వ. అపూర్వని గమనించిన రవికిరణ్ ఆశ్చర్యానికి గురై మాటలు కరువయ్యాయి అతనికి.

"అపూర్వ... మీరిక్కడ?" అన్నాడు రవికిరణ్ తడబడుతూ.

"అవును... మమ్మీతో కలిసి ఫంక్షన్‌కొచ్చాను. రూపాదేవిగారు ఇన్‌వైట్ చేశారు. మీరు స్టేజ్‌పై ఉన్నారుకదా! కిందివాళ్ళని గమనించి ఉండరు"

ఉద్దేశపూర్వకంగానే చెప్పింది అపూర్వ. అపూర్వ మాటల్లోని అంతరార్థం కోసం వెతకసాగాడు రవికిరణ్.

"మీరేదో నా మీద కోపంగా ఉన్నట్టు కనిపిస్తున్నారు. మీకిష్టమైతే మనిద్దరమలా కూల్‌డ్రింక్ ఏదైనా తాగుతూ మాట్లాడుకుందాం. అన్నట్టు మీకారేదీ?" అడిగాడు రవికిరణ్.

"మమ్మీ తీసుకెళ్లిపోయింది" చెప్పింది అపూర్వ.

"మిమ్మల్నిలా ఒంటరిగా వదిలి ఎలా వెళ్లారు?" అడిగాడు.

"మీరున్నాక నేను ఒంటరినెలా అవుతాను?" ఎదురు ప్రశ్నించింది. గుమ్మడికాయల దొంగెవరంటే బుజాలు తడుముకున్నట్టుంది రవికిరణ్ పరిస్థితి.

"మిమ్మల్ని ఫస్ట్‌టైమ్ కలిసినప్పట్నుంచీ గమనిస్తున్నాను. మీరు భలే గమ్మత్తుగా మాట్లాడతారు. రండి కారెక్కండి" డోర్ తీస్తూ అన్నాడు.

రవికిరణ్ పక్కన కూర్చుంది అపూర్వ. కారు బయలుదేరింది. ట్రాఫిక్ గమనిస్తూ

రోడ్డుపై దృష్టి నిలిపి, తనతో మాట్లాడుతూ డ్రయివ్ చెయ్యసాగాడు రవికిరణ్. అప్పుడు టైం రాత్రి ఏడున్నరవుతోంది. రవికిరణ్‌ని గమనించింది అపూర్వ. గాలికి అతని క్రాఫ్ విడిపోయి హెయిర్ నుదుటిని చుంబి స్తోంది. నవ్వుతున్నాడు. చాలా హాపీగా కనబడుతున్నాడు. వైట్ కలర్ సూట్‌లో అందంగా ఉన్నాడు రవికిరణ్. పక్కపక్కనే ఉన్నా తామిద్దరి మధ్య ఎంతో దూర ముంది. ప్చ్.. బ్యాడ్‌లక్! అతని భార్య నయ్యే అదృష్టాన్ని కోల్పోయాను. అదే రవి కిరణ్ భార్యనైవుంటే ఒకరి శరీరాల్ని వేరొ కరు స్పర్శిస్తూ నవ్వుతూ, తుళ్లుతూ ఆ కారు ప్రయాణమే ఎంతో థ్రిల్లింగ్‌గా ఉంటుంది. ఆ అదృష్టం తనకేదీ? భగవాన్ నా తల రాతెందుకిలా రాశావ్? అని మనసులో బాధపడింది అపూర్వ.

"అతని పెళ్లయిపోయాక అతని దారివేరు నీ దారి వేరు. ఓ పెళ్లయిన మగాడి గురించి ఆలోచించడం తప్పు" తన పేరెంట్స్ చెప్పిన మాటలు గుర్తొచ్చాయి అపూర్వకు. ఆమె ఆలోచనలీ విధంగా సాగుతుండగా రవికిరణ్ కారుకి సడెన్ బ్రేక్ వెయ్యడంతో అపూర్వ అతని ఒళ్లో కొచ్చి పడింది. మళ్లీ యధాప్రకారంగా కూర్చుంది అపూర్వ సిగ్గుపడుతూ.

"అయామ్ సారీ అపూర్వగారూ!" నొచ్చు కున్నాడతను.

"ఫర్వాలేదు. సడెన్‌బ్రేక్ ఎందుకేశారు?" అడిగింది అపూర్వ.

"కారొకటి ఓవర్‌టేక్ చేసింది. ఇడియట్' ' తన కారుని ఓవర్‌టేక్ చేసిన డ్రయివర్‌ని తిట్టుకుంటూ అన్నాడు రవికిరణ్.

"పోనీలెండి అతనికేదైనా అర్జెంటు పనుం దేమో" అంది.

"ఎంత అర్జెంటయితే మాత్రం లెఫ్ట్ నుంచి ఓవర్‌టేక్ చేస్తాడా? ఎదుటి వ్యక్తి గురించి ఆలోచించకపోతే ఎలా?" అన్నాడు రవికిరణ్ కోపంగా.

'అవును రవికిరణ్... మీరు నిజంగా చెప్పారు. మీ గురించి మీ వెనుక ఉన్న పరి స్థితుల గురించి నేను ఆలోచించలేకపో యాను. కానీ మీరేం చేశారు? నా గురించి ఆలోచించకపోవడం మీరు చేసిన తప్పు కాదా? నా మనసుని మీరు అర్థం చేసుకో లేకపోయారు. మనిద్దరికీ సుదీర్ఘమైన పరి చయం లేకపోయినా మీ సమక్షంలో నేనభ వించిన ఆనందం అపూర్వమైనది. అనిర్వచ నీయమైనది' స్పీడ్ బ్రేకర్స్‌లేని ప్లెయిన్ రోడ్డులా అపూర్వ ఆలోచనలు పరిగెడుతూ ఉన్నాయి.

రవికిరణ్ కారు ఓ రెస్టారెంట్‌లోకి మెల్లగా ప్రవేశించింది.

"మీరేం తీసుకుంటారు?" మెనూ కార్డ్ అపూర్వ దగ్గరికి నెడుతూ అన్నాడు.

"కూల్‌డ్రింక్ అని మీరే చెప్పారుకదా!" అంది అపూర్వ.

"అంటే కూల్‌డ్రింక్ తాగేముందు ఏదైనా తింటారా? అని నా ఉద్దేశం" అన్నాడు.

"వద్దు..." చెప్పింది అపూర్వ.

వెయిటర్‌కు రెండు ఫాంటా తెమ్మని చెప్పాడు రవికిరణ్.

"అన్నట్టు నా పెళ్లికి మీరు రాలేదు" అడి గాడు.

"ఇంకేదైనా మాట్లాడండి. ప్లెజంట్‌గా ఉన్న ఇటువంటి వాతావరణంలో మీ పెళ్లి ప్రస్తావనెందుకు?" అంది అపూర్వ ఎటో చూస్తూ.

"చాలా డిఫరెంట్ పర్సనాలిటీ మీది" అన్నాడు రవికిరణ్.

"ఎందుకని?" అడిగింది.

"లేకపోతే ఏమిటండీ? నా పెళ్లి వార్త మీకు ముఖ్యమైన విషయం కాదా?" అడి గాడు చిరుకోపంగా.

"మిమ్మల్ని చేసుకున్న వారికి, మీకు పెళ్లి చేసిన వాళ్లకి అది ముఖ్యమైన వార్తవుతుం దేమోకానీ నాకెలా అవుతుంది?" అడిగింది.

"అంటే మీ దృష్టిలో ముఖ్యమైన విషయ




మంటే ఎలా ఉంటుంది? " అన్నాడు.

"ఇలా మీతో గడపడం నా దృష్టిలో ఎంతో ముఖ్యమైన, ఎంతో ప్రాధాన్యతగల విషయమని నేను భావిస్తాను" చెప్పింది అపూర్వ.

అపూర్వకేం చెప్పాలో వెంటనే తట్టలేదు రవికిరణ్‌కు.

"డ్రింక్ తీస్కోండి.. వేడెక్కిపోతుంది" ఆటపట్టిస్తూ అంది అపూర్వ.

"అపూర్వగారూ! మీ మాటల్లో ఇదివరకటి సౌమ్యత కనబడ్డంలేదు" అన్నాడు రవికిరణ్ డ్రింక్ తీసుకుంటూ.

"అంత కఠినంగా మాట్లాడుతున్నానా? కేవలం నా మాటలే మీకింత కఠినంగా అనిపిస్తే మీ చేతలు నా హృదయాన్ని, నా మనసుని, నా ప్రేమని నిలువునా రెండుగా చీల్చేశాయి. మరి నేను దానికెంత బాధపడి ఉండాలి? " ఎంత వద్దనుకున్నా, ఎంతగా నిగ్రహించుకోవాలనుకున్నా తన అంతరంగాన్ని దహించి వేస్తున్న విషయాన్ని బయటకు కక్కేసింది అపూర్వ. ఆమె కళ్లు స్రవించసాగాయి. తనపై ఉన్న ఓ పెద్ద బరువు దిగిపోయినట్టు తేలికగా ఫీలయింది అపూర్వ. అపూర్వ మాటలకు, తాగుతున్న చల్లని డ్రింక్ వేడిగా, వెగటుగా అనిపించి గొంతులోనుండి కిందికి దిగలేదతనికి.

"అపూర్వా!" అన్నాడు రవికిరణ్ ఆశ్చర్యంతో కళ్లు పెద్దవి చేస్తూ.

"నువ్వు చెప్పేది నిజమా? " అడిగాడు.

రవికిరణ్‌కు జవాబివ్వలేదు అపూర్వ. ఆమె కళ్లనుండి కన్నీళ్లు ధారాపాతంగా వర్షిస్తూనే ఉన్నాయి.

"నీ ప్రేమ విషయం నాతో నీవు ఎందుకు చెప్పలేదు? " అడిగాడు.

"మీ మనసులో నాకంటే ముందు ఇంకో అమ్మాయి ఉన్నట్టు నాకు తెలీదుగా" చెప్పింది అపూర్వ.

"ఫూలిష్‌గా మాట్లాడకు. ఇంతవరకు నేను ఏ అమ్మాయినీ ప్రేమించలేదు. మా పెళ్లి ఓ అరేంజ్డ్ మేరేజ్. నా భార్య పేరు స్పందన. స్పందన నాన్నగారూ, మా డాడీ చిన్నప్పటి క్లాస్‌మేట్స్" చెప్పాడు రవికిరణ్.

"అయామ్ వెరీసారీ అపూర్వా! గతంలో నా ప్రవర్తన నీలో ఆశల్ని రేకెత్తించి ఉంటే నన్ను క్షమించు" అన్నాడు.

"ప్రేమ అనేది ఎప్పుడూ ఇరువైపులా ఉండాలి. ప్రేమించిన వ్యక్తి ఎదుటి వ్యక్తికి ఆ విషయాన్ని వెంటనే చెప్పెయ్యాలి. అంతేగానీ తన ప్రేమ విషయం తన లోపలే ఉంచుకుని గుడ్డిగా మూగగా ఎదుటి వ్యక్తిని ఆరాధిస్తూ ఉండటంవలన నష్టమే కానీ లాభముండదు" చెప్పాడు రవికిరణ్.

"నా మాటలు, ప్రవర్తన మీకు నా ప్రేమ సందేశాన్ని అందించలేదా? " అడిగింది అపూర్వ.

"డోన్ట్ బి సిల్లీ అపూర్వా ఒకటి రెండు పరిచయాలకే స్టోరీలో అంత డెవలప్‌మెంట్ ఉంటుందా? ఈ విషయంలో నువ్వు ఫాస్టేమోకానీ నా వరకు నేనైతే చాలా స్లో" చెప్పాడు రవికిరణ్.



"రవికిరణ్" భర్త కాలర్ సరిచేస్తూ అంది స్పందన ముద్దుగా. అప్పటికే

స్పందన నడుం చుట్టూ రవికిరణ్ చేతులు న్నాయి. స్పందన బుగ్గపై ముద్దుపెట్టుకు న్నాడతను "ఊ" పలికాడు.

"డాడీ మమ్మీ గుర్తొస్తున్నారు" చెప్పింది.

"అలాగే కారు తీసుకుని వెళ్లు. డ్రైవర్ సాంబయ్య ఉంటాడు" చెప్తూ స్పందన పెద వులందుకున్నాడు. కాస్సేపు సహకరించింది స్పందన. తర్వాత రవికిరణ్ పెదవుల్నుండి విడివడి "మనిద్దరం వెళదాం" చెప్పింది.

స్పందన మెడ భాగంలో పెదవుల్తో రుద్ద సాగాడు రవికిరణ్.

"నేను చెప్పింది వినబడిందా?" అడిగింది చిరుకోపంగా. స్పందన మాటలు వినిపించు కునే స్థితిలో లేడతను. మెడ నుంచి కిందికి దిగాడు.

స్పందన పైట జారింది. ఆమె ఎదని తన ముఖంకేసి గట్టిగా అదిమాడు.

"పట్టపగలు ఏమిటిది?" అడిగింది స్పందన.

"కొత్తగా పెళ్లయిన పడుచు జంటకి పగలూ రాత్రి అని తేడాలుంటాయా?" అడి గాడు.

"కిరణ్మయి కాలేజ్ కెళ్లింది. మమ్మీడాడీ ఎక్కడికో పనిమీద వెళ్లారు. ఈ విశాలమైన బంగళాలో మనిద్దరమే ఉన్నాం. నువ్వు కోపరేట్ చేస్తే ఆనంద రసకేళిలో ఓసారి ఓలలాడుదాం" చెప్పాడు రవికిరణ్.

"ఏం పాపం? ఈ రోజు తమరికి ఫ్యాక్టరీ కి వెళ్లే ఉద్దేశం లేదా?" అడిగింది.

"నేనింట్లో ఉన్నా ఫ్యాక్టరీలో ఉన్నట్టే" అన్నాడు రవికిరణ్.

"అదెలా"

"ఎక్కడున్నా ప్రొడక్ట్ తీయడమేకదా చెయ్యాల్సింది" స్పందన వైపు కొంటెగా చూస్తూ అన్నాడు.

"ఏయ్ చిలిపి" అంది రవికిరణ్ జుట్టు లాగుతూ. అంతే! వారి బెడ్‌రూమ్ తలు పులు క్లోజ్ చెయ్యబడ్డాయి. అప్పుడు ఉదయం పదింబావు అవుతోంది. స్పందన కట్టుకున్న చీర మొత్తం లాగేశాడు రవికి రణ్.

"ఉదయమే కదా స్నానం చేసింది. రవికి రణ్... మళ్లీ ఏంటిది?" రవికిరణ్ణి అల్లుకు పోతూ అంది.

"ఇది స్పెషల్ వర్క్‌గానీ అన్నట్టు ఆఫీ సుకు ఎప్పటివరకూ లీవుపెట్టావ్?" స్పందన రహస్యాల్ని ఛేదిస్తూ అడిగాడు.

"ఇంకో వారం రోజులు" చెప్పింది.

"వెరీగుడ్.. అయితే మనకీ వారమంతా డే సెషన్స్ అన్నమాట" అన్నాడు.

"వేరే పనేముంది?" మొట్టికాయవేస్తూ చెప్పింది.

అప్పుడే మళ్లీ స్నానం చేసి వచ్చారిద్దరూ. తల తుడుచుకుంటోంది స్పందన. స్పందన నడుంచుట్టూ చేతుల్ని బిగించి తన వైపు లాగాడు రవికిరణ్.

స్పందన్ని కూర్చోబెట్టాడు ఆమె కళ్లలోకి అలాగే కొద్ది సెకన్లు చూశాడు. స్పందన కూడా రవికిరణ్ కన్నుల్లోకి ఆరాధనాపూర్వ కంగా చూసింది.

"ఏంటలా చూస్తున్నారు?" అడిగింది.

"నువ్వు నువ్వేనా?" అడిగాడు.

"నాకర్థం కాలేదు" అంది స్పందన.

"స్పందనా నీకు గుర్తుందా? ఆ రోజు అన్నపూర్ణ హోటల్ ఎదురుగా మన తొలి కలయికప్పుడు నువ్వేమన్నావో నీకు గుర్తుందా?" అడిగాడు రవికిరణ్.

"ప్లీజ్ రవికిరణ్... మళ్లీ ఎప్పటికీ మన పెళ్లికి ముందు జరిగిన విషయాల గురించి ప్రస్తావించొద్దు. మిమ్మల్ని, మీ ఫీలింగ్స్‌ని నేను చాలా హర్ట్ చేశాను. అయామ్‌సారీ ఫర్ ఎవ్విరిథింగ్. రవికిరణ్... నాకు కోప మెక్కువ. ఆ కోపంలో, ఆవేశంలో నేనేం మాట్లాడతానో, ఏం చేస్తానో నాకే తెలీదు. అందుకే అమ్మానాన్నా ఎప్పుడూ నన్ను మందలిస్తూ ఉంటారు" చెప్పింది స్పందన.

"నా మీద నీ అభిప్రాయమేంటి?" అడి గాడు.




"మిమ్మల్ని చేసుకున్నాకే ప్రేమ, ఆప్యాయత, మంచితనం యొక్క విలువ నాకు తెలిసింది. మీతో నా పెళ్ళి జరిపించి మా పేరెంట్స్ నాకు ఓ కొత్త జీవితాన్ని ప్రసాదించారు. రియల్లీ రవికిరణ్... మీరు నావంటి వారికి దొరకాల్సిన వ్యక్తికాదు. అది కేవలం నా అదృష్టం మాత్రమే. మిమ్మల్ని చాలా బాధించాను. ప్లీజ్ నన్ను క్షమించండి" రవికిరణ్ ఒళ్ళోకి వాలిపోతూ చెప్పింది స్పందన. ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

"నోనో భార్యాభర్తల మధ్య ఈ క్షమాపణలేమిటి? ప్రేమ, అనురాగం, ఆప్యాయతలు తప్ప మన మధ్య ఇంకేమీ ఉండకూడదు ఓకే! ఆ పద పద... మీ మమ్మీ డాడీల్ని చూడాలన్నావ్‌కదా! మనిద్దరం కలిసి వెళదాం" చెప్పాడు రవికిరణ్.

"ఓహ్ డాడీ చెప్పినట్టు నాకు మీరు నిజంగా ఓ గిఫ్ట్‌లాంటివారు. భగవంతుడిచ్చిన కానుక" రవికిరణ్ణి కౌగలించుకుంటూ చెప్పింది స్పందన.

★ ★ ★

"చెప్పవే... మరిప్పుడేమంటావ్? " స్పందనని నిలదీసి అడిగింది సుమతి.

"నిజంగా నేను రవికిరణ్ణి అపార్థం చేసుకున్నాను సుమతీ! రవికిరణ్ ఇంత మంచివాడని నిజంగా నాకు తెలీదు సుమా" చెప్పింది.

"అందుకే తొందరపడి ఒక వ్యక్తిపై వాస్తవం కాని అభిప్రాయాన్ని ఏర్పరచుకోవడం తప్పని నీకింతకుముందే చెప్పాను" అంది సుమతి.

"నువ్వన్నది నూటికి నూరు పాళ్లు నిజం. అన్నట్టు నీకిప్పుడు ఎంత జీతమిస్తున్నారు? నీ జీతం పెంచమని రవికిరణ్‌తో చెప్తాను' ' అంది స్పందన.

"తన బాధ్యతలేమిటో ఎదుటి మనిషి చేత చెప్పించుకునే వ్యక్తికాదు రవికిరణ్" చెప్పింది సుమతి.

"రవికిరణ్ణి నాకంటే బాగా స్టడీ చేసినట్టున్నావే" నవ్వుతూ చెప్పింది స్పందన.

"మీ మేరీడ్‌లైఫ్ ఎలా ఉందే? అసలు మీరిద్దరూ కలిసి ఒక దగ్గర కూర్చుని హేపీగా మాట్లాడుకున్నారా లేదా? " అనుమానంగా అడిగింది సుమతి.

"అంత అనుమానమెందుకొచ్చిందే నీకు? నీ అనుమానాన్ని పటాపంచలు చేసే నిజమొకటి చెప్పమంటావా? నిజంగా మేమెంతో హ్యాపీగా వున్నాం" చెప్పింది స్పందన నవ్వుతూ.

"నిజంగానా? అయితే ఏడాది గడిచేసరి కల్లా..." అంటూ చెప్పబోయిన సుమతితో,

"ఛీ పోవే" అంటూ చిన్నగా సుమతిని కసిరింది స్పందన.

"కాఫీ తీసుకో" సుమతికో కప్పు అందించి తనోటి తీసుకుంది.

"నీ పెళ్లెప్పుడు సుమతీ? " అడిగింది స్పందన.

"ఇంకా ఆ టైమ్ రాలేదనుకుంటున్నాను" చెప్పింది సుమతి.

"డోన్ట్‌వర్రీ సుమతీ... రవికిరణ్‌కు చెప్పి నీకో మంచి సంబంధాన్ని చూసే బాధ్యత నాది, సరేనా? " అంది స్పందన.

"కట్న కానుకలు మాత్రం ఇవ్వలేము" అంది సుమతి.

"నీకా భయమెందుకే? ది గ్రేట్ ఇండస్ట్రియలిస్ట్ రవికిరణ్‌గారి భార్య మిసెస్ స్పందనా రవికిరణ్ లాంటి ఫ్రెండ్ నీకుండగా" అభయమిస్తూ చెప్పింది స్పందన.

"రియల్లీ" నవ్వాపుకోలేకపోయిన సుమతి నవ్వుతో స్పందన శృతి కలిపింది.

★ ★ ★

"దిసీజ్ టూమచ్ సిస్టర్. నాకు మాట మాత్రమైనా చెప్పకుండా, చివరకు శుభలేఖ కూడా పంపకుండా స్పందన పెళ్లి చేసేశావ్. కనీసం నీ రక్తం పంచుకు పుట్టిన నీ తమ్ముడొకడు ఈ భూమ్మీద ఇంకా బతికే ఉన్నా

# ఏరిన ముత్యాలు

* సంస్కృతిని ఎంత అధికంగా విధ్వంసం చేసినా సరే, దానిని చరిత్రనుంచి వేరు చేయడం సాధ్యం కాదు. దానిని పునరుద్ధరించడం కూడా కష్టమే.

–లెనిన్

* మర్రి విత్తనమంత చిన్న పద్యంలో మహావృక్షమంత అర్థాన్నివ్వగలవాడే గొప్పకవి.

–బైరన్

* రాజు ముఖ్యంగా సింహాన్ని, నక్కను అనుకరించాలి. రెండింటి లక్షణాలనూ అలవరుచుకోవాలి.

–మేకియవెల్లి

* ఆత్మవిశ్వాసమే వ్యక్తికి అద్భుతమైన ప్రేరణనిస్తుంది.

–జాన్ మిల్టన్

* సాహిత్యమందిరంలో ఐశ్వర్యాన్ని ప్రేమించేవారికి స్థానంలేదు.

–ప్రేమ్‌చంద్

* జీవితం మీ చేతుల్లో ఉండాలంటే ఈ ప్రపంచమనే బృహద్గ్రంథాన్ని తీవ్రంగా అధ్యయనం చేయాలి.

–లార్డ్ చెస్టర్ ఫీల్డ్

* అంగవైకల్యం ఏర్పడితే మనిషి నష్టపోయేది ఏంలేదు. మనసు ధైర్యాన్ని కోల్పోయి మూగదైతే అంతా పోగొట్టుకున్నట్టే భావించాలి.

–ముల్క్ రాజ్ ఆనంద్

* ఏ నమ్మకం లేనివాడు జీవం లేని శరీరం వంటివాడు.

–మార్క్ ట్వైన్

* నీ గురించి జనం మంచిగా చెప్పుకోవాలంటే, నిన్ను గౌరవించాలంటే ఆత్మస్తుతి మానెయ్యాలి.

–విశ్వేశ్వరయ్య

* మన సంపాదన కన్నా మనం పొదుపు చేసిన డబ్బే మనల్ని ధనవంతులుగా చూపెడుతుంది.

–వాల్టర్ సావేజ్

* నిజం తరుచుగా ఆలశ్యంగానే వెలుగులోకి వస్తుంది.

–గెలిలియో

* అపజయానికి క్రుంగి పోకుండా ధైర్యంగా ఎదుర్కోవడమే అతిగొప్ప సాహసం.

–హ్యూగో

సేకరణ: పట్నం శేషంశెట్టి

డని ఒక్కసారైనా నువ్వు ఆలోచించావా? కనీసం బావయినా నా గురించి ఆలోచించి బాధపడ్డాడా? లేదు. మీరిద్దరూ కలసి కుమ్మక్కయిపోయి నాతో కలసి ఏడు అడుగులు నడవవలసిన స్పందనని ఎవరికో దిక్కూ మొక్కూ లేని వాళ్లకిచ్చి పెళ్లి చేశారు. అదే అమ్మ బతికుంటే ఇలా జరగనిచ్చేదా? అంతా నా దురదృష్టం" ముక్కు చీదుతూ అన్నాడు అన్నపూర్ణ తమ్ముడు గోపాల్రావ్.

"నోర్మూసుకుని జాగ్రత్తగా మాట్లాడు వెధవా... దిక్కూ మొక్కూ లేని వాళ్లకిచ్చి చేశారన్నావంటే నీ నాలిక చీరేస్తాను. దాని అదృష్టం బాగుండటం చేత, మీ బావగారి ప్రయత్నం వలన అందగాడు, పారిశ్రామికవేత్త స్పందనకు భర్తగా లభించాడు" తమ్ముడితో చెప్పింది అన్నపూర్ణ.

"అయినా సినిమాఫీల్డంటూ పదిహేనేళ్ల క్రితం వెళ్లిపోయావు నువ్వు. ఇలా సడెన్‌గా ఊడిపడ్డం తప్పించి ఏనాడైనా ఓ ఉత్తరం ముక్క మాకు రాశావా? పోనీ నీకైనా అప్పుడప్పుడూ ఓ ఉత్తరం రాద్దామనుకుంటే నీ అడ్రసేది? ఓ నిలకడంటూ లేకుండా ఈ రోజు చెన్నై, రేపు బెంగుళూరు, ఎల్లుండి ముంబాయిలో తేలతావు. నీకే బతికేందుకు ఓ పర్మినెంట్ ఉద్యోగంలేదు. ఇక నీ ముఖానికి స్పందనెందుకు?" కసురుకుంది అన్నపూర్ణ.

"అన్నపూర్ణా.... ఎవర్ని తిడుతున్నావ్?" అప్పుడే వచ్చిన అన్నపూర్ణ భర్త ప్రసాదరావు అడిగాడు.

"నమస్కారం బావగారూ..." ప్రసాదరావుని విష్ చేశాడు గోపాల్రావ్.

గోపాల్రావుని ఎగాదిగా చూసింతర్వాత కాసేపు ఆలోచించి "కొంపదీసి నువ్వు మా గోపాలానివైతే కాదుకదా" అడిగాడు ప్రసాదరావు అనుమానంగా.

"మీ జ్ఞాపకశక్తికి జోహార్ బావగారూ.. అక్షరాలా నేను మీ బావమ్మర్ది గోపాలాన్నే" ఇకిలిస్తూ అన్నాడు గోపాల్రావ్.

"కొంపదీసి నువ్వు డైరెక్ట్ చేసిన సినిమా ఏదైనా హిట్టయిందా ఏమిటి? హఠాత్తుగా ఇలా దయచేశావ్" అన్నాడు ప్రసాదరావ్.

"మీరిలాగే నన్ను ఎగతాళి చేస్తూ ఉండండి బావగారూ! నవ్విన నాప చేనే పండుతుందన్నట్టు ఏదో ఒకనాడు ఆంధ్రదేశాన్ని ఒక్క కుదుపు కుదిపే సినిమాని డైరెక్ట్ చేసే అవకాశం నాకు రాకపోదు" చెప్పాడు గోపాల్రావ్ పైకి చూస్తూ.

"ఏడిశావ్... ఆ అవకాశం నీకొచ్చే లోపలే ముసలోడివైపోయి ఆ ఉన్న పళ్లు కాస్తా ఊడిపోతాయి. ఇకనైనా మించిపోయింది లేదు. ఆ సినిమా ఫీల్డు చుట్టూ తిరగడం మానేసి సలక్షణంగా ఏదైనా ఉద్యోగం చూస్కుని, పెళ్లి చేస్కుని ఓ ఇంటివాడివై స్థిరపడు. బతికుంటే ఓ నాలుగు అక్షింతలేస్తాం" కండువాని దులుపుతూ అన్నాడు ప్రసాదరావు.

"అంతేనంటారా?" అడిగాడు అసహాయంగా.

"అంతకాకపోతే మరేమిట్రా? వెళ్లి కాళ్లూ చేతులూ కడుక్కురా భోజనం వడ్డిస్తాను" చెప్పింది అన్నపూర్ణ.

"నీ చేతి వంట తిని ఎన్ని సంవత్సరాలైందక్కా. ఆగు ఇప్పుడే కాళ్లూచేతులూ శుభ్రం చేసుకు వస్తాను" చెప్పాడు గోపాల్రావ్.

తన తమ్ముడికి కొసరికొసరి వడ్డించింది అన్నపూర్ణ. కడుపునిండా సుష్టుగా భోంచేసి బ్రేవ్‌మంటూ తేన్చాడు గోపాల్రావ్.

సోఫాలో కూర్చుని భుక్తాయాసం తీర్చుకుంటూ "అక్కయ్యా... ఇంతకీ ఈ సిటీలో స్పందన ఎక్కడుంది? వెళ్లి మాట్లాడతాను" అన్నాడు పొట్ట నిమురుకుంటూ.

"ఆ పని మాత్రం చెయ్యకు. దడుచుకుంటుంది" అన్నాడు ప్రసాదరావు.

ఎందుకన్నాడు గోపాల్రావ్.

"కాకపోతే మరేమిటి? ముందా సోడా

బుడ్డి కళ్లద్దాలు మార్చుకో. నున్నగా షేవింగ్ చేసుకో. మంచి ఇస్త్రీ చేసిన బట్టలు వేసుకో. ఆ తర్వాత స్పందన అడ్రసు గురించి ఆలోచిద్దాం" అన్నాడు ప్రసాదరావు.

"నువ్వు నా అప్పియరెన్స్ చూసి పొరబడ్డావు బావా! దీన్ని మేధావుల గెటప్ అంటారు" అని చెబుతున్న గోపాల్రావుకి నాలుగు తగిలిద్దామని లేచాడు ప్రసాదరావు.

★ ★ ★

స్పందన తన మెట్టినింట్లో అందరితో కలిసిపోయింది. తన సత్ప్రవర్తనతో తనూ ఆ ఇంటి సభ్యురాలిగా మారిపోయింది. స్పందన గురించి రవికిరణ్ చెప్పిన మాటల్తో స్పందనపై అపోహలు పెంచుకున్న ప్రభాకర్రావుకు తన అభిప్రాయం తప్పని తెలిసింది. అంతేకాదు స్పందన విషయంలో రవికిరణ్ కూడా అపోహపడ్డాడేమో! అని భావించాడు ప్రభాకరరావు. మంచి అమ్మాయి తమకు కోడలిగా లభించినందుకు సంతోషించింది దమయంతి. కిరణ్మయి అయితే ఇరవై నాలుగ్గంటలూ వదినా వదినా అంటూ స్పందన చుట్టూ తిరగసాగింది.

ఓరోజు కూతురు, అల్లుడు కలసి తమ ఇంటికి రావడంతో నిజంగా అన్నపూర్ణ, ప్రసాదరావులకు ఆ రోజు పండుగ రోజే అయింది. స్పందనా, రవికిరణ్‌ల అన్యోన్యత గమనించిన అన్నపూర్ణ, ప్రసాదరావులు సంతోషం పట్టలేకపోయారు. పెళ్లికిముందు గడుసమ్మాయిలా ప్రవర్తించినా భర్తతో ఎంతో ప్రేమగా ప్రవర్తిస్తూ మెట్టినింట్లో తమ పేరు నిలబెట్టిన తన కూతురు స్పందనని గమనించి ఆశ్చర్యంతో ముక్కున వేలేసుకుంది అన్నపూర్ణ. తన తల్లిని కౌగలించుకుని గడగడా మాట్లాడుతున్న స్పందనని అలాగే చూస్తూ చాలాసేపటి దాకా అన్నపూర్ణకు మాట పెగల్లేదు. తమ కూతురు




స్పందనని తన స్నేహితుడి కుమారునితో పెళ్లి జరిపించి తన భర్త ప్రసాదరావు సరైన నిర్ణయం తీసుకున్నాడని అన్నపూర్ణ పొంగిపోయింది.

స్పందన ప్రాణ స్నేహితురాలు సుమతి కూడా స్పందనలో వచ్చిన మార్పుని గమనించి సంతోషించింది. రవికిరణ్ స్పందనని పెళ్లి చేసుకోవడాన్ని రవికిరణ్ స్నేహితుడు చక్రవర్తి జీర్ణించుకోలేకపోయాడు. ఒకరోజు హోటల్లో రవికిరణ్‌ని కలవడానికొచ్చిన అపూర్వని గమనించిన చక్రవర్తి "రవికిరణ్, అపూర్వలు ప్రేమించుకుంటున్నారు. త్వరలో పెళ్లి చేసుకుంటారేమో" అని భ్రమపడ్డాడు.

ఏ సంగతెలా ఉన్నా రవికిరణ్, స్పందనల దాంపత్యబంధం ఎక్కువకాలం నిలవదు అనడానికి నిదర్శనంగా కడివెడు పాలలో చిటికెడు విషంలా పచ్చని ఆ సంసారంలో చిచ్చుపెట్టిన ఓ సంఘటన రూపుదిద్దుకుంది. ఆ సంఘటనతో ప్రేమకు, శాంతికి, అనురాగానికి నిలయమైన స్పందనా రవికిరణ్‌ల పవిత్ర వైవాహిక బంధం అశాంతికి, అపార్థాలకు, అసహనాలకు దారితీసింది.

★ ★ ★

కిరణ్ అండ్ కిరణ్ ఇండస్ట్రీస్ యం.డి. రవికిరణ్ ఛేంబర్స్. బయట సమయం ఉదయం పదకొండవుతోంది. సుమతి ఏదో ఫైల్ పరిశీలిస్తోంది. ఇండస్ట్రీ ప్రెమిసెస్ లోకి ఓ ఫోర్డ్ కారు ప్రవేశించింది.

కాసేపయ్యాక తనెదుట నిలబడ్డ ఓ అప్సరసలాంటి యువతిని సుమతి తలెత్తి చూసింది. ఎవరీ అందగత్తె? సుమతి ఆలోచిస్తుండగా,

"రవికిరణ్ గారున్నారా? " చిరునవ్వు చిందిస్తూ సుమతి నడిగిందామె.

రవికిరణ్ అంటూ పేరుపెట్టి పిలుస్తోంది. బహుశా రవికిరణ్ తెలుసునేమో? ఆమె గెటప్ చూస్తే అఫీషియల్ పనిమీద వచ్చినట్టు మాత్రం కనబడ్డంలేదు. అయినా

తనకెందుకు పెద్దవాళ్ల విషయాలు? అని భావించిన సుమతి "ఉన్నారు మీ విజిటింగ్ కార్డేదైనా ఇస్తే నేను సార్‌కు చెబుతాను" అంటున్న సుమతితో,

"అవసరంలేదు, థాంక్యూ" అంటూ యం.డి ఛేంబర్స్ డోర్ తీసుకుని లోపలికి వెళ్లిందామె.

ఆమె వెళ్లినవైపే ఆశ్చర్యంగా చూస్తుండి పోయింది సుమతి.

ఛేంబర్స్ ఇన్‌సైడ్‌లో...

"ఓహ్.. అపూర్వా! వాటెసర్‌ప్రయిజ్? కమ్ కమ్.. టేక్ యువర్‌సీట్" అపూర్వని వార్మ్‌గా రిసీవ్ చేసుకున్నాడు రవికిరణ్.

"థాంక్స్" నవ్వుతూ కూర్చుందామె.

"ఏమిటీ రోజు పొద్దున్నే గుర్తొచ్చానా నేను? " అడిగాడు.

"మీరు చెప్పిన మాట మరచిపోయేవాళ్లకి వర్తిస్తుందది" చెప్పింది.

"అంటే" అడిగాడు అర్థంకాక.

"ఇరవై నాలుగ్గంటలూ నా మనసులోనే కదా మీరుండేది" రవికిరణ్ కన్నుల్లోకి తన చూపుల్ని ఎక్కుపెట్టి చెప్పింది.

"పెళ్లయిపోయిన వాళ్లక్కూడా నీ హృదయంలో స్థానముంటుందా? " అడిగాడు.

"మీ వివాహాన్ని నేను గుర్తించడంలేదు" అంది.

"గుడ్‌జోక్... పెళ్లి చేస్కోవాలని ఓ అమ్మాయి అబ్బాయి రిజిస్ట్రార్ ఆఫీస్‌కెళ్లినప్పుడు అతను చెప్పవలసిన మాటలివి" క్లాప్స్ కొడుతూ అన్నాడు రవికిరణ్ నవ్వుతూ.

"నేనన్నా నా మాటలన్నా మీకు మొదట్నుంచి చిన్నచూపేకదా!" చిన్నబుచ్చుకుంటూ చెప్పింది అపూర్వ. మగవాణ్ణి పడకొట్టే ఓ చిన్నసైజు అస్త్రంలాంటి మాట అది. రవికిరణ్‌పై ఆ అస్త్రాన్ని అపూర్వ గురిచూసి వదిలినా తృటిలో అది తప్పిపోయింది.

"ఆయామ్‌సారీ అపూర్వా! నీ మనసు నొప్పించాలని నా ఉద్దేశంకాదు. నీది చిన్నపిల్లల మనస్తత్వం ఏమో అని ఒక్కోసారి నాకు అనిపిస్తూ ఉంటుంది. ఎప్పుడేం మాట్లాడతావో, ఎప్పుడెలా ప్రవర్తిస్తావో అంచనా వెయ్యలేకపోతున్నాను" చెప్పాడు రవికిరణ్.

"ఏం తీసుకుంటావో చెప్పు? ఫస్ట్ టైమ్ నా ఆఫీసుకొచ్చావ్" అపూర్వ నడిగాడు.

"మీ ఇష్టం" అంది.

రెండు కూల్‌డ్రింక్స్ పంపమని ఇంటర్‌కమ్‌లో చెప్పాడు రవికిరణ్.

"ఈ శారీలో చాలా అందంగా ఉన్నావు అపూర్వా! నువ్వు ఊ అనాలేకానీ నేను ఈ ఫ్యాక్టరీ పనులన్నీ పక్కనపెట్టి నీకు ఓ మాంచి వరుణ్ణి వెతికిపెట్టేస్తాను ష్యూర్" అన్నాడు.

"ఈ డైలాగ్ అరిగిపోయింది కానీ ఏదైనా కొత్త విషయం చెప్పండి" అంది తన మెళ్లోని నెక్లెస్‌ని సరిచేసుకుంటూ.

పొద్దున్నే దయచేసి బుర్ర పాడుచేస్తోంది. పోనీ వెళ్లమని చెబితే సభ్యతగా ఉండదు. ఇదెక్కడి గొడవ? నేను పెళ్లయినవాణ్ణి. నన్ను వదిలెయ్ అన్నా వినేట్టు లేదే? ఈమె కోరుకోవాలేకానీ పెళ్లికాని కుర్రవాళ్లు లైను కట్టరూ. పోయిపోయి నా వెంటపడుతుందేమిటి? చివరికి ఇది ఏ పరిస్థితులకు దారితీస్తుందో? ఇలా తన మనసులో అనుకోసాగాడు రవికిరణ్.

"నా అభిప్రాయం ప్రకారం నువ్వు మీ డాడీకి ఫ్యాక్టరీ విషయంలో చేదోడు వాదోడుగా ఉంటూ బిజినెస్ వ్యవహారాలపై నీ మనసుని లగ్నం చేస్తే బాగుంటుందని అనుకుంటున్నాను. అలా చెయ్యడంవల్ల అపూర్వా ఇండస్ట్రీస్ రెప్యుటేషన్ పెరుగుతుంది. నీకు మనశ్శాంతి ఉంటుంది. రెండు విధాలా బెనిఫిటన్నమాట. అంతే కాదు అపూర్వా నువ్వు ఎం.బి.ఎ చదువుకున్నావు. ఇలా చెయ్యడంవల్ల నీ చదువుకి సార్థకత కూడా లభిస్తుంది. ఏమంటావ్? " అడిగాడు.

"కాలేజీలో లెక్చరర్, ఉద్యోగానికి మీరు సరిగ్గా సరిపోతారు" చెప్పింది నవ్వుతూ.

తెల్లమొహం పెట్టాడు రవికిరణ్. అంత కష్టపడి ఓపిగ్గా తనిచ్చిన సలహాని ఓ పూచికపుల్లలా తీసిపారేసిందేమిటి? అసలు ఈమె ఉద్దేశమేంటి? తన నుండి అపూర్వ ఏం ఆశిస్తోంది. పెళ్లయిన మగవాడంటే సాధారణంగా అమ్మాయిలు పట్టించుకోరు. పెదవి విరుస్తారు. కానీ అపూర్వేంటి చాలా డిఫరెంట్‌గా ప్రవర్తిస్తోంది. అపూర్వ అంతరంగాన్ని అంచనా చెయ్యడానికి ప్రయత్నించసాగాడు రవికిరణ్.

సరిగ్గా ఇదే సమయంలో రవికిరణ్ ఆఫీస్ బయట "సుమతీ ఏం చేస్తున్నావ్?" నవ్వుతూ సుమతిని పలకరించింది స్పందన.

"మేడమ్ మీరా?" ఉలిక్కిపడి లేచి నించుంటూ సుమతి చెప్పగానే అక్కడున్న అందరూ వరుసగా లేచి నిలబడ్డారు.

"గుడ్‌మార్నింగ్ మేడమ్" స్టాఫంతా స్పందనని విష్ చేశారు.

"గుడ్ మార్నింగ్... కూర్చోండి కూర్చోండి" చెప్పింది స్పందన.

సుమతి చెవి మెలిపెట్టింది స్పందన. "ఎవరే నీకు మేడమ్?" చిన్నగా సుమతిని అడిగింది నవ్వుతూ.

"అవును మేడమ్! ఇది ఆఫీసు, ఇక్కడ మీరు మా ఎం.డి.గారి వైఫ్... మిసెస్ స్పందనా రవికిరణ్. అంటే మీరయినా, ఎం.డి గారైనా మా దృష్టిలో సేమ్. ఇక మన ఫ్రెండ్‌షిప్ అంటారా ఇది ఆఫీసు ప్రెమిసెస్ బయట. మనిద్దరం క్లాస్‌మేట్స్‌మి, క్లోజ్ ఫ్రెండ్స్‌మి" చెప్పింది సుమతి.

"పోవే" అంటూ సుమతి చెంపపై ముద్దుగా చరిచింది స్పందన.

ఇంతలో అటెండర్ రెండు థమ్సప్ బాటిల్స్‌ని ట్రేలో ఉంచుకుని రవికిరణ్ ఛేంబర్‌లోకి వెళ్లడం గమనించిన స్పందన సుమతితో "ఎం.డి గారు బిజీనా?" అడిగింది.

ఏం జవాబు చెప్పాలో వెంటనే సుమతికి తట్టలేదు.

"బిజినెస్ మీటింగా?" మళ్లీ అడిగింది సుమతిని.

"అ...అ... అవును" చెప్పింది సుమతి స్పందన కళ్లలోకి అమాయకంగా చూస్తూ.

"ఏమైందే నీకు? అలా నంగి మాటలు మాట్లాడతావేం? ఎం.డి.గారి పర్సనల్ సెక్రటరీ అంటే ఎలా ఉండాలి? ఫాస్ట్‌గా, షార్ప్‌గా ఉండాలి అవునా?" అడిగింది స్పందన.

"అ... అ.. అవును" మళ్లీ తడబడింది సుమతి.

స్పందనకు సుమతి ప్రవర్తనపై అనుమానమొచ్చింది. ఇలా అడిగి లాభం లేదనుకుని "మిస్ సుమతీ!" గద్దించింది ఓ అధికారిలా.

"ఎస్ మేడమ్" వెంటనే పలికింది సుమతి అటెన్షన్‌లో.

"దట్స్ గుడ్" సుమతిని మెచ్చుకుంటూ.

"ఎం.డి గారు ఎవరితో మాట్లాడుతున్నారు?" అడిగింది స్పందన.

"ఎ... ఎవరో అమ్మాయి" అంది సుమతి.

"అమ్మాయా? ఎవరైతే ఏంటి? ఏదో బిజినెస్ విషయమై ఉంటుంది" అంటూ రవికిరణ్ ఛేంబర్ వైపు అడుగులు వెయ్యసాగింది స్పందన.

సుమతి మనసెందుకో కీడుని శంకించసాగింది. తన ఎడమ చేత్తో డోర్ ఓపెన్ చేసింది స్పందన. అంతే! తను చూస్తున్న ఆ దృశ్యాన్ని తనే నమ్మలేకపోయింది స్పందన. అదే క్షణంలో ఆకాశం రెండుగా చీలిపోయి ఉంటే బాగుండుననిపించింది. తను నిలబడ్డ నేల తెరవబడి తను అందులో భూస్థాపితం అయి వుంటే అంత కన్నా మించిన అదృష్టం లేదనిపించింది.




తన నమ్మకాన్ని ముక్కలకింద ఎవరో ఖడ్గంతో తెగ్గొట్టారనిపించింది. నిజమా? ఇది నిజమా? తన కళ్లు తన మస్తిష్కానికి చేరవేస్తున్న సంకేతం కరెక్టేనా? భగవాన్ నేనేం తప్పు చేశానని నా మీద పగతీర్చుకున్నావు? అంటూ స్పందన అంతరంగం చెల్లాచెదురై రోదించింది. ఆ దృశ్యాన్ని చూసిన మరుక్షణమే అంతే వేగంతో తలుపు మూసి ఆఫీసు బైటికి ఉక్రోషంతో తలవంచుకుని పరుగులాంటి నడకతో వెళ్లిపోతున్న స్పందనని చూసి సుమతే కాదు స్టాఫంతా ఆశ్చర్యచకితులై చూస్తుండిపోయారు.

అందరి మనసుల్లో ఒకటే ప్రశ్న. కొన్ని నిముషాల క్రితం తన భర్త పర్సనల్ సెక్రటరీతో నవ్వుతూ మాట్లాడింది ఈమేనా? ఏం జరిగుంటుంది? స్పందన ఏం చూసి ఉంటుంది? సుమతి ఆలోచనలీవిధంగా సాగుతుండగా యం.డి ఆఫీసు తలుపులు తెరవబడ్డాయి. ఎం.డి. రవికిరణ్ ముందుగా బైటికొచ్చాడు. అతని ముఖంలో ప్రశాంతతలేదు. అతని వెనుకే ఆమె బైటికొచ్చింది. రవికిరణ్ చేతులు విదిలిస్తూ ఆమెతో 'ఏదో మాట్లాడసాగాడు. ఆమె తన నుదుటిపై పడుతున్న జుట్టుని ఎడమచేత్తో పైకి తోసుకుంటూ రవికిరణ్‌ని కన్విన్స్ చెయ్యాలని ప్రయత్నించసాగింది. రవికిరణ్ తల అడ్డంగా ఊపుతున్నాడు. వడివడిగా అడుగులేసుకుంటూ రవికిరణ్ బైటికెళ్లిపోయాడు. ఆమె కూడా రవికిరణ్ణి ఫాలో అయింది. తన కారు స్టార్ట్ చేసి వేగంగా దుమ్ములేపుకుంటూ బైటికెళ్లిపోయాడు రవికిరణ్. వెళ్లిపోతున్న రవికిరణ్ వైపే దీనంగా చూస్తూ నిట్టూర్పులు విడిచి తన కారు డోర్ తెరిచింది ఆమె. తర్వాత మెల్లగా ఆ కారు కిరణ్ ఇండస్ట్రీస్ ప్రెమిసెస్ నుండి బయటపడింది.

జరిగిన సంఘటన గుర్తొచ్చి రవికిరణ్‌కు చెమటలు పట్టాయి. ఎంత పని జరిగింది? స్పందన ఏమనుకుందో ఏమో? స్పందన ముఖకవళికల్ని ఆమె కన్నుల్లోని ఎర్రజీరల్ని గమనించాడు రవికిరణ్. తప్పకుండా స్పందన తామిద్దర్నీ అపార్థం చేసుకుని ఉంటుంది. స్పందనేకాదు తామిద్దర్నీ ఆ స్థితిలో చూసిన ఎవరైనా అపార్థం చేస్కుంటారు. ఇంతకీ స్పందన చూసిన ఆ దృశ్యం యొక్క వివరాల్లోకెళితే

"నీ మాటల్ని బట్టి చూస్తుంటే నే చెప్పిన హితబోధలేవీ నీ తలకెక్కలేదనిపిస్తోంది" డ్రింక్ సిప్ చేస్తూ అపూర్వతో అన్నాడు రవి కిరణ్.

"హితబోధలకోసం నేను మీ దగ్గరకు రాలేదు. అవే అవసరమనుకుంటే మా ఇంట్లో బోలెడు భక్తి పుస్తకాలున్నాయి" రవి కిరణ్ రియాక్షన్ గమనిస్తూ చెప్పింది అపూర్వ థమ్సప్ తాగుతూ.

"చూడు అపూర్వా మనిద్దరి కుటుంబాల యొక్క రిలేషన్స్ బావున్నాయి. సో మా డాడీ మీ డాడీ ఫ్రెండ్స్. నీ శ్రేయోభిలాషిగా నీకంతా మంచే జరగాలని నేను కోరుకుంటున్నాను" చెప్పాడు రవికిరణ్.

"అంటే మీ ఉద్దేశమేంటి? నేను పనీ పాటా ఏమీ లేకుండా మీ దగ్గరకు వచ్చానను కున్నారా? పర్టిక్యులర్‌గా నేను మిమ్మల్ని కలవడానికి మీ ఆఫీసుకు ఎందుకొచ్చాను? ఊహించారా మీరు? " అడిగింది.

లేదంటూ తల అడ్డంగా ఊపాడు రవికిరణ్.

"రేపు నా బర్త్‌డే. ఆ విషయం మీకు చెబ్దామని వచ్చాను. నాకున్న ఫ్రెండ్స్‌లో మీరు నా బెస్ట్ ఫ్రెండ్. అదీగాక నేను మిమ్మల్ని నా మనసారా..." అంటున్న అపూర్వ మాటలకు అడ్డుపడ్తూ

"నిజంగానా అపూర్వా... అయితే నీ బర్త్ డేకి అడ్వాన్స్ విషెస్ అందుకో మెనీ మెనీ..." అని అపూర్వతో నవ్వుతూ కరచాలనం చేస్తున్న వాడల్లా "అబ్బా" అంటూ తన కుడి కన్నుపై చేయి పెట్టుకుని బాధతో మూలిగాడు రవికిరణ్. రవికిరణ్ అలా

బాధపడేసరికి విలవిల్లాడిపోయింది అపూర్వ. తన కంటిపై చెయ్యి అలాగే పెట్టుకుని రివాల్వింగ్ ఛెయిర్‌ని కుడివైపు తిప్పుకుని కాళ్లు రెండూ బార్లా జాపి తన కుర్చీలో రిలాక్సయ్యాడు రవికిరణ్.

"రవికిరణ్ మీకేమైంది? " అంటూ గాబరాగా తన కుర్చీలోంచి లేచి రవికిరణ్ దగ్గరికెళ్లి రవికిరణ్ రెండు కాళ్ల మధ్య నించుని రవికిరణ్‌పైకి వంగింది అపూర్వ.

"ఏం లేదు. కంట్లో నలక పడిందేమో" అన్నాడు. రవికిరణ్ ముఖానికి తన ముఖం ఆనించి రవికిరణ్ కుడికంటిని పరిశీలించసాగింది అపూర్వ. అపూర్వ చొరవకు ఇబ్బంది ఫీలయ్యాడు రవికిరణ్. కంప్లీట్‌గా రవికిరణ్‌పై బెండ్ అయిపోయి ఉన్న అపూర్వ, రవికిరణ్‌ను ముద్దుపెట్టుకుంటున్నట్టే ఉంటుంది చూసేవాళ్లకు. అదే క్షణంలో ఎండి ఛేంబర్ మెయిన్‌డోర్ తెరుచుకుంది. ఆ చప్పుడుకు రవికిరణ్ ముఖం నుండి ఎంట్రెన్స్ వైపుకి తల తిప్పింది అపూర్వ.

ఎవరేమో? అనుకుంది ముఖాన్ని చిట్లించుకుని. రవికిరణ్ తల తిప్పి చూశాడు ఆమెవైపు. అంతే! న్యూక్లియర్ బాంబు బర్స్ట్ అయింది.

★ ★ ★

"అమ్మా... అమ్మా" బయట్నుంచే కేకలు వేస్తూ ఇంట్లోకి వెళ్లాడు రవికిరణ్. కిచెన్‌లో ఉన్న దమయంతికి రవికిరణ్ గొంతులా వినిపించి బయటికొచ్చింది.

తల్లిని చూడగానే "అమ్మా స్పందనొచ్చిందా? " అని అడిగాడు గాబరాగా. తన కొడుకు కంగారుపడ్డం చూసి దమయంతి ఒకింత విస్తుపోయి,

"రాలేదు బాబూ! స్పందన యూరప్ టూర్ విషయం గురించి నీతో ఏదో మాట్లాడాలంటూ బయలుదేరింది. ఫ్యాక్టరీకి రాలేదా? " అడిగింది.




"వచ్చింది" అన్నాడు రవికిరణ్ ఎటో చూస్తూ.

"మరి స్పందనేదీ అని అడుగుతావేం? అదిగో కారొచ్చింది. ఎందుకలా కంగారుపడుతున్నావ్? " చెప్పింది దమయంతి.

కారులో స్పందనలేదు. తల్లీకొడుకులు ఆశ్చర్యపోయారు.

"చిన్నమ్మగారు వాళ్లింట్లో దిగిపోయారు. కారు తీసుకెళ్లమని చెప్పారు" డ్రయివర్ సాంబయ్య చెప్పాడు. అయిపోయింది. తానూహించినదే జరిగింది. తనని స్పందన అపార్థం చేసుకుంది. ఇప్పుడు స్పందనకు అర్థమయ్యేలా ఎలా చెప్పడం? అసలే ఆమెకు కోపమెక్కువ. అపూర్వా... నా కొంప కూల్చావుకదే! స్పందన తనని క్షమించదు. ఎవరు ఏం చెప్పినా వినదు. జగమొండి. ఇదంతా అపూర్వతో తాను కఠినంగా ప్రవర్తించనందుకు లభించిన ఫలితమా? అవును... ముమ్మాటికీ! అపూర్వతో తాను నిక్కచ్చిగా ప్రవర్తించి ఉంటే ఈ రోజు ఈ పరిస్థితి ఎదురయ్యేది కాదు కదా! అంటే ఇది స్వయంకృతాపరాధమా? అవును... ఖచ్చితంగా! ఇలా రకరకాలుగా రవికిరణ్ ఆలోచనలు పరిగెడుతున్నాయి.

అపూర్వంటే తనకెందుకు అభిమానం? అపూర్వంటే తనకెందుకంత ఆపేక్ష? ఆమె పట్ల తనలో ఏదో ఓ మూల సాఫ్ట్ కార్నర్ లాంటిది.. నోనో అలాంటిదేమీ లేదు. మరి? ఏమిటీ డబుల్ స్టాండర్డ్స్? ఎందుకంటే తన జీవితంలో మొదటిసారిగా తనతో ప్రేమగా, వాత్సల్యంగా ఆపేక్షతో మాట్లాడిన మొదటి అమ్మాయి అపూర్వ! అదే.. అదే! తాను అపూర్వ దగ్గర కరిగిపోవడానికి కారణమదే! తాను అపూర్వతో కఠినంగా వ్యవహరించకపోవడానికి కారణమదే! కానీ ఎంతదాకా? ఎప్పటిదాకా? తనకు పెళ్లయినంత వరకే కదా! పెళ్లి తామిద్దరి మధ్య అడ్డుగోడ లాంటిది కదా! పెళ్లంటే ఒక కమిట్‌మెంట్ ఏర్పరచుకున్నట్టేకదా! స్పందనతో తన పెళ్లయ్యాక తాను

అపూర్వతో సాన్నిహిత్యాన్ని కలిగి ఉండటం ఆ కమిట్‌మెంట్‌ని ధిక్కరించడం కాదా?

"ఏమైంది రవికిరణ్? స్పందనా, నువ్వు ఏద్దైనా విషయం గురించి గొడవపడ్డారా?" ఆదుర్దా ధ్వనించింది దమయంతి మాటల్లో.

"లేదు మమ్మీ..." నేలని చూస్తూ అన్నాడు.

"నీ ముఖమే చెప్తోందిరా నువ్వు అబద్ధం చెబుతున్నావని... అమ్మ దగ్గరెందుకు నిజాన్ని దాచిపెట్టాలని ప్రయత్నిస్తున్నావ్..." దమయంతి కోపంగా అంది.

"ఏం లేదు మమ్మీ. ఖంగారుపడాల్సింది ఏమీలేదు. స్పందనకూ, నాకూ మధ్య ఏ గొడవా జరగలేదు" విసుగ్గా అన్నాడు.

"చూడు ఒక అబద్ధం చెప్పి తప్పించుకోవాలని చూసినా, దాన్ని కప్పి పుచ్చడానికి వెయ్యి అబద్ధాలు చెప్పాల్సి వస్తుంది. అయినా నిన్ను అడిగి ప్రయోజనం లేనప్పుడు కోడల్నే అడుగుతాను" చెప్పింది.

"ప్లీజ్ మమ్మీ... నేనున్నా కదా, నేను చూసుకుంటాను. డాడీ ఎక్కడికెళ్ళారు?" తల్లినడిగాడు రవికిరణ్.

"ఎవరో లేబర్ ఆఫీసర్‌ని కలవాలని వెళ్ళారు" చెప్పింది.

"మళ్ళీ ఎక్కడికెళ్తున్నావ్? ఫ్యాక్టరీకా?" అడిగింది దమయంతి.

"లేదు... కొంచెం అర్జెంట్ వర్క్ ఉంది" అంటూ తల్లికి చెప్పి గేటు బయటే పార్క్ చేసిన తన కారు వద్దకెళ్ళాడు రవికిరణ్.

రవికిరణ్ కారు ప్రసాదరావు ఇంటివైపు దూసుకుపోయింది. అప్పటికే జరిగిన విషయం తన తల్లిదండ్రులతో చెప్పింది స్పందన. వ్యసనపరుడైన తన భర్త రవికిరణ్‌తో ఇకపై జీవితాన్ని పంచుకోలేనని చెప్పింది. తమ కూతురు చెప్పిన విషయం విన్నాక ఒకరి ముఖాలు మరొకరు చూసుకున్నారు ఆ దంపతులు. తొందరపడవద్దని స్పందనతో చెప్పాడు ప్రసాదరావు.

"రవికిరణ్ ఇంద్రుడు, చంద్రుడు అని చెప్పింది మీరేకదా. దీన్నిబట్టి చూస్తే ఆరోజు స్పందన రవికిరణ్‌ల మధ్య జరిగిన గొడవను పరిశీలిస్తే మనమ్మాయే కరెక్టనిపిస్తోంది నాకు. మీరు తొందరపడి రవికిరణ్ గురించి అపోహపడ్డారండి. ఈ డబ్బున్న వాళ్ళంతా ఇలాగే ఉంటారు. వారితో కావాలని మనం సంబంధాలు కలుపుకోవడం మన తప్పే అవుతుంది. ఇప్పుడేమిటి చెయ్యడం? ముందు నుయ్యి వెనుక గొయ్యిలా వుంది మన పరిస్థితి. అమ్మాయికేం చెప్పాలో అర్థం కావడంలేదు. అసలే దానికి సహనం తక్కువ. అయినా అల్లుడికిదేం బుద్ధి? పెళ్ళయి పదిరోజులు కూడా కాలేదు. మనమ్మాయి భవిష్యత్తేంటి? అడ్డమైనవాళ్ళతో తిరిగేవాడు పెళ్ళి ఎందుకు చేసుకున్నాట్ట? పెళ్ళాం ఉసురుపోసుకోవడానికి కాకపోతే..." ఇలా అన్నపూర్ణ తన నిరసన వ్యక్తంచేస్తూనే వుంది.

"స్పందనా... స్పందనా..." ప్రసాదరావు ఇంట్లోకి వెళుతూ పిలిచాడు రవికిరణ్.

"ఆగు లోపలికి రాకు" అంటూ గర్జించింది స్పందన.

గడపకి ఇవతలే ఆగిపోయాడు రవికిరణ్.

చీరకొంగుని బొడ్లోకి దోపుతూ రవికిరణ్ పైకి కాళికలా దూసుకొచ్చింది స్పందన. ఎర్రగా నిప్పులు కక్కుతున్న స్పందన కళ్ళు చూసి వెనక్కి తగ్గాడు రవికిరణ్.

"పద... ఇంటికెళదాం" చెప్పాడు.

"ఏ ఇంటికి?" అడిగింది.

"మనింటికి... నీ భర్త ఇంటికి..." అన్నాడు.

"నా భర్త చనిపోయాడు" చెప్పింది.

ఉలిక్కిపడ్డాడు రవికిరణ్.

"నీకేమన్నా పిచ్చా? కళ్ళెదుట భర్తని పెట్టుకుని చనిపోయాడంటావేం?" కోప్పడ్డాడు రవికిరణ్.

"నువ్వు నా భర్తవికావు" బుసలుకొడుతూ చెప్పింది.

"మరి నేనెవర్ని?" అడిగాడు.

"ఏమో... నాకు తెలియదు. ఏ క్షణాన్నయితే నేను నా భర్తని పరాయి ఆడదాని కౌగిట్లో చూశానో ఆ క్షణంలోనే నా భర్త చనిపోయాడు నా దృష్టిలో" చెప్పింది స్పందన.

"నీ ఇష్టమొచ్చినట్లు మాట్లాడితే మౌనంగా ఉండడానికి నేనేం చేతకానివాణ్ణి కాదు. నిన్ను చేసుకున్నవాణ్ణి. నీపై నాకు సర్వహక్కులూ ఉన్నాయి. పద" అంటూ స్పందన భుజంపై చెయ్యి వేశాడు రవికిరణ్. వెంటనే రవికిరణ్ చేతిని విదిలించింది స్పందన.

ఆశ్చర్యపోయిన రవికిరణ్ "బజారుదాన్ని తాకిన చేత్తో నన్ను తాకొద్దు. పురుగులు పాకినట్టు అన్పిస్తోంది నాకు" చెప్పింది.

"నేనెవర్ని తాకాను? నేను ఎవరినీ ఏమీ చెయ్యలేదు. నువ్వనుకుంటున్నంత అపవిత్రుణ్ణి కాను నేను. అసలు జరిగిందేమిటో నీకు తెలుసా? జరిగిందేమిటో తెలుసుకోకుండా అనవసరమైన మాటలు మాట్లాడకు. పెళ్ళి కాకముందు, పెళ్ళయ్యాక నీలో ఏ విధమైన మార్పూ రాలేదు. అదే ప్రవర్తన... అదే మొండితనం. ఏం చూశావు నీవు? నువ్వు చూసింది నిజం అనుకుంటున్నావా? మన కంటికి కనపడేదంతా నిజమేనా? ఆమె నా ఫ్రెండ్ అపూర్వ. ఇండస్ట్రియలిస్ట్ మాధవరావుగారి అమ్మాయి. మాది పవిత్రమైన స్నేహం. నా కంట్లో నలక పడితే దాన్ని తీయాలని అపూర్వ నా దగ్గరకొచ్చినప్పుడు నువ్వు చూశావ్. అంతే... ఈ చిన్న విషయానికంత రాద్ధాంతం చేస్తావేం? చదువుకున్నదానివి. విశాలంగా ఆలోచించు, సంకుచితంగా కాదు" చెప్పాడు రవికిరణ్.

"అవును... నువ్వు చెప్పింది ముమ్మాటికీ నిజం. మీ ఇద్దరిదీ పవిత్రమైన స్నేహం. నేనే అపవిత్రురాలిని. నువ్వు మంచివాడివని నీ గురించి భ్రమపడడం నాదే తప్పు. పెళ్ళి కాకముందు నాకు నీ మీదున్న అభిప్రాయమే కరెక్టు... నువ్వు దుర్మార్గుడివి. మోసగాడివి. ఫ్యాక్టరీలో పట్టపగలు నీ ఆఫీసులో ఓ అమ్మాయితో కులుకుతున్నావ్. నిజం చెప్పు. నేను నీకు ఏం తక్కువ చేశాను. మనస్ఫూర్తిగా నువ్వంటే ఇష్టపడ్డాను. కానీ; అసలు నిజమేమిటంటే నీకు ఆల్రెడీ ఆ అమ్మాయితో సంబంధం ఉంది. నేను చూశాను కాబట్టి ఈ విషయం బయటపడింది. ఇంతచేసీ ఇంకా దీన్ని చిన్న విషయమంటున్నావా? అంటే నీ దృష్టిలో పెద్ద విషయమంటే ఇంకెలా ఉంటుంది? డాడీ నీ గురించి అపోహపడ్డారు... నీ నిజరూపం తెలియక నీ గురించి భ్రమపడ్డారు. ఫలితంగా వంచింపబడ్డారు" నిప్పులు చెరుగుతూ అంది స్పందన. రవికిరణ్ ఓపిక నశించింది.

"ఒక్కమాట చెప్పు... నాతో వస్తున్నావా లేదా?" గట్టిగా అడిగాడు రవికిరణ్.

"చచ్చినా రాను... నీ నిజరూపం తెలిశాక నీతో వస్తానని ఎలా అనుకున్నావ్. ఓ తిరుగుబోతుతో, వ్యసనపరుడితో, మోసగాడితో కలిసి బతికే అవసరం లేదు నాకు. నాకు వ్యక్తిత్వం లేదా? ఆర్థిక స్వాతంత్ర్యం లేదా? నాకేం తక్కువని? నువ్వు ఎవరితో కులికావో దాన్ని చేసుకుని ఇంట్లో పెట్టుకో. అది ఇంకో డబ్బున్నవాడితో లేచిపోయాక అప్పుడు నీకు పవిత్రత అపవిత్రతల మధ్య తేడా ఏమిటో తెలుస్తుంది" తన నిర్ణయాన్ని రవికిరణ్‌తో ఖచ్చితంగా చెప్పింది స్పందన.

"నువ్వు నన్ను అవమానించినా లెక్కచెయ్యక నిన్ను పెళ్లి చేసుకోవడం నాదే తప్పు. నీకెందుకంత గర్వం? ఏంచూసుకుని అహం నీకు? నిన్ను ఇష్టపడి ప్రేమించి పెళ్లి చేసుకున్నానని అనుకున్నావా? మన పెళ్లి జరిగే చివరి నిముషం దాకా నాకు నువ్వంటే అయిష్టమే ఉంది నా మనసులో. ఒక విషయం మరిచిపోతున్నావు. నీ తండ్రి మాఇంటికొచ్చి మా నాన్నను బతిమాలింతర్వాతే నేను నిన్ను





చేసుకున్నాను. నీ ముఖం చూసి నిన్ను చేసుకోలేదు. నీ తండ్రి ముఖం చూసి చేసుకున్నాను. ఏ సంబంధానికైనా నమ్మకమే పునాది అంటారు. నేను నిన్ను పూర్తిగా నమ్మాను. కానీ నువ్వు నన్నెందుకు నమ్మడం లేదు. నాకు తెలిసినంతవరకూ ఈ రవికిరణ్ వస్తున్నాడంటే అందరూ వినయంగా తలలు వంచుతారు.

బిజినెస్‌లో, సొసైటీలో, అఫీషియల్స్‌లో, ఫ్రెండ్స్ సర్కిల్లో ఎంతో పేరున్న నేను నీ విషయానికొచ్చేసరికి తలవంచాల్సి వచ్చింది. మన పెళ్లికాకముందు నన్నోసారి అందరి ఎదుటా అవమానించావు. నీ తప్పుల్ని క్షమించి పెద్దమనసుతో నిన్ను పెళ్లిచేసుకున్నందుకు నాకేం మిగిలింది? అవమానాలు, నిరసనలు, ఛీత్కారాలు తప్ప... నన్ను నాశనం చెయ్యడానికే నువ్వు పుట్టినట్టు అనిపిస్తోంది నాకు. నువ్వు నా భార్యవి కాదు. నా శత్రువ్వి. నా జీవితకాలపు శత్రువ్వి" విసుగు, కోపం, వైరాగ్యం ధ్వనించాయి రవికిరణ్ మాటల్లో.

"నీ భర్త పవిత్రతపై నీకు నమ్మకం కుదిరాక, నువ్వు రావాలనుకుంటే రా. అలా కాకుండా బావిలో కప్పలా నీ చుట్టూ ఉన్నదే ప్రపంచం అనుకుంటూ అసూయతో నీలో నువ్వు కుంగి, కుశించిపోవాలనుకుంటే నీ ఖర్మ!" విసురుగా చెప్పేసి బయటకొచ్చాడు రవికిరణ్.

భార్యాభర్తల గొడవలో తలదూర్చితే బాగుండదని భావించి లోపలే ఉండిపోయాడు స్పందన తండ్రి ప్రసాదరావు. 'అల్లుడు చేసే నిర్వాకం గురించి అల్లుడ్ని దులిపేయండి' అని తన భార్య అన్నపూర్ణ చెప్పినా ఆమెని సైలెంట్‌గా ఉండమని చెప్పాడు ప్రసాదరావు.

రవికిరణ్ వెళ్లిపోయాక బయటికొచ్చి "అమ్మా స్పందనా! రవికిరణ్ చెప్పిందంతా విన్నాను. అతను చెప్పిందాంట్లో నాకు తప్పేమీ కనిపించలేదు. నువ్వే తొందరపాటుతనంతో అబ్బాయిని అపార్థం చేసుకుంటున్నావేమో ఒకసారి ఆలోచించు. రవికిరణ్ నీ కష్టసుఖాలు చూడవలసినవాడమ్మా. నీ భర్తమ్మా. నేను ఇప్పటికీ చెబుతున్నాను. అతను మంచివాడు. నువ్వూహించినంత చెడ్డవాడుకాదు" స్పందనకు నచ్చచెప్పాలని ప్రయత్నించసాగాడు ప్రసాదరావు.

తన తండ్రి రవికిరణ్ణి అలా పొగుడుతూ మాట్లాడేసరికి స్పందనకి అరికాలిమంట నెత్తికెక్కింది.

"మీరేం మాట్లాడుతున్నారో మీకర్థమౌతోందా డాడీ? నా కళ్లారా రవికిరణ్ణి ఓ పరాయి స్త్రీతో చూశాను. అంటే నేను చూసింది నిజం కాదా? నేను చెప్పేది నిజం కాదా? మీ కన్న కూతురు చెప్పిన మాటలకంటే ఆ రవికిరణ్ చెప్పిన మాటలకే ఎక్కువ విలువనిస్తున్నారా?

దిసీజ్ టూమచ్ డాడీ. ఒక తండ్రిగా మీరు మీ పిల్లలకు సపోర్ట్‌గా నిలవాలి, మాట్లాడాలి. అంతేకానీ ఎవరో ఏదో చెప్పారని నమ్ముతారా? ఒక తండ్రి స్థానంలో ఉన్న మీరే ఈ విధంగా మాట్లాడితే ఇక పిల్లల గతేంటి? " తండ్రితో తన నిరసనని వ్యక్తం చేసింది స్పందన.

"అవునండీ.. అమ్మాయి చెప్పింది కరెక్ట్. మీరేమిటీ అల్లుడికి వత్తాసు పలుకుతున్నారు? మనమ్మాయికి ఏలోటూ రానీకుండా బాగా చూసుకున్నంతవరకే మనం రవికిరణ్‌ని గౌరవించాలి. మనమ్మాయిని కాదని అతనెవరితోనో సంబంధం పెట్టుకుంటే అతన్నెందుకు గౌరవించాలి? అతని మాటలకెందుకు విలువనివ్వాలి? ఈ విషయంలో మీ వైఖరి అమ్మాయికే కాదు, నాక్కూడా నచ్చలేదు" భర్తని విసుక్కుంది అన్నపూర్ణ. ఆమె మాటలకు చప్పట్లు చరిచాడు ప్రసాదరావు నవ్వుతూ.

"శభాష్! మీ తల్లీకూతుళ్ల ఆలోచనా విధానానికి హేట్సాఫ్! అన్నపూర్ణా... నువ్వేనా

ఇలా మాట్లాడుతున్నది? ఎందుకంటే రవికిరణ్ విషయంలో నువ్విలా మాట్లాడగలవని నేను ఊహించలేకపోయాను. ఆరోజు 'మనమ్మాయి రవికిరణ్‌ని అవమానించింది' అని నేను చెబితే ఎంతో తల్లడిల్లిపోయిన నువ్వేనా ఇలా చెబుతున్నది? అంటే మీ తల్లీకూతుళ్ల ఉద్దేశ్యమేంటసలు? రవికిరణ్‌తో తెగతెంపులు చేసుకోవడం... అంతే కదా? నాకేం అభ్యంతరం లేదు. అలాగే సంబంధాన్ని తెంచుకోమ్మా.

నేను మీకు వ్యతిరేకంగా ఎందుకు మాట్లాడాలి? మీకు సపోర్టుగానే మాట్లాడతాను. తొలినుంచీ అతనంటే నువ్వు అసహ్యించుకుంటూనే ఉన్నావు. ఇప్పుడూ అసహ్యించుకుంటున్నావు. అసలు తప్పంతా నాదేనమ్మా. ఓ మంచి మనిషి తోడుగా, ఓ చల్లని నీడలో నా బిడ్డ జీవితం హాయిగా సాగిపోతుందని నేను ఆలోచించి తప్పు చేశాను. 'నేనే తప్పూ చెయ్యలేదు' అంటూ నిన్నెవరు బతిమాలారో తెలుసా? రవికిరణ్ బతిమాలాడు. రవికిరణ్ అంటే ఎవరు? నా చిన్ననాటి స్నేహితుడు ప్రభాకరరావు కొడుకు. నువ్వంటే ఇష్టంలేకపోయినా నా ప్రోద్బలంవల్ల తండ్రి చెప్పిన మాట జవదాటకుండా తన రెండు కళ్లూ మూసుకుని గుటుక్కున గరళాన్ని మింగినట్టు నిన్ను పెళ్లి చేసుకున్న రవికిరణ్ అస్థిత్వాన్ని ప్రశ్నించే అర్హత నీకెక్కడిదీ? ఈ గొడవవల్ల తల్లీతండ్రీ ఎక్కడ అశాంతికి లోనవుతారో అని అభిమానాన్ని చంపుకుని అతగాడే బతిమాలి తీసుకెళ్ళడానికి వచ్చాడనిపిస్తోంది నాకు. పెద్దలను గౌరవించే సంస్కారం వున్న కుటుంబమమ్మా అతనిది. అసలు మనం ఎందులోనూ సరిపోం వాళ్లకి.

అయినా నిర్ణయం తీసుకోవాల్సింది నువ్వే. ఎందుకంటే కలిసి బతకాల్సింది నువ్వే కాబట్టి. నేను నీ తండ్రిని. మంచి దారివైపు నిన్ను గైడ్ చెయ్యడం నా బాధ్యత. అంతే..." చెప్పాడు ప్రసాదరావు.

"ఆ రవికిరణ్, వాళ్ల కుటుంబం... అంతా నిన్నేదో మాయ చేశారు డాడీ. అందుకే కళ్లారా చూసిన నిజాన్నికూడా నువ్వు శంకిస్తున్నావు. నువ్వేన్నయినా చెప్పు, రవికిరణ్‌తో కలిసి నేను బతకడం కల్ల. రవికిరణ్ నిన్ను ఎంతగా ప్రభావితం చేశాడంటే నువ్వు నీ కన్నకూతుర్ని విషంకింద జమకట్టడానిక్కూడా వెనకాడడంలేదంటేనే అర్థమౌతోంది. మితిమీరిన వ్యక్తి ఆరాధన అరాచకానికి దారి తీస్తుందని చరిత్ర చెబుతోంది డాడీ. కౌరవులేం చేసినా అడగలేని ధృతరాష్ట్రుడిలా ఉంది నీ పరిస్థితి. అతను కళ్లు లేకపోయినా తన సంతానంపై మమకారం చూపితే నువ్వు కళ్లుండీ, నీ కన్నబిడ్డకు వ్యతిరేకంగా మాట్లాడుతున్నావ్.

అయామ్‌సారీ డాడీ! నాకు ఉద్యోగముంది. నా బతుకు నేను బతగ్గలను. మీ మాటలు నమ్మి రవికిరణ్ణి చేస్కున్నాను. ఎంతో మంచి వాడనుకున్నాను. పెళ్లి జరగకముందు రవికిరణ్ గురించి పొరబడ్డానని భావించాను. కానీ తీరా తెలుసుకున్నదేంటి? రవికిరణ్ మంచి వ్యక్తి కాదని... ఎస్... అతను మంచి వ్యక్తికాడు. నేనే గెలిచాను. రవికిరణ్ విషయంలో నా అభిప్రాయమే కరెక్ట్" చెప్పింది స్పందన.

"అవునండీ... నాలుగురోజులాగితే, అల్లుడే మన దగ్గరకు కాళ్ళ బేరానికి వస్తాడు. రాకపోయినా కూడా, కోర్టులో కేసు వేసి మనమ్మాయికి రావల్సిన వాటా అడుగుదాం... మనమ్మాయికేం తక్కువని? బేంక్ ఆఫీసర్..." చెబుతున్న అన్నపూర్ణవైపు దిగ్భ్రాంతిగా చూశాడు ప్రసాదరావు.

ఇక వీళ్లిద్దర్నీ ఆ దేవుడే రక్షించాలి అని తన మనసులో అనుకున్నాడు.

"రామ్మా భోం చేద్దువుగాని. వీరూ రండి..." చెప్పింది అన్నపూర్ణ. అన్నపూర్ణని అనుసరించింది స్పందన.

'ఈసారి రవికిరణ్ణి అంత తేలిగ్గా ఏదల




కూడదు' ముఖాన్ని చల్లని నీటితో కడుక్కుంటూ మనసులో అనుకుంది స్పందన.



తన తల్లిదండ్రులకు జరిగిన విషయం చెప్పాడు రవికిరణ్.

దమయంతి-ప్రభాకరరావులు రవికిరణ్ణి ముదలించారు. అపూర్వతో అంత సన్నిహితంగా మెలగవలసిన అవసరమేమిటన్నారు. వదిన గురించి వివరాలడిగిన కిరణ్మయితో ఏదో సర్ది చెప్పారు. ఈ విషయం గురించి తాను ప్రసాదరావుతో మాట్లాడతానన్నాడు ప్రభాకరరావు. వెంటనే అపూర్వతో స్నేహానికి ఫుల్‌స్టాప్ పెట్టమని రవికిరణ్‌తో చెప్పారు. ఆఫీసులో ఇటువంటి అనవసర వ్యవహారాలచేత కిరణ్ ఇండస్ట్రీస్ రెప్యుటేషన్ దెబ్బతింటుందని, ఇకమీదట జాగ్రత్తగా ప్రవర్తించమని రవికిరణ్‌తో అన్నాడు ప్రభాకరరావు.

తమతో మాట మాత్రమైనా చెప్పకుండా స్పందన అలా తన పుట్టింటికి వెళ్ళిపోవడంతో బాధపడ్డారు దమయంతి, ప్రభాకరరావులు. ఆ తర్వాత ప్రసాదరావుని ఫోన్లో కాంటాక్టు చేశాడు ప్రభాకరరావు. జరిగిందానికి తాను కూడా బాధపడుతున్నానని, కొన్రోజులు ఆగితే పరిస్థితులన్నీ చక్కబడతాయని, ప్రస్తుతం స్పందన కోపంగా ఉందని, తన వియ్యంకుడితో చెప్పాడు ప్రసాదరావు. స్పందనతో పెళ్ళికి రవికిరణ్ అయిష్టంగా ఉన్నాడని తాను చెప్పినా వినకుండా రవికిరణ్‌ని పెళ్ళికి ఒప్పించమని చెప్పింది ఇందుకేనా అంటూ తన స్నేహితుణ్ణి విసుక్కున్నాడు ప్రభాకరరావు. పెళ్ళి జరిగి పదిరోజులు కూడా కాలేదు. ఈ విషయం పదిమందికీ తెలిస్తే తనపరువు పోతుందని ప్రసాదరావుతో అన్నాడు. పిల్లలకు ఇష్టంలేని బలవంతపు పెళ్ళిళ్ళు చేస్తే వారి సంసారాలు ఇలాగే ఉంటాయని అన్నాడు. తనకు ఓ పెళ్ళి చేయవలసిన కూతురుందని చెబుతూ, ఇంటికోడలు ఇలాగేనా చెయ్యడం, అత్తామామలమైన మాకు చెప్పకుండా ఆ విధంగా బాధ్యతారాహిత్యంగా వెళ్ళిపోవడం పద్ధతిగా లేదన్నాడు ప్రభాకరరావు. తమ పెద్దరికాన్ని స్పందన గౌరవించలేదని ప్రసాదరావుతో చెప్పి బాధపడ్డాడు.

తాను వదిన దగ్గరకు వెళ్తానని చెప్పిన కిరణ్మయిని కోపగించుకున్నాడు రవికిరణ్. అసలేం జరిగిందో చెప్పమని కిరణ్మయి తన అన్నయ్యను నిలదీయగా చెప్పలేక సతమతమౌతున్నాడు రవికిరణ్. ఏం జరిగిందో తనకు రవికిరణ్ చెప్పకపోతే తాను వదినను అడుగుతానని కిరణ్మయి చెబుతోంది. రెండురోజుల్లో తన వదిన ఇంటికి రాకపోతే కాలేజీకి వెళ్ళడం మానేస్తానని తల్లిదండ్రుల్తో అంది. స్పందనని చేసుకుని లేనిపోని టెన్షన్ పెట్టుకున్నానే? అని బాధపడుతున్నాడు రవికిరణ్.

★ ★ ★

పంజాబ్ నేషనల్ బ్యాంక్, ఉదయం పదిగంటలు. ఆరోజే సెలవు తర్వాత జాయినైంది స్పందన. స్పందన బ్యాంక్‌లో అడుగుపెట్టగానే ఆమెను ఉక్కిరిబిక్కిరి చేసే పరిస్థితులు ఎదురయ్యాయి. "గుడ్ మా

# ఏరిన ముత్యాలు

* మన జేబులోకి వచ్చే ప్రతిరూపాయీ ఎలా వచ్చిందో ముందు తెలుసుకోవాలి.

–గాంధీజీ

* దానం, యజ్ఞం, సత్యం, కీర్తి, ధర్మం అన్నింటికీ ఓర్పే ముఖ్యం. ఈ ప్రపంచం ఓర్పు మీదే నిలిచివుంది.

–వాల్మీకి రామాయణం

* మానవుడు తనలోని దివ్యత్వమును కనుగొనడమే జీవిత లక్ష్యం కావాలి.

–అరవిందుడు

* అప్రియమైనా నీతిమాట చెప్పేవారూ దానిని ఆచరించేవారూ అరుదుగా ఉంటారు.

–నీతిసుధ

* జటాధారణ, శిరోముండనం, కాషాయ వస్త్రాలు ఇవన్నీ జ్ఞానాన్ని పొందడానికి. అలా కాకపోతే అవి ఉదర పోషణ కొరకే.

–శంకరాచార్యుల

* నీకు ఏదీ తెలియదని తెలిసిననాడు అన్నీ తెలిసినట్టే.

–స్వామి రామదాస

* సంస్కర్తల ప్రయత్నాలు నిర్మాణాత్మకంగా కాక విధ్వంసాత్మకంగా ఉండడమే వారు విఫలమవడానికి కారణము.

–స్వామీ వివేకానంద

* శీల భ్రష్టత్వమే జాతి నాశనానికి ప్రథమ సూచన.

–స్వామీ వివేకానంద

* ప్రతి ఒక్క వ్యక్తీ స్పందించినప్పుడే ప్రపంచంలో సమూలమైన మార్పు తీసుకురావడానికి వీలవుతుంది.

–జిడ్డు కృష్ణమూ

* ప్రపంచంలోని అందమైన వాక్యాలన్నీ ఏకమైనా ఒక అందమైన చేతతో స తూగలేవు.

–జె.ఆర్. లోవె

సేకరణ: ధన్వూరి శ్రీధరాచార్య

ర్నింగ్ స్పందనగారూ... ఎలా ఉంది మీ మేరీడ్ లైఫ్?" తన కొలీగ్ మార్గరెట్ అడిగింది. తన అంతరంగం బయటపడకుండా ముఖానికి చిరునవ్వు అంటించుకుని జాగ్రత్తలు తీసుకుంది స్పందన.

"ఫైన్..." ముక్తసరిగా చెప్పింది స్పందన.

"హలో స్పందనా... హౌ ఆర్ యూ?" విజయలక్ష్మి అడిగింది. విజయలక్ష్మి గడగడా పెద్దగా మాట్లాడుతుంది. సమాధానంగా నవ్వింది స్పందన.

"స్పందనా... ఏమాటకామాటే చెప్పుకోవాలి? మీ హజ్బెండ్ సూపర్‌గా ఉన్నాడు. మీ పెయిర్ నిజంగా మేడ్ ఫర్ ఈచ్ అదర్... యువ్వార్ సో లక్కీ" అంది విజయలక్ష్మి.

"థ్యాంక్యూ" అంది స్పందన.

"గుడ్‌మార్నింగ్ స్పందనగారూ" పలకరించాడు విశ్వమోహన్.

"గుడ్‌మార్నింగ్" చెప్పింది స్పందన.

"స్పందనగారూ... కిరణ్ అండ్ కిరణ్ ఇండస్ట్రీస్ ఎం.డి.ని పెళ్ళిచేసుకున్నారా మీరు? హౌ గ్రేట్? అయితే మీరు మిలియనీర్ అన్నమాట! మీకెందుకండీ ఈ ఉద్యోగం?" అన్నాడు విశ్వమోహన్ నవ్వుతూ.

"మీరు భలే మాట్లాడతారే... బ్యాంక్ ఆఫీసర్ ఉద్యోగం ఎందుకంటారేంటి?" అడిగింది స్పందన.

ఇంతలో బ్యాంక్ చీఫ్ మేనేజర్ శమంతకమణి వచ్చి స్పందనతో కరచాలనం చేసి తన గ్రీటింగ్స్ చెప్పింది. ఆమెకు సుమారు నలభై సంవత్సరాలుంటాయి.

"రవికిరణ్ నాకు తెలుసు. వెరీ నైస్ పర్సన్. అయామ్ సారీ. నేను ఢిల్లీ వెళ్లడం వల్ల మీ మేరేజ్ ఫంక్షన్ అటెండ్ చెయ్యలేపోయాను" చెప్పింది శమంతకమణి.

దెబ్బతిన్నట్టు ఫీలైంది స్పందన. అసలు రవికిరణ్‌కి ఎందరితో పరిచయముంది? ఎన్ని చూసినా, ఎవర్ని కదిలించినా, రవికిరణ్ గురించే చర్చ మొదలవుతుంది.

"భగవాన్! నాకు రవికిరణ్ గాలిసోకని ప్రదేశానికి తీసుకెళ్ళవూ?" మనస్సులో ప్రార్థించింది స్పందన. 'నైస్ పర్సన్ అట నైస్ పర్సన్. అతను నైస్ పర్సన్... జెంటిల్‌మన్, గ్రేట్‌మాన్ అయితే మరి తనెవరు? నిజంగా ఈ జనాలకు కామన్‌సెన్స్ లేదు.' మనసులో తిట్టుకుంది.

★ ★ ★

"నేను ఉద్యోగానికి రాజీనామా చేస్తాను స్పందనా" చెప్పింది సుమతి.

సుమతి నిర్ణయం విని ఆశ్చర్యపోయింది స్పందన.

"నీకేమన్నా పిచ్చిపట్టిందా? చదువుకున్న వాళ్ళు ఉద్యోగాల్లేక ఎలా బతకాల్రా భగవంతుడా అంటూ బాధలు పడుతుంటే చేసే ఉద్యోగం నువ్వు మానేస్తావా?" అడిగింది స్పందన.

"అవును స్పందనా... నువ్వు సిఫారసు చేశావు అనే ధీమాతోనే నేను కిరణ్ ఇండస్ట్రీస్‌లో జాయినయ్యాను. మీ ఇద్దరూ విడిపోయాక అక్కడ నేనెందుకిక?" చెప్పింది సుమతి.

"రాజకీయాల్లో ఏ చిన్న సంఘటన జరిగినా దాని ప్రభావం షేర్ మార్కెట్‌మీద పడ్డట్టు నీ గోలేమిటే మధ్య?" విసుక్కుంది స్పందన.

"రవికిరణ్ గురించి నేను అతిగా ఊహించాను. రవికిరణ్ చివరికి ఇలా చేస్తాడని నేననుకోలేదు స్పందనా... అతణ్ణి ఎంతగానో ఉన్నతంగా ఊహించుకున్న నేను పొరబడ్డాను" బాధపడుతూ అంది సుమతి.

"ఆ టక్కులాడిని చూడగానే నాకు అనుమానమేసింది స్పందనా... చివరికి అది రవికిరణ్ణి బుట్టలో పెట్టేసింది" చెప్పింది సుమతి కళ్ళు తిప్పుతూ.

"నువ్వు జాయినయ్యాక అది రావడం

ఎన్నోసారి?" అడిగింది ఆరా తీస్తూ స్పందన.

"ఫస్ట్ టైమ్... నిజంగా నువ్వు చాలా అదృష్టవంతురాలివి స్పందనా. ఆ దృశ్యం నీ కళ్ళలో పడడం నీ మంచికోసమే" చెప్పింది సుమతి.

"నాకు తెలీకడుగుతాను స్పందనా, నీకేం తక్కువని? రవికిరణ్ ఎందుకంత కక్కుర్తి పని చేశాడు?" అడిగింది సుమతి.

"ఒళ్ళు బలిసి, కొవ్వెక్కి చేశాడు. నా అంచనాల్ని తారుమారు చేశాడు ఇడియట్..." పళ్ళు నూరుతూ చెప్పింది స్పందన.

"మరి నన్ను రాజీనామా ఇచ్చెయ్యమంటావా?" అడిగింది సుమతి.

"అసలే మీ కుటుంబం అంతంత మాత్రంగా ఉంది. ఇటువంటి పరిస్థితిలో లక్షణంగా చేసుకునే ఉద్యోగం నా గురించెందుకు మానెయ్యడం? అటువంటి పిచ్చి పనులేవీ చెయ్యకు. నీకేమైనా డబ్బు కావాలా?" అడిగింది స్పందన.

"రవికిరణ్ డబ్బుకేమీ లోటు చెయ్యడు స్పందనా" చెప్పింది సుమతి.

"దీనికి మాత్రం తక్కువలేదు" మూతి మూడు వంకర్లు తిప్పింది స్పందన.

"ఇంతకీ నీ నిర్ణయం ఏంటి?" అడిగింది సుమతి.

"దేని గురించి?" అడిగింది స్పందన.

"రవికిరణ్‌తో శాశ్వతంగా తెగతెంపులు చేస్కోవాలనుకుంటున్నావా? అంటే డైవోర్స్‌కు అప్లయ్ చేయడంలాంటిదేమైనా?" అంది.

"అదే ఆలోచిస్తున్నాను సుమతీ. ఏ నిర్ణయమూ స్థిరంగా తీసుకోలేకపోతున్నాను. ఇంట్లో డాడీ ఒకటే పోరు 'రవికిరణ్ అలాంటివాడు కాడు ఇలాంటివాడుకాదు' అని. అమ్మ సపోర్టుగానే మాట్లాడుతోందనుకో. అయినా పెళ్ళికాకముందు నాలో ఉన్న స్థిరత్వం ఇప్పుడేమయ్యిందో నాకు అర్థం కావడంలేదు" ఆలోచిస్తూ చెప్పింది స్పందన.

"రవికిరణ్ ఏమని చెప్పాడు?" అడిగింది సుమతి.

"తన కంట్లో నలక పడితే అది తొలగించడానికి ఆమె ప్రత్యక్షమైందని చెప్పాడు" వెటకారంగా అంది స్పందన.

"చూడ్డానికి ఎంతో హుందాగా కనిపించే రవికిరణ్ ఇలా చేశాడంటే నాకెందుకో నమ్మబుద్ధి కావడంలేదు స్పందనా. అంటే నాలో ఏదో ఓ మూల అతను నిర్దోషి అనే భావన కలుగుతోంది" చెప్పింది సుమతి.

"అయిపోయిందా... పార్టీ మార్చేశావా? పోనీ ఒక పని చెయ్యవే సుమతీ. ఉద్యోగం మానేసి రాజకీయాల్లోకి చేరు. పైకొస్తావ్. అసలు నీలాంటి నిలకడ లేని మనుషులకు అదే బెస్ట్ ప్లేస్" కోపంగా అంది స్పందన.

"అంత కోపమెందుకే బాబూ... నేను కూడా నీ అసమ్మతి వర్గంలో సభ్యురాలినే. రవికిరణ్‌కు వ్యతిరేకంగా నువ్వు చెయ్యబోయే పోరాటంలో నీకు నా సపోర్టు ఎప్పుడూ ఉంటుంది" చెప్పింది సుమతి నవ్వుతూ.

"ఆ ఇడియట్‌కు జీవితంలో మరిచిపోలేని ఓ గుణపాఠం నేర్పించాలని ఉంది సుమతీ" చెప్పింది స్పందన పళ్ళు నూరుతూ.

"అదే ఎలా చేస్తావు? నీ పోరాటంలో మొదటి స్టెప్ ఏమిటి?" సుమతి అడిగింది.

"అతణ్ణి ఆర్థికంగా దెబ్బతీయాలి ముందు. కిరణ్ ఇండస్ట్రీస్ మూతపడాలి. రవికిరణ్ నైతికంగా పతనం చెందిన వ్యక్తి అని పబ్లిసిటీ చెయ్యాలి" చెప్పింది స్పందన.

"మరి నా ఉద్యోగం?" అడిగింది సుమతి అమాయకంగా.

"ఆ సంగతి నాకొదిలెయ్. రూపాదేవి తలచుకుంటే రెండురోజుల్లో నీకు కొత్త ఉద్యోగం వస్తుంది" చెప్పింది స్పందన

"మొదట నేను రూపాదేవిగారిని కల




వాలి" అంది తరవాత.



ిలిం డైరెక్టర్ సీమా పటేల్ నివాసం. సమయం సాయంత్రం అయిదు గంటలు.

"కగ్రాట్స్ సీమా... నీ ఫిల్మ్ 'ది వాయిస్' కేన్స్ ఫిలిం ఫెస్టివల్లో అవార్డు గెలుచుకుని సంవత్సరమైపోయింది. నీకు కాంప్లిమెంట్స్ చెందామంటే నువ్వు పత్తాలేవు. మార్నింగ్ ఫోన్లో నీ గొంతు విని నిజంగా ఎంత సంతోషించానో తెలుసా? ఒక సంవత్సరం పాటు గాయబ్ అయిపోయావే? ఎక్కడికెళ్ళావు ఇన్నిరోజులు? " సీమా పటేల్ని అడిగింది రూపాదేవి.

అమెరికా వెళ్లాను రూపా. సెలబ్రిటీ యాక్టర్ ఆస్కార్ అవార్డ్ విన్నర్ 'టామ్ హాంక్స్'తో ఫిల్మ్ ప్లాన్‌చేస్తున్నాను" సంతోషంగా చెప్పింది సీమ.

ఓహ్ రియల్లీ... ఒక్కసారి ఇండియన్ స్క్రీన్ నుండి హాలీవుడ్ స్క్రీన్‌కు వెళ్లిపోయావా? ఎంత ఎత్తుకు ఎదిగిపోయావు నీవు? నిజంగా ఎంతో గర్వంగా వుంది. మన భారతీయ స్త్రీ జాతికే నువ్వు గర్వకారణం సీమా. ఇంతటి అపురూపమైన అవకాశం నీకెలా వచ్చింది? " అడిగింది రూపాదేవి.

"నా ఫిలిం 'ది వాయిస్'కు కేన్స్ ఫెస్టివల్లో అవార్డు రావడం నా కెరీర్‌నే మార్చేసింది రూపా. ఫిలిం ఫెస్టివల్లో ఆరోజు 'టామ్‌హాంక్స్' నా ఫిల్మ్‌చూసి నన్ను ప్రత్యేకంగా కలిసి కాంప్లిమెంట్స్ చెప్పాడు. అంతే కాదు నా డైరెక్షన్‌లో నటించాలని ఉందనీ, ఫిల్మ్‌ని తనే ప్రొడ్యూస్ చేస్తానని చెప్పాడు. మంచి స్క్రిప్ట్ ఉంటే తీసుకురమ్మని చెప్పి, తన అడ్రస్, ఫోన్ అన్నీ వివరంగా చెప్పాడు. అంతే! అది నమ్మడానికి నాకు చాలాసేపు పట్టింది. ఆ తర్వాత ఆరు నెలలు కష్టపడి ఒక స్టోరీ తయారుచేశాను. స్క్రీన్‌ప్లే, షాట్ డివిజన్‌తోసహా. అవి తీసుకుని టామ్‌హాంక్స్‌ని అప్రోచ్ అయ్యాను. కొన్ని రోజులపాటు స్టోరీ సిట్టింగ్స్‌లో కూర్చున్నాం. తనూ కొన్ని మార్పులు సజెస్ట్ చేశాడు. చివరికి ఓ.కె. చేశాడు" అంది సీమాపటేల్.

"ఇంతకీ స్టోరీలైన్ ఏమిటో చెప్పావుకాదు" అంది రూపాదేవి.

"కుటుంబాన్ని పోషిస్తున్న మగవాడు ఒక స్త్రీతో అక్రమ సంబంధం ఏర్పరచుకోవడం చేత అతని కుటుంబం, అంటే భార్యా, ఇద్దరు పిల్లలు పడే వేదన, మానసిక సంఘర్షణ... వగయిరా" చెప్పింది సీమ.

"ఆ స్త్రీ మోజులో తన భార్యని వదిలేస్తాడా అతను? " అడిగింది రూపాదేవి.

"వదిలేస్తాడా అంటే వదిలెయ్యడు. భార్యా పిల్లల అవసరాలను కంప్లీట్‌గా పట్టించుకోకపోవటమంటే వదిలెయ్యడమే కదా!" అంది సీమాపటేల్.

"ఆ కొత్త స్త్రీలో అతనికి భార్యని మరిపింపజేసిన అంశమేంటి? " అడిగింది రూపాదేవి.

"ఏముంది? హౌస్‌వైఫ్‌కూ, వర్కింగ్ ఉమన్‌కు ఉన్న తేడా? " చెప్పింది. "భార్యంటే రొటీన్ ఫేస్ కదా. మగవాడికి బోర్‌కొడుతుంది" చెప్పింది సీమ.

"టామ్‌హాంక్స్ నటించబోయే మరో ఆణి ముత్యమన్నమాట నీ ఫిల్మ్" అంది రూపా దేవి.

"చివరికి నీ స్టోరీలో ఏంజరుగుతుంది? హీరో రియలైజ్ అవుతాడా? " అడిగింది రూపాదేవి.

"తన డ్రీమ్ లేడీ ఓ యువకుణ్ణి చూసు కుని ఇతనికి టాటా చెబుతుంది. ఆ దెబ్బకు అతనికి భార్య విలువేమిటో తెలుస్తుంది. భార్య దగ్గరకొచ్చి క్షమాపణ కోరుతాడు. మళ్లీ ఇతని కుటుంబంలో ఆనందం వెల్లివి రుస్తుంది" చెప్పింది సీమాపటేల్.

"నీ స్టోరీ క్లైమాక్స్ నాకు నచ్చలేదు సీమా!" పెదవి విరుస్తూ చెప్పింది రూపా దేవి.

"అదేం? " అడిగింది సీమ.

"లేకపోతే ఏమిటి? ఫెమినిస్ట్ అయి ఉండి నీ మౌలికసూత్రాలకే వ్యతిరేకమైన స్టోరీ తయారుచేశావ్" చెప్పింది రూపాదేవి.

"ఆ స్టోరీయే అంత. దాన్ని అలాగే తీసు కోవాలి. ఇందులో స్త్రీ వాదాలేమిటి మళ్ళీ? " అంది సీమా పటేల్.

"అంటే స్త్రీ ఆర్థికంగా పురుషుడిపై ఆధార పడినట్టు నువ్వు తయారుచేసుకున్న స్టోరీ లైన్ తప్పు" చెప్పింది రూపాదేవి.

"విదేశాల్లో కూడా చాలామంది భర్త సంపాదనమీద ఆధారపడే గృహిణులు ఉన్నారు. ఇందులో తప్పేముంది? మను షుల ఎమోషన్స్ మీద బేస్ చేసుకుని నేను తయారు చేసుకున్న స్టోరీ ఇది. ఆల్రెడీ ఫిమేల్ స్ట్రగుల్ థీమ్‌తో ఓ ఫీచర్ తీశా కదా! ఇదొక న్యూ ఎక్స్‌పెరిమెంట్ దట్సాల్" చెప్పింది సీమాపటేల్.

ఇంతలో రూపాదేవి వద్దనున్న సెల్‌ఫోన్ మోగింది.

"చెప్పు స్పందనా... నువ్వూ, నీ భర్తా ఎలా వున్నారు? " రవికిరణ్ణి ఉద్దేశించి అడి గింది రూపాదేవి నవ్వుతూ.

"నన్ను మీటవ్వాలా? ఏదైనా విశేషమా? రేపు మార్నింగ్ కలువ్... ఓ.కే" చెప్పింది రూపాదేవి.

"ఎవరు? " అడిగింది సీమాపటేల్.

"స్పందన అని నా ఇండస్ట్రియలిస్ట్ ఫ్రెండ్ రవికిరణ్ వైఫ్" చెప్పింది.

"నీ సర్కిల్ చాలా వైడ్‌గా ఉందే. అసలు ఈ సిటీలో నీకు తెలియనివాళ్లు ఎవరూ ఉండరేమో!" అంది సీమ.

"నా ఉద్యోగం అలాంటిది" చెప్పింది రూపాదేవి.

"నీ దగ్గర అసిస్టెంట్‌గా చేరాలని ఉంది సీమా" అంది రూపాదేవి.

"ఏం పాపం? సంఘసేవతో విసగొ చ్చిందా? " అడిగింది సీమ నవ్వుతూ.

"నీకు అంతర్జాతీయంగా కూడా గుర్తింపు ఉంది. నన్ను చూడు ఎంత గింజుకున్నా ఈ సిటీలోనే కదా? " చెప్పింది రూపాదే.

"అది సినిమా ఫీల్డ్‌కున్న రేంజ్. అయినా మనం రేంజ్‌గురించీ, స్టేటస్ గురించీ ఆలోచించి పనిచెయ్యకూడదు రూపా. మనం కోరుకున్నదాన్ని సాధిం చడం కోసం శక్తివంచన లేకుండా కృషిసి నప్పుడే మనకు నిజమైన జాబ్ శాటిస్ఫ్యా క్షన్ కలుగుతుంది" అంది సీమ.

"నీ ప్రాజెక్ట్ ఎప్పుడు స్టార్ట్ కాబోతోంది" అడిగింది రూపాదేవి.

"త్వరలోనే" అంది సీమ. సీమాపటేల్ వద్ద సెలవు తీసుకుంది రూపాదేవి.

★ ★ ★

"కొన్ని రోజులు పోతే సెకండియ ఎగ్జామ్స్ అయిపోతాయి. వెకేషన్‌లో ఏ ప్రోగ్రామేంటి? " కిరణ్మయి స్నేహితురా శిరీష కిరణ్మయిని అడిగింది.

"ప్రత్యేకమైన ప్రోగ్రామ్స్ అంటూ ఏ లేవు. ఈ వేసవిసెలవుల్లో కంప్యూ

నేర్చుకుందామనుకుంటున్నాను" చెప్పింది కిరణ్మయి.

"నేనూ అదే అనుకుంటున్నాను కిరణ్మయీ" చెప్పింది అనుపమ.

"కానీ నా ఆలోచన వేరే ఉంది డిఫరెంట్‌గా" అంది రాణి.

ఏమిటన్నట్టు మిగతా ముగ్గురూ రాణి వంక చూశారు.

"ఏమీలేదు. కరాటే నేర్చుకోవాలనుకుంటున్నాను. "హూ...హ్హా" అంది రాణి కరాటే సౌండ్స్ జోడిస్తూ.

ముగ్గురూ విరగబడి నవ్వారు రాణి మాటలకు. కాలేజ్ లైబ్రరీ పార్క్ ఆవరణలోని బెంచీలపై కూర్చున్నారు ముగ్గురూ.

"ఎక్కడ నేర్చుకుంటావు? " అడిగింది శిరీష రాణిని.

"చైనాలోని షాంఘైలో కరాటేలో శిక్షణ పొంది, బ్లాక్‌బెల్ట్ స్వీకరించి ఇక్కడ హిమాయత్‌నగర్‌లో స్కూల్ ఓపెన్ చేశాడు ఒకాయన" చెప్పింది రాణి.

"ఏం పేరతనిది? " అడిగింది అనుపమ.

"ఎం.ఎస్.ధన్" చెప్పింది రాణి.

"అదేం పేరే? " అడిగారు ముగ్గురూ.

"యమ్. స్వామినాథన్. అయితే వెరైటీగా ఉంటుందని అలా పెట్టుకున్నాడు" చెప్పింది రాణి.

"ధనాధన్ ఫటాఫట్‌లా అన్నమాట" చెప్పింది శిరీష.

"అయినా నీకిదేం ఆలోచనే? ఎంచక్కా ఏ కంప్యూటరో లేక ఏ వెకేషన్ కోర్సో నేర్చుకోకుండా కరాటే నేర్చుకుంటానంటావేమిటి? " అడిగింది అనుపమ.

"నేడు పరిస్థితులు ఎంతో మారిపోయాయి. స్త్రీజాతిపై సమాజంలో దౌర్జన్యం ఎక్కువైపోయింది. స్త్రీలకు రక్షణ కరువైంది. మన చట్టాలు, న్యాయస్థానాలు, స్వచ్ఛంద సంస్థలు స్త్రీలపై జరుగుతున్న అరాచకాలను అడ్డుకోలేకపోతున్నాయి. అటువంటి పరిస్థితులు నెలకొన్న నేటి వాతావరణంలో స్త్రీలే తమ స్వీయరక్షణకు నడుం బిగించాల్సిన ఆవశ్యకత పెరిగింది. ఎందుకు మీరందరూ నేను కరాటే నేర్చుకుంటానంటే అలా ఎగతాళిగా మాట్లాడుతున్నారు? అంత చిన్న చూపు చూస్తున్నారు. ఒంటరిగా వెళ్తున్న మహిళల్ని రోడ్లపై మగవాళ్లు టీజ్ చెయ్యడం, వారిని అసభ్యకరమైన పదజాలంతో మానసికంగా హింసించడం చేస్తున్నారు. శారీరకంగా అబలయిన స్త్రీ వారి హింసను మౌనంగా భరిస్తోంది. కానీ అకారణంగా మగవాడు స్త్రీజాతిపై తలపెడుతున్న ఈ దౌర్జన్యాన్ని స్త్రీ లెందుకు సహించాలి?

అందుకే ఆత్మరక్షణార్థం నేను కరాటే నేర్చుకోవాలనుకుంటున్నాను. నా ఆలోచన మీకు తప్పుగా కనబడిందా? ఇప్పుడు చెప్పండి. మీరు నాతో ఏకీభవిస్తారా లేదా? " ఓ చిన్నసైజు లెక్చరిచ్చింది రాణి.

"వెల్‌సెడ్ రాణి. వెల్‌సెడ్. మేమంతా నీతో ఏకీభవిస్తున్నాం" చప్పట్లు కొడ్తూ అన్నారు ముగ్గురూ.

"కానీ రాణీ నాదో అనుమానం. అటువంటి ఆత్మరక్షణ కార్యక్రమాలు అందమైన ఆడపిల్లలు చేపడితే బాగుంటుంది. కానీ నీలాంటి వారికి కాదేమో!" తన అనుమానం వ్యక్తం చేస్తూ అంది శిరీష నవ్వు దాచిపెడుతూ. దాంతో కోపం తన్నుకొచ్చి

"అంటే ఏంటే నీ ఉద్దేశం? నేను అందంగా లేననా? మగాళ్లెవరూ నా వెంట పడరనా? యూజ్‌లెస్‌ఫెలో..." శిరీష తలపై మొట్టికాయలేస్తూ చెప్పింది రాణి.

"రేపు దీన్ని పెళ్లాడిన మొగుడు కూడా నోర్మూసుకుని పడుండాలే. లేకపోతే ఇది తన కరాటే రుచి అతనికి చూపడం ఖాయం" చెప్పింది అనుపమ.

"ఊర్కోండే... ఎక్కడైనా భార్యలు

భర్తల్ని కొడతారా?" రాణి అడిగింది.

"నీ మొఖం... కొట్టడమేకాదు, చంపి పాతిపెడ్తున్నారు. పేపరు చదవడం లేదా నువ్వు? ఇంకా ఎక్కడున్నావే మాలోకం" రాణితో చెప్పింది శిరీష.

"శిరీషా... అసలు భార్యాభర్తలమధ్య గొడవలెందుకు జరుగుతాయి?" కిరణ్మయి అడిగింది. ఆమె మనసులో తన అన్నావదినల విషయం మెదులుతోంది.

"ఎందుకు జరుగుతాయంటే ఎలా చెప్పగలను? మనకు పెళ్ళిళ్లయాక తెలుస్తుంది ఆ విషయం" అంది శిరీష.

"నీ తలకాయ! నీ సమాధానం ఎలా ఉందంటే, నిప్పు కాలుతుందో లేదో అందులో చెయ్యిపెడితే కానీ తెలుసుకోలేం అన్నట్టుంది. భార్యాభర్తల నడుమ గొడవలు జరగడానికి కారణాలు తెలుసుకోవాలంటే పెళ్లే చేసుకోనక్కర్లేదు. మనం మన ఇళ్లల్లో, మన బంధువులింట్లో, మన చుట్టుపక్కలా ఎన్ని జంటల్ని చూడ్డంలేదు? వారిని, వారి ప్రవర్తనల్ని నిశితంగా గమనిస్తే ఈ ప్రశ్నకు సమాధానం ఈజీగా అర్థమవుతుంది" చెప్పింది అనుపమ.

"అదే ఎలాగ అని అడుగుతున్నాను?" అడిగింది కిరణ్మయి.

"ఇప్పుడు సపోజ్, భార్యకు ఓ చీర కొనాలని ఉంటుంది. ఆ విషయం తన భర్తకు చెబుతుంది, అతనొప్పుకోడు. అంతే. గొడవ మొదలవుతుంది" చెప్పింది అనుపమ.

"అన్ని సౌకర్యాలూ ఉన్నా కూడా, అంటే సంపన్నుల ఇళ్లల్లో దంపతుల మధ్య గొడవలెందుకు జరుగుతాయి? వారికి ఏం కావాలన్నా క్షణాల్లో కొనగలిగే పరిస్థితులుంటాయి కదా!" అడిగింది కిరణ్మయి.

"వారి ఇళ్లలో జరిగే గొడవలకు వేరే కారణాలుండొచ్చు. అంటే భార్య విపరీతంగా, విచ్చలవిడిగా డబ్బు ఖర్చుచెయ్యడం, అవసరం లేకున్నా నానా చెత్త కొనడం, లేకపోతే భర్తకు చెడు అలవాట్లు ఉండటం, తాగుడు, జూదం, స్త్రీ వ్యసనం లాంటివి సంపన్న కుటుంబాల్లో గొడవలకు కారణాలవుతాయి. భార్యాభర్తలిద్దర్లో ఎవరికి ఎక్స్‌ట్రా మారిటల్ ఎఫైర్సున్నా గొడవలు, తగాదాలు, కొట్టుకోవడం లాంటివి ఉంటాయి. గొడవలకు ప్రధానంగా ఇవే కారణాలు. ఇంకా చెప్పాలంటే ఆస్తుల విషయాల్లో జరిగే గొడవలు... ఇవి కూడా భార్యాభర్తల మధ్య స్పర్ధలకు కారణమౌతాయి" చెప్పింది అనుపమ.

"అనుపమా... ఏమో అనుకున్నాం కానీ, నీకింత నాలెడ్జి ఎక్కడిదే? ఎక్కడ నేర్చుకున్నావ్ ఈ విషయాలన్నీ? మా అందరికీ చాలా ఆశ్చర్యంగా ఉందే?" అడిగారు ముగ్గురూ.

"మా అక్క లాయర్. ఆమె దగ్గరకు కేసులు వస్తుంటాయి. వాళ్ళు మా అక్కతో మాట్లాడుతున్నప్పుడు నేను వింటుంటాను. అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తాను. ఏదైనా అర్థంకాకపోతే అక్క చెబుతుంది" చెప్పింది అనుపమ.

"అంటే ఇంటర్ తర్వాత నువ్వు లా డిగ్రీ చేస్తావా?" అడిగింది శిరీష.

"ఔను. నా జీవితాశయం అదే" చెప్పింది అనుపమ.

"అనుపమ చెట్టుకింద ప్లీడరన్నమాట" నవ్వుతూ చెప్పింది రాణి. మిగతా ముగ్గురూ నవ్వారు.

"ఏయ్ మొద్దూ... నిన్నే... కిరణ్మయీ... ఏం ఆలోచిస్తున్నావ్?" ఏదో ఆలోచిస్తున్న కిరణ్మయిని కుదుపుతూ అడిగింది రాణి.

"ఏం లేదు, ఏం లేదు" చెప్పింది కిరణ్మయి.

"అన్ని విషయాలు ఇంత డీటైల్‌గా అడుగుతున్నావంటే, కొంపదీసి మీ అన్నావదినలు ఏదైనా గొడవపడ్డారా ఏమిటి?" రాణి




అడిగిన ప్రశ్నకు ఉలిక్కిపడింది కిరణ్మయి.

★ ★ ★

"డోన్ట్‌టాక్ రబ్బిష్... రవికిరణ్ గురించి, అతని భార్యవై ఉండి అతనిపై నిందలు మోపడానికి నీకు మనసెలా వచ్చింది?" స్పందనని కోపగించుకుంటూ అంది రూపాదేవి.

"రూపాదేవిగారూ... మీరేనా ఈ మాట లంటున్నది? ఫెమినిజమంటూ స్త్రీ హక్కులంటూ, స్త్రీ సమానత్వమంటూ నాతో ఎన్నో విషయాలు చెప్పిన మీరు నా మాటల్ని ఇలా కొట్టిపడేస్తున్నారా? నేను కళ్లారా చూసిన నిజం గురించి మీకు చెప్పినా ఇంకా రవికిరణ్ మీకు ఉన్నతంగా కనిపిస్తున్నాడా? ఇదెక్కడి న్యాయమండి? ఇదేనా మీరు చెప్పిన ఫెమినిజం. ఒక వ్యక్తిపై మరీ ఇంత నమ్మకం పనికిరాదండి. ఇంకా మీరేదో నా మాటని ఆలకిస్తారని, రవికిరణ్‌కు వ్యతిరేకంగా నాతో చెయ్యి కలుపుతారని నేను ఊహించాను. అంతేకానీ మీరిలా పక్షపాతంతో వ్యవహరిస్తారని నేను అనుకోలేదు. మీ గురించి అతిగా ఊహించుకోవడం నా తప్పు" చెప్పింది స్పందన.

"నోటికొచ్చినట్లు మాట్లాడకు. నువ్వింకా చిన్నపిల్లవి. ఏమన్నావ్? రవికిరణ్‌కు వ్యతిరేకంగా నేను నీతో చేతులు కలపాలా? నువ్వు అతని భార్యవా లేక రవికిరణ్ ఉంపుడుగత్తెవా?" అడిగింది రూపాదేవి.

"మీరు హద్దుమీరి మాట్లాడుతున్నారు రూపాదేవి. మీరు ఏం మాట్లాడుతున్నారో మీకు అర్థమౌతోందా?" అడిగింది స్పందన కోపంగా.

"అర్థమయ్యే మాట్లాడుతున్నాను. ఎందుకంటే నువ్వేమిటో, నీ పొజిషనేంటో నీ ఫ్యామిలీ బ్యాక్‌గ్రౌండ్ ఏమిటో ఒకసారి వెనక్కితిరిగి నువ్వు చూసుకో. నీకూ, రవికిరణ్‌కు-భూమికీ, ఆకాశానికి మధ్య ఎంత తేడా ఉందో అంత తేడా ఉంది మీ ఇద్దరి మధ్యా... రవికిరణ్ గురించి నువ్వు నాకు చెబుతున్నావా? వ్యక్తిత్వం లేనివాళ్లతో, నైతికంగా పతనమైనవారితో నేను సంబంధాలు ఎందుకు పెట్టుకుంటాను? ఒక ఫెమినిస్టుని అయి ఉండీ మగవాడికి సపోర్టుగా ఎందుకు మాట్లాడుతున్నానో నీకు తెలుసా? రవికిరణ్‌కున్న ఆస్తి విలువ పదికోట్లయితే అతని గుణం విలువ ఇరవై కోట్లు చేస్తుంది. అందుకే రవికిరణ్ అంటే నాకు అభిమానం, వాత్సల్యం. ఒక సొంత తమ్ముడిగా అతణ్ణి నేను ట్రీట్ చేస్తానెప్పుడూ. రవికిరణ్ణి నేను ఆజ్ఞాపిస్తాను. మీ ఇద్దరి పెళ్ళి జరిగిన రోజు నేనెంత సంతోషపడ్డానో నీకు తెలుసా? నీ అదృష్టానికి నేనెంత పొంగిపోయానో నీకు తెలుసా? స్పందనా నువ్వు అపోహపడ్డావు. ముమ్మాటికీ నువ్వు మిస్‌గైడ్ చెయ్యబడ్డావు. పిచ్చిదానా... ఫెమినిజం అనే పదానికి నిజమైన అర్థం ఏమిటో తెలుసా? స్త్రీలు చదువుకుని, అవగాహన పెంచుకుని సామాజికాభివృద్ధిలో పురుషుడికి తమ సహాయసహకారాలు అందించడం. అంతేకానీ ఫెమినిజం అనేది పురుషజాతికి వ్యతిరేకంగా మొహరించిన పోరాటం కాదు. అసలు మగవాణ్ణి ఎందుకు ద్వేషించాలి? మీ నాన్న మగవాడు, మీ అన్న, తమ్ముడు మగవాళ్లేకదా! మరి పురుషులుగా జన్మించినందుకు వారిని కూడా ద్వేషించాలా? ద్వేషమనేది సృష్టిధర్మానికే విరుద్ధం స్పందనా. నేను నా సర్వీసులో ఎంతో మంది వివిధ రంగాలకు చెందిన మేధావుల్ని కలిశాను. నిజం ఏమిటో తెలుసుకున్నాను. సృష్టిలో మనుషుల మధ్య సహజీవనం పెంపొందాలన్నా, సమతుల్యతకు భంగం కలగకుండా ఉండాలన్నా స్త్రీ పురుషుల నడుమ ప్రేమ ఎంతోఅవసరం. కాబట్టి సృష్టి సూత్రాన్ని నిలబెట్టింది, నిలబెట్టుతున్నదీ, నిలబెట్టేదీ ప్రేమే! ద్వేషం, అసూయలు కాదు" చెప్పింది రూపాదేవి.

"అంటే పురుషుడు ఎన్నిదౌర్జన్యాలు

చేసినా, ఎన్ని దుర్మార్గాలు చేసినా స్త్రీ సహిం చాలా? స్త్రీ హక్కుల్ని, స్త్రీ బతుకుని కాలరా యాలని అతను ప్రయత్నించినపుడు స్త్రీ మౌనంగా, సహజీవనం అంటూ సరిపెట్టు కోవాలా? " రెట్టించి అడిగింది స్పందన.

"అని ఎవరన్నారు? తమ మనుగడకే ముప్పు వాటిల్లినపుడు తప్పకుండా తిరగబ డాలి. పిల్లిలాంటి అల్పజీవి కూడా గదిలో పెట్టి హింసించినపుడు అది తిరగబడ్తుంది. దౌర్జన్యాన్ని ఎదిరించడం మనిషి కర్తవ్యం, మానవ ధర్మం! దానికి ఫెమినిజం అని పేరు పెడితే, మరి రవికిరణ్‌పై నువ్వు పగ సాధిం చాలనుకుంటున్నావ్. తన హక్కుల్ని కాపాడు కోవడం కోసం రవికిరణ్ ఇంకో 'ఇజాన్ని' ఆశ్రయించాలా? " అడిగింది రూపాదేవి.

"ఆగండి రూపాదేవిగారూ... మీకు గుర్తుందా? మనం మొదటిసారి కలిసినప్పుడు, 'నెలల వయసున్న పసికం దుల్ని రేప్‌చెయ్యడానికి మగవాడికి మన సెలా ఒప్పుతుంది?' అని మీరన్నారు కదా, దానికేమంటారు? " అడిగింది స్పందన.

"అవును... అన్నాను. అటువంటి వారిని శిక్షించడానికి చట్టాలు శిక్షల్ని కఠినతరం చెయ్యాలి. మన చట్టాల్లో సత్తాలేదు కాబట్టే వారలా చెలరేగుతున్నారు. అలాంటివారిని పట్టుకుని మర్చిపోలేని శిక్ష వెయ్యాలి. అప్పుడుగానీ ఆ సమస్య పరిష్కారం కాదు. అంతమాత్రంచేత దానికీ దీనికీ ఏమిటి సంబంధం? ఆ జాబితాలో లేడీరవికిరణ్"

"మీరెన్నయినా చెప్పండి రూపాదేవి గారూ. రవికిరణ్ణి నేను క్షమించలేను. నా ఆత్మసాక్షి అతను తప్పుచేశాడంటోంది. అత నికి నేనేం తక్కువ చేశానని అతనంత నీతి మాలిన వ్యవహారానికి పాల్పడ్డాడు? నేను ఏపని చెయ్యాలన్నా నేను చూసిన ఆ దృశ్యం నా కళ్ళముందు కనిపించి, నాకు మనశ్శాంతి లేకుండా చేస్తోంది. నా టెన్షన్ పెరిగిపోతుంది. ఇరిటేషన్‌కు గురవుతు న్నాను" చెప్పింది స్పందన.

"దానికి ఇంత హైరానా పడాల్సిన అవస రమేముంది? రవికిరణ్ తప్పుచేశాడని మనసా వాచా కర్మణా నమ్ముతున్నావ్ నువ్వు! ఈ విషయంలో ఎవరిమాటా, ఎవరి సలహా, సంజాయిషీ నువ్వు వినదల చుకోలేదు. అటువంటప్పుడు ఈ సమస్యని పరిష్కరించడం చాలా ఈజీ" చెప్పింది రూపాదేవి.

"అదే ఏం చెయ్యమంటారో చెప్పండి? " అడిగింది.

"ఏముంది? విడాకులు తీసుకో. అతని పీడ నీకు, నీ పీడ అతనికి విరగడవుతుంది" చెప్పింది రూపాదేవి.

"అంతేనంటారా? " అడిగింది స్పందన.

"ముమ్మాటికీ అంతే! ఆ తర్వాత నేనే దగ్గరుండి మరీ రవికిరణ్‌కు అపూర్వతో పెళ్ళి జరిపిస్తాను. ఇటు రవికిరణ్‌నుండి విడిపోయినందుకు నీకు సంతోషం, అటు రవికిరణ్‌లాంటి భర్త లభించినందుకు అపూర్వకూ సంతోషం. తమ పెళ్ళి తాలూకు స్వీట్ నథింగ్స్ చెప్పుకుంటూ హనీమూన్లు చేసుకుంటూ వారు హాయిగా తిరుగుతుంటారు. ఇక్కడ నువ్వేమో ఉద్యోగం చేసుకుంటూ, ఆలోచిస్తూ, రాత్రిళ్లు నిద్రపట్టక, టెన్షనెక్కువైపోయి ఇర వైలోనే అరవైలా తయారవుతావు. నీ యవ్వనమంతా అడవికాచిన వెన్నెలవు తుంది. పోనీ ఇంకో పెళ్ళి నువ్వు చేస్కో వాలని అనుకున్నా, నీ ఊహల్లోంచి రవికి రణ్ రూపాన్ని చెరిపెయ్యడం నీ వల్ల కాదు. చివరికి జీవచ్ఛవంలా తయారై పోయి నీ బ్రతుకుపై నీకే విరక్తి కలుగు తుంది. నీ ఉద్యోగం నిన్ను బతికిస్తుంది. కాదనను. కానీ అదీ ఓ జీవితమేనా? ఒక సంతోషం, ఒక సందడి, ఒక సందర్భం లేకుండా చప్పగా, నిస్సారంగా, నిస్తేజంగా, ఛస్తూ బతుకుతూ. ఛీ" రూపాదేవి తన భవిష్యత్తు తాలూకు సీన్ వివరిస్తుంటే





స్పందనకు చెమటలు పట్టసాగాయి.

★ ★ ★

సత్యసాయి హాస్పిటల్, సమయం సాయంకాలం ఏడున్నర.

"ఈ టాబ్లెట్స్ క్రమం తప్పకుండా వేసుకోండి. బలానికి కూడా మందులు రాస్తున్నాను" రాస్తూ చెప్పాడు డాక్టర్ హేమచంద్ర. అతనెదురుగా ప్రభాకర్రావ్, రవికిరణ్ కూర్చుని ఉన్నారు. ప్రిస్క్రిప్షన్ రాసి రవికిరణ్ చేతికిచ్చాడు డాక్టర్ హేమచంద్ర.

"మీరు బాగా ఆలోచిస్తున్నారు. దేనిగురించో వర్రీ అవుతున్నట్టు అనిపిస్తోంది. అందుకే బి.పి. రైజయింది. కాబట్టి ఆలోచనలన్నీ పక్కన పెట్టి ఈ మందులు వాడుతూ రెస్టుతీసుకోండి. రెండురోజుల్లో నార్మలవుతుంది. ఈ వయసులో మీరు టెన్షన్స్ పెట్టుకోకూడదు. మిస్టర్ రవికిరణ్, మీ డాడీకి మీరే చెప్పాలి" అన్నాడు డాక్టర్ హేమచంద్ర.

అలాగేనంటూ రవికిరణ్ తలూపాడు.

"అయామ్‌సారీ సర్, మధ్యాహ్నం మీరు హాస్పిటల్‌కు ఫోన్ చేశారట, నేను కొంచెం పనుండి బయటికెళ్లాను, తీరా ఇప్పుడు మీ దగ్గరకు బయలుదేరేసరికి మీరే ఎదురయ్యారు, అన్నట్టు మిస్టర్ కిరణ్, నా సెల్ నంబర్ నోట్ చేస్కోండి. ఇన్ కేస్ ఆఫ్ ఎమర్జెన్సీ, యుకెన్ ఫైండ్‌మి ఆన్ మై సెల్" చెప్పాడు డాక్టర్ హేమచంద్ర.

రవికిరణ్ సెల్ నంబర్ నోట్‌చేసుకున్నాడు. తర్వాత డాక్టర్ వద్ద సెలవుతీసుకుని ఇంటికి బయలుదేరారిద్దరూ. రవికిరణ్ డ్రైవ్ చేస్తుండగా పక్కన ప్రభాకర్రావు కూర్చున్నాడు మౌనంగా. రవికిరణ్ అశాంతి ఫీలవుతున్నాడు. స్పందన వెళ్ళి నేటికి నాలుగు నెలలవుతోంది. ఎన్నాళ్ళిలా? స్పందనతో పెళ్ళి వద్దు మొర్రో అని తాను తండ్రికి చెప్పి చూసినా తన తండ్రి వినలేదు. అయినా తనేం తప్పుచేశాడని స్పందనలా వెళ్ళిపోయింది. తను తప్పు చేయలేదని తన ఆత్మసాక్షికి తెలుసు, అపూర్వకూ తెలుసు. అటువంటప్పుడు తాను స్పందనకెందుకు భయపడాలి? ఎందుకు స్పందనకు తలవంచాలి? ఆమెకు సంజాయిషీ ఇచ్చే అవసరం తనకు లేదు. తను తప్పు చెయ్యకపోయినా స్పందన దగ్గరికెళ్ళి తనతో రమ్మని చెప్పాడు. సమాజం గురించి, సభ్యత గురించి తను ఆలోచించి ఒక బాధ్యత గల భర్తగా తాను స్పందన వద్దకెళితే ఆమె నిర్దాక్షిణ్యంగా తన ప్రతిపాదనని తిరస్కరించింది. కనీసం భర్త అని కూడా ఆలోచించకుండా తన పట్ల దారుణంగా, క్రూరంగా ప్రవర్తించింది. ఏం? బాధ్యత తన ఒక్కడికేనా? ఆమెకు భాధ్యతలేదా? ఆడదానికే అంత పౌరుషం, రోషం, ఆత్మాభిమానం ఉంటే మరి మగవాడైన తనకెంత ఉండాలి? వీల్లేదు. స్పందన విషయంలో ఇకపై తాను సున్నితంగా వ్యవహరించే అవసరం లేదు. ఈవిధమైన ఆలోచనలు రవికిరణ్ బుర్రని జోరీగల్లా తొలుస్తుండగా, ఇల్లు దగ్గరైన విషయం మరచేపోయాడు.

"ఏమండీ... మీకెలా ఉంది? బాబూ డాక్టరేం చెప్పాడు?"

"అన్నయ్యా... నాన్నకేమైంది?" ఇంట్లోకి అడుగుపెట్టగానే రవికిరణ్‌ని దమయంతి, కిరణ్మయిలు ప్రశ్నించారు. తండ్రి ప్రభాకరరావుని జాగ్రత్తగా తీసుకువెళ్లి సోఫాలో కూర్చోబెట్టాడు రవికిరణ్.

"మరేం ఫర్వాలేదని చెప్పాడమ్మా. కొంచెం లైట్‌గా బి.పి. ఉందట. వేళకు మందులవీ వాడుతూ విశ్రాంతి తీసుకుంటే నార్మల్‌కు వస్తుందని చెప్పాడు. కంగారు పడాల్సిన పనేమీలేదు" తల్లికి చెప్పాడు రవికిరణ్.

"బాబూ రవికిరణ్" గొంతు విప్పాడు ప్రభాకరరావు.

"చెప్పండి నాన్నా" అన్నాడు రవికిరణ్.

ప్రభాకరరావు ఏం చెప్పాలనుకుంటున్నాడో అని దమయంతి, కిరణ్మయిలు దగ్గరకొచ్చి నిలబడ్డారు.

"నన్ను ప్రసాదరావింటికి తీసుకెళ్లు. స్పందనతో నేను మాట్లాడతాను" అన్నాడు ప్రభాకరరావు. రవికిరణ్ వెంటనే తండ్రితో ఏదో చెప్పాలనుకుని తల్లివైపు చూడగా "ఏం మాట్లాడవద్దు. డాడీ చెప్పినట్టు చెయ్యి" అంటూ కళ్లతో చేతులతో సైగచేసి చెప్పింది దమయంతి.

"అవునన్నయ్యా" కిరణ్మయి కూడా దీనంగా అన్నవైపు చూసి తలూపింది. ఏం చెప్పాలో ఏం చెయ్యాలో ఎటూ పాలుపోని పరిస్థితిలో కాసేపు కొట్టుమిట్టాడి "సరే" అన్నాడు రవికిరణ్.

"మీరు చెప్పినా స్పందన వింటుందో లేదో డాడీ. అసలే మీ ఆరోగ్యం బాగా లేదు. ఆమెకు ఎవరితో ఎలా ప్రవర్తించాలో తెలీదు. స్పందన ఒకవేళ మీతో రాష్‌గా మాట్లాడితే మళ్లీ మీకు టెన్షన్ పెరుగుతుంది. మీ ఆరోగ్యం చెడిపోతుంది. అందుకని ఓ రెండ్రోజులు ఆగి నేనే స్పందన దగ్గరకెళ్లి మాట్లాడతాను. అంతవరకు అందరూ ఓపిక పట్టండి" తండ్రితో అన్నాడు.

"రవికిరణ్! ముందు నువ్వు నేను చెప్పినట్టు నడుచుకో. నేను ఎవరి మాటా వినదలచుకోలేదు. రేపు ఉదయం ఎనిమిది గంటలకు నేను ప్రసాదరావింట్లో ఉండాలి. అంతే!" ఆజ్ఞాపించాడు ప్రభాకరరావు.

"మీ స్నేహితుడి ఎదుట తలవంచినట్టు అవుతుందేమో ఒకసారి ఆలోచించండి డాడీ" ఆఖరి అస్త్రం ప్రయోగించాడు రవికిరణ్.

"నువ్వు నోర్మూయ్" రవికిరణ్ణి కేకవేసి దగ్గాడు ప్రభాకరరావు.

మర్నాడు ఉదయం ఏడు గంటలకు రవికిరణ్ స్నానం చేసి తయారయి తండ్రి దగ్గరకెళ్లాడు.

"డాడీ వెళదామా?" అడిగాడు తండ్రిని.

దమయంతి, కిరణ్మయిలిద్దరూ ప్రభాకరరావుని అనుసరించారు. అందరూ కలసి గడపదాటి బయటికొచ్చారు. ఇంతలో వాచ్‌మెన్ గేట్ ఓపెన్ చేశాడు. వైట్ కలర్ మారుతీ వ్యానొకటి లోపలికి దూసుకొచ్చింది.

"ఈ టైమ్‌లో వచ్చిందెవరు?" అని అందరూ తొలుత ఆశ్చర్యానికి గురయ్యారు. ఆ తర్వాత మెల్లగా అందరి ముఖాల్లో ఆనందం వెల్లివిరిసింది. దానికి కారణం ప్రసాదరావు, అన్నపూర్ణ కారు దిగి నవ్వుకుంటూ ప్రభాకరరావు దంపతులకు ఎదురొచ్చారు. వారిద్దరి నడుమ స్పందన తల వంచి మెల్లగా వచ్చింది. స్పందనని చూసిన ప్రభాకరరావు, దమయంతిల సంతోషానికి అవధుల్లేకుండా పోయింది. రవికిరణ్ నుదురు చిట్లించి "ఇది నిజమేనా? లేక ఉదయమే కళ్లేమన్నా మసకబారాయా?" అని కళ్లు నులుముకుని మళ్లీ ఓసారి చూశాడు. అనుమానం లేదు. స్పందనే! కానీ స్పందన... ఆత్మాభిమానానికి, రోషానికి, పౌరుషానికి మారుపేరయిన స్పందన ఇంత త్వరగా లొంగటమేంటి? ఏదైనా మిరకిల్ జరిగిందా? ఏమైంది? అసలేం జరిగింది?" ఇలా తనలోతాను అనుకుంటూ ఉండగా కిరణ్మయి తన అన్నయ్య రవికిరణ్ణి ఒక్క కుదుపు కుదిపి,

"అన్నయ్యా నువ్వెక్కడున్నావ్? ఎటు చూస్తున్నావ్? చూడు ఎవరొచ్చారో?" పెద్దగా అరుస్తూ చెప్పింది.

"ఆ... ఆ ఏమిటి?" అన్నాడు రవికిరణ్ కన్‌ఫ్యూజైపోయి. రవికిరణ్ పరిస్థితి చూసి స్పందన స్పందించి నవ్వింది. ఇంద్రధనుస్సు విరిసినట్టు, పూలవర్షం కురిసినట్టు నవ్విందామె. ఆ నవ్వుతో కిరణ్మయి, ప్రభాకరరావ్, దమయంతి శృతి కలిపారు.

"నన్ను క్షమించరా" అంటూ ప్రభాకరరావు రెండు చేతులూ పట్టుకుని కళ్లనీళ్ల

పర్యంతమయ్యాడు ప్రసాదరావు.

"రేయ్ ఊర్కో... పిచ్చీ" ప్రసాదరావుని తన హృదయానికి హత్తుకున్నాడు ప్రభాకరరావు. తమని క్షమించమని అన్నపూర్ణ దమయంతి, ప్రభాకర్రావులని వేడుకుంది.

"కిరణ్! అమ్మాయిని లోపలికి తీసుకెళ్ళు" కొడుకుకి మృదువుగా చెప్పాడు ప్రభాకరరావు. స్పందన చేయి పట్టుకుని రవికిరణ్ ఇంట్లోకి తీసుకెళ్ళాడు. అంత త్వరగా స్పందన తన మనసెలా మార్చుకుందో రవికిరణ్ ఊహించలేకపోయాడు. దీనిక్కారణం స్పందనకు తెలుసు. అవును స్పందనకు తెలుసు. ఒక ఉత్తరం... ఒకే ఒక్క ఉత్తరం... ఎక్కణ్ణించి?

అపూర్వ
ఉడ్వర్డ్ ఎవెన్యూ,
ఉడ్రిడ్జ్,
యు.ఎస్.ఎ.

స్పందనకు,

నా హృదయపూర్వక అభినందనలు తెలియచేస్తున్నాను. రవికిరణ్వంటి మంచివాడు నీకు భర్తగా లభించాడు. నేను అమెరికా వచ్చేముందు అమ్మను కలవడానికి రూపా ఆంటీ వచ్చారు. మీ భార్యాభర్తల మధ్య ఏర్పడిన కలతలు, దాని పూర్వాపరాలు, నీ భావాలు అన్నీ చెప్పారు. ఎలా చెప్పినా నువ్వు వినడంలేదనీ, దాంతో విడాకులు ఇవ్వమన్నాననీ రూపా ఆంటీ చెప్పారు. అప్పుడే నాలో ఆందోళన ప్రారంభమయింది. రవికిరణ్ణి నేను ప్రేమించిన మాట వాస్తవం. పెళ్ళయ్యాక కూడా అతన్ని కలిసి మాట్లాడాలనే అభిలాష ఎక్కువగానే వుండేది.

ఆరోజు అతడి ఆఫీసులో... అతని కంట్లో పడిన నలుసు తియ్యడానికి నేనే అనవసరమైన చొరవ చూపాను. అతడి తప్పేమీలేదు. ఎప్పుడూ నాకో మంచి సంబంధం చూసి పెళ్ళి చేస్తాననేవాడు. రూపాదేవి ఆంటీ చెప్పిందాన్ని బట్టి చూస్తే మీ ఇద్దరిమధ్యా గొడవలు విడాకులదాకా వెడతాయేమో అని భయపడ్డాను. ప్రస్తుత పరిస్థితుల్లో నీలో నమ్మకం కలిగించాలంటే నేనక్కడ వుండకూడదనుకున్నాను. హయ్యర్ స్టడీస్కి అమెరికా రావాలనే ప్రయత్నం ఎప్పటినుంచో నడుస్తోంది. అది మెటీరియలైజ్ అవడంతో ఇక్కడకొచ్చేశాను.

నీ మనసు గాయపరిచినందుకు నన్ను క్షమించు. ఆంటీ మాటలు కొన్ని నాకు చాలా నచ్చాయి. పురుషుడుగానీ, స్త్రీగానీ ఎవరు ఎవరిపై ఆధిపత్యం వహించాలని చూసినా బావుండదు. ఒకరినొకరు గౌరవించుకుని ఎవరి బాధ్యతల్ని వాళ్ళు సక్రమంగా నిర్వర్తించినప్పుడు ఏ ఇజమ్ల అవసరమూ వుండదు. ముఖ్యంగా కిరణ్లాంటి వ్యక్తి విషయంలో నువ్వేలాంటి ఇజాన్నీ ఆశ్రయించాల్సిన పనిలేదు.

ఆంటీ మాటల్ని బట్టి చూస్తే నీక్కొంచెం ఆవేశం ఎక్కువే అనిపించింది. అంతే కాదు... ఎప్పుడూ ఒకే యాంగిల్లో పురుషుణ్ణి చూస్తే ప్రతి విషయంలో అతడు మనల్ని అణగదొక్కుతున్నట్టే అనిపిస్తుందేమో. నాకూ ఈ విషయంలో అనుభవం లేదు. ఆంటీ చెప్పిన మాటల్ని బట్టి నేను ఏర్పరచుకున్న భావాలు మాత్రమే ఇవి.

కొంచెం ఎక్కువ చొరవతో రాస్తున్నందుకు మన్నించు. మీ వైవాహిక జీవితం అపోహలనే కలుపుమొక్కలను తొలగించుకుని కళకళలాడే పూలవనంలా వుండాలని కోరుతున్నాను.

అందరూ అందమైన కలలుకంటారు. కానీ అవి కొందరి విషయంలో మాత్రమే నిజమవుతాయి. ఇప్పటికయినా నువ్వు రవికిరణ్ణి అర్థం చేసుకుని అతనికి చేరువవుతావని నమ్ముతున్నాను. ఎందుకంటే నువ్వు శిలవు కావు స్పందనవి.

శలవ్,
అపూర్వ



# చతుర ప్రపంచం

## ప్రముఖుల ముచ్చట్లు

మహామహుడు, విఖ్యాత శాస్త్రవేత్త ఐన్‌స్టీన్ జర్మనీలో జ్యూయిస్ కుటుంబంలో జన్మించాడు. స్కూల్లో చదివే రోజుల్లో చదువులో బాగా వెనకబడ్డాడు. అతణ్ణి "మొద్దబ్బాయి" అంటూ టీచర్లు హేళన చేసేవారు. అయినప్పటికీ ఆయన అకుంఠిత దీక్షతో అంచెలంచెలుగా ఎదిగి ప్రముఖ శాస్త్రజ్ఞునిగా పేరు




తెచ్చుకున్నారు. నాజీలు విజయం సాధించి పదవుల్లోకి వచ్చిన తర్వాత ఐన్‌స్టీన్ జర్మనీ వదిలి అమెరికా వెళ్లి అక్కడే స్థిరపడ్డాడు.

అక్కడ ఉన్న కాలంలో ఒకరోజు ఉదయం తన స్నేహితులు కొందరితో ముచ్చటిస్తున్నప్పుడు ఒక తమాషా జరిగింది. వారి సంభాషణల్లో అనేక విషయాలు దొర్లాయి. ఉన్నట్టుండి హఠాత్తుగా వారి సంభాషణ విజయం గురించి మళ్లింది. విజయం అంటే ఏమిటి? దాని గురించి అచ్చట వున్నవారి అభిప్రాయాలు, నిర్వచనాలు ఏమిటి? ఈ ప్రశ్నలకు వారిలో ఒక్కొక్కరూ ఒక్కొక్క విధంగా తమ అభిప్రాయాల్ని వెల్లడించారు.

ఆ సమయంలో ఐన్‌స్టీన్ పెదవి విప్పకుండా మౌనంగా కూర్చున్నాడు వారు చెప్పేది వింటూ. స్నేహితుల్లో ఒకరు ఆయన మౌనంగా ఉండడం గమనించాడు.

"ఐన్‌స్టీన్! మేమంతా విజయం గురించి మా ఉద్దేశ్యాలని చెప్తుంటే నువ్విలా ఒక్క మాట మాట్లాడకుండా కూర్చున్నావేమిటీ? విజయం పై నీ అభిప్రాయాన్ని చెప్పు" అంటూ కోరాడు.

ఐన్‌స్టీన్ ఒక్కనిముషం ఏదో ఆలోచించి, వెంటనే తన జేబులోంచి ఒక కాగితం తీశాడు. ఆ కాగితం పై ఇలా రాశాడు.

"విజయం అంటే 'యస్=ఎక్స్+వై+జడ్' "

ఆ కాగితం స్నేహితులందరి చుట్టూ తిరిగింది. వారంతా కుతూహలంగా చదివారు. విషయం పూర్తిగా బోధపడలేదు. యస్ అంటే సక్సెస్, అయితే యక్స్, వై, జడ్ అంటే ఏమిటి? వారిలో ఎవ్వరికీ అందులోని అంతరార్థం తెలియలేదు. చివరికి ఐన్‌స్టీన్‌ను కోరారంతా దానికి అర్థం చెప్పమని.

"ఎక్స్... కష్టించి పనిచేయడానికి గుర్తు" చెప్పాడు ఐన్‌స్టీన్.

"అయితే జడ్ కు అర్థం ఏమిటి?" స్నేహితులు ఆతృతగా అడిగారు.

"మనిషి తన నాలుకను అదుపులో పెట్టు కోగల శక్తిని జడ్ సూచిస్తుంది" చెప్పారు ఐన్‌స్టీన్ కొంటెతనంతో తన కళ్లల్లో వ్యంగ్య వైభవం మెరుస్తుండగా.

---

## రిక్షావాలా- జిందాబాద్

సాధారణంగా వృత్తినిబట్టి ఆయా వ్యక్తుల తెలివితేటల్నీ, సంస్కారాల్నీ అంచనా వేస్తారు చాలామంది. కానీ అలా తప్పని అప్పుడప్పుడు కొందరు వ్యక్తులు తమ పనులద్వారా నిరూపిస్తారు. 36 సంవత్సరాల శాంతిపదదుత్త అనే రిక్షావాలా చక్కటి కవి. ఒక పత్రికకు సంపాదకత్వం సహితం వహిస్తున్నాడు.

ముర్షిదాబాద్ రేడియోస్టేషన్నుంచి తరచుగా ఆయన కవితలు వినవస్తూ వుంటాయి. రేడియో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ బడిన సాహితీ పురస్కారం లభించింది.

బెర్హమ్‌పూర్‌లోని రిక్షా చాలక్ సమితికి అతడు ఉపాధ్యక్షుడు. నగరంలో అతనికి మంచిపేరుంది.

మరో రిక్షావాలా పేరు కుందు. గాంధీజీపట్ల అపారమైన ప్రేమ, భక్తి, శ్రద్ధలు గలవాడు. రోజూ కష్టించి రిక్షా తొక్కడంవలన వచ్చే కిరాయి అతని కుటుంబానికి సరిపోదు. అయినా బాపూజీపట్ల అంకితభావంతో రోజూ గాంధీచౌక్‌లో వున్న బాపూజీ విగ్రహంవద్దకు వెళ్ళి ఒక బకెట్ నీళ్ళతో విగ్రహాన్ని కడిగి, పరిశు




బహబదెబ్ బిశ్వాస్ ఒకసారి శాంతి కవితలు చదివి ఆనందాశ్చర్యాలకు లోనై వెంటనే శాంతిని రేడియో స్టేషన్‌కి రప్పించి అతని కవితలు కొన్ని రికార్డ్ చేయించి ప్రసారం చేశాడు. అది విన్న జిల్లా అధికారులు శాంతిచేత అనేక నినాదాలు, కవితలు రాయించారు. అక్షరాస్యత అభివృద్ధి కొరకు శాంతికి నరేంద్రగుప్తా స్మృత్యర్థం నెలకొల్పా

భ్రంగా వున్న గుడ్డతో దానిని తుడుస్తాడు. తెల్లవారుఝామున 5 గంటలకు విగ్రహంవద్దకు వెళ్ళి శుభ్రం చేసే కార్యక్రమాన్ని ఆరంభిస్తాడు. 3, 4 రోజులకు ఒకసారి సబ్బుతో సహితం కడిగి విగ్రహానికి స్నానం చేయిస్తాడు. ఆటుపిమ్మట తన రిక్షా కిరాయిలు



ప్రారంభిస్తాడు. ఒక్కొక్కసారి ఆ సమయంలో కుందుకు కిరాయి తగుల్తుంది. ఆ వచ్చినవారు కుందు నిర్వహించే గాంధీజీ స్నానం పూర్తయ్యేవరకూ వేచి వుండవలసిందే. మహానాయకులే పూజ్య బాపూజీని మరిచిపోతున్న ఈ రోజుల్లో కుందుకు గాంధీజీపై ఉన్న ప్రేమాభిమానాలు ప్రశంసనీయం.

## విద్యార్థులూ - వేడికోళ్ళూ

మాస్టార్ల ఉద్యోగాల్లో ఎదురయ్యే సాధకబాధకాలు ఇన్నీఅన్నీ కావు. చెప్పినమాట వినని పిల్లలూ, చదువులో బాగానే వున్నా అల్లరిలో మరింత మంచిపేరు తెచ్చుకునే పిల్లలూ, పిల్లల్నేమైనా అంటే మీదపడే తల్లితండ్రులూ... ఇలా ఎన్నోరకాలు. ఉత్తరప్రదేశ్ మాస్టార్ల పరిస్థితి మరికొంచెం విచిత్రంగా వుంది. వాళ్ళు దిద్దే ఇంటర్మీడియట్ పేపర్లలో ప్రశ్నలకి జవాబులు కన్నా సానుభూతి వేడికోళ్ళు ఎక్కువగా కనిపిస్తున్నాయట ఈమధ్య.

ఒక అమ్మడు తన ఆన్సర్ పేపర్‌లో ఇలా రాసిందట... "సార్! నా భర్త చనిపోయాడు. నాకు ఇద్దరు పిల్లలు. ఇల్లు గడవడానికి ఏ ఆధారమూలేదు. దయచేసి నాకు పాస్ మార్కులు వేయండి. అందువలన నాకు ఉద్యోగం దొరుకుతుంది. మీరు నాపై దయ చూపెడితే దైవం మీకు మేలు చేస్తాడు"

మరో విద్యార్థి ఇలా ఘోషించాడు. "అయ్యా! నేను నా చిన్నతనంలో ప్రమాదవశాత్తూ కాలు పోగొట్టుకున్నాను. ఒక హోటల్‌లో పనిచేస్తూ చదువుకుంటున్నాను. నా తల్లితండ్రులు బహు పేదవారు. వారు నన్ను చదివించలేరు. కనుక నన్ను పాస్ చెయ్యండి. మీ కలమే నా భవిష్యత్తును నిర్ణయించేది"

అనేకమంది తమ అంగవైకల్యాల గురించి రాస్తే కొందరు తమ తల్లిదండ్రుల గురించీ, ఇంకొందరు తమ సవతి తల్లిగురించీ చెప్పుకుంటారు. కొందరు విద్యార్థులు లెక్చరర్లకు ఆకర్షణీయమైన బహుమతులనిస్తామని ప్రలోభపెడుతుంటారు. మరికొందరు క్యాష్ విరచూపిస్తున్నారు. ఒక విద్యార్థి తన ప్రేమపురాణాన్ని ఇలా రాశాడు... "నా వయసులో వున్నప్పుడు మీరు కూడా పరీక్షలు పాస్ అయ్యారు. యువకుల భావాలు ఎలా వుంటాయో మీకు బాగా తెలుసు. నేను ఒక ఆమెను ప్రేమించాను. ఆ ప్రేమలో నా చదువు సాగడంలేదు. ఈ సంఘం సహితం మా ప్రేమను సాగనివ్వడంలేదు. కనుక దయచేసి నన్ను పాస్ చేసి మా ప్రేమను కాపాడండి"

ఇవన్నీ చదివి మాస్టార్లు తలలు పట్టుకుంటున్నారు. ♣



# ఏరిన ముత్యాలు

* విద్యార్థి జ్ఞానాన్ని అన్వేషించాలి. జ్ఞానం విద్యార్థిని వెదుక్కోకూడదు.

–జార్జి బెర్నార్డ్ షా

* జ్ఞానం ఐకమత్యానికి దారితీస్తే అజ్ఞానం విడిపోవడానికి కారణం అవుతుంది.

–రామకృష్ణ పరమహంస

* అన్నీ తెలిపోయినా ఆశ చావదు.

–తెలీజ్

* జ్ఞానం అని మనం మురిసే దాన్లో చాలాభాగం అజ్ఞానం. చిత్త భ్రమణానికీ, చిత్తస్తంభనకూ మాత్రమే అది దారితీస్తుంది.

–మహాత్మాగాంధీ

* భూమి ఎవరి తాతగారి సొత్తూ కాదు. అది ఎవరికీ ఆస్తి కారాదు.

–బెర్ట్యూలియన్

* మనిషి నేలను తనది చేసుకుంటే నేల మనిషిని తనవాణ్ణి చేసుకుంటుంది.

–ఎమర్సన్

* స్వయంగా ఉపయోగించలేనివాడి చేతిలో చారెడు నేల కూడా ఉండరాదు.

–ఇంగెర్‌సాల్

* ప్రజలలో చైతన్యం లేనినాడు స్వాతంత్రం నిలబడదు.

–జె.ఏడమ్స్

* అభ్యుదయానికి శ్రమ మూలం. శ్రమకు ఎలాంటి బంధనాలూ పనికిరావు.

–ఇంగెర్‌సాల్

* ఒకరి శ్రమ మీద మరొకరు బతకాలనుకోవడమే పాపానికి పునాది.

–జె. ఒబ్రీన్

* సాహిత్యం సగం వ్యాపారం, సగం కళ అయినప్పుడే అది బాగా రాణిస్తుంది.

–విలియమ్ రాల్ఫ్ ఇంగె

* సూత్రాలు విద్యార్థి మార్గాన్ని పొడిగిస్తాయి, దృష్టాంతాలు దాన్ని తగ్గిస్తాయి.

– సెనెకా

* ఉత్తముల మాట నెమ్మది, చేత ఖచ్చితం.

–కన్ఫ్యూషియస్

సేకరణ: వి.వి.రమణకుమార్

# ఏరిన ముత్యాలు

* సవాళ్లే జీవితపు సౌందర్యం.

—రోస్‌పాల్

* ఆనందానికి మార్గం మీ హృదయంలో ద్వేషం లేకుండా ఉంచుకోవడమే.

—హెచ్.జి. మేటర్స్

* సమంజసం కానీ విషయాల్లో ప్రజలు నమ్మకం కలిగి ఉన్నంతకాలం వారు అక్రమాలు చేస్తూనే ఉంటారు.

—ఓల్టేర్

* స్వార్థం లేకుండా ఉండడంలోనే ప్రేమింపబడే రహస్యం దాగుంది.

—జె.జి.హాలెండ్

* జీవించడం వల్ల ఏదీ పరిగణనలోకి రాదు. కానీ అల్పకాల జీవితమైనా మనమేం చేశామన్నది పరిగణనలోకి వస్తుంది.

—జవహర్‌లాల్ నెహ్రూ

* ఒక పౌండ్ చదువుకంటే ఒక ఔన్స్ విచక్షణా జ్ఞానం మంచిది.

—ఆడమ్స్

* మనిషి విలువ అతను సృష్టించిన వస్తువులలో ఉంటుంది, అంతేకానీ అతడు పోగు చేసుకున్న వస్తువులలో ఉండదు.

—కలీల్ గిబ్రాన్

* అసంభవమైన వాగ్దానాల కంటే చిన్న చిన్న పనులు గొప్పవి.

—మెకాలె

* కలకాలం నిలిచిపోయే పనులు చేయడంలో ఖర్చు అయిన జీవితమే చాలా ఉపయోగకరమైన జీవితం.

—విలియమ్ జేమ్స్

* చదువు డబ్బు లాంటిది, ఎంత సంపాదించినా ఇంకా సంపాదించాలనే మనసు ఉబలాటపడుతుంది.

—జోసఫ్ బిల్లింగ్స్

* ఒంటరిగా ప్రయాణం చేసేవారే తమ గమ్యాన్ని తొందరగా చేరుకుంటారు.

—కిప్లింగ్

సేకరణ: మైత్రేయ, వైనతేయ

## 'కోకిల' పై సమీక్షలు

**సెప్టెంబర్ 'చతుర' లో ప్రచురితమైన కొలిశెట్టి వెంకటరమణా లక్ష్మయ్య నవల 'కోకిల' పై మాకందిన ఉత్తమ సమీక్షలు.**

### బృహత్తర బాధ్యత

*(ప్రథమ బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

ఆధునికత పేరుతో మెంటల్ మెచ్యూరిటీ లేని యువత ప్రేమ సినిమాలు చూసి చూసి ఒకానొక ఇల్యూజన్‌కు లోనై గాలిమేడలు కడుతూ అవి నెరవేరక మెంటల్ ఇన్‌బాలన్సుకు గురై తద్వారా తల్లితండ్రులను, కుటుంబ సభ్యులను ఎంత మానసిక క్షోభకు గురిచేస్తున్నారో తెలుసుకొని ఇలాంటి మానసిక జాడ్యానికి యువతను దూరంగా ఉండమని హెచ్చరిస్తూ, ఉద్బోధిస్తూ రాసిన ఈ 'కోకిల' నవల చాలా బాగుంది. ఇటీవల కాలంలో సమాజంలోకి చాపకింద నీరులా వ్యాపిస్తున్న ఈ మానసిక రుగ్మతను రూపుమాపడానికి తన వంతు బాధ్యతను రచయిత్రి నెరవేర్చారని చెప్పక తప్పదు. ఇది చిరు ప్రయత్నమైనా సరియైన టైములో యువతలో పెడదారి తొక్కుతున్న ఆలోచనలను గాడిలో పెట్టాలని అందుకు అందరు రచయితలు కూడా ఈ దిశగా తమ వంతు కృషితో సమాజరుగ్మతలను ఎత్తి చూపే రచనలు చేస్తూ ముందడుగు వెయ్యాలని పరోక్షంగా సూచిస్తూ చక్కని కథా సంవిధానంతో రాసిన ఈ రచనలోని ఒక్కొక్క పాత్ర సజీవంగా మలచి సమాజంలోని సహజ వ్యక్తుల్లా మన ముందు సాక్షాత్కరింపజేసిన రచయిత్రి ఎంతో అభినందనీయురాలు. ప్రేమ పేరుతో మానసిక ఎదుగుదల లేక ఎలాంటి భావావేశాలకు లోనౌతున్నారో తెలియజెప్పే కోకిల, స్నేహానికి అర్థం చెప్పే మాధవ, మానవత్వాన్ని అందరిలోనూ తట్టిలేపే డాక్టర్ శేషాద్రి, డాక్టర్ గోవర్థన్‌రెడ్డి, పనిమనిషిగా కాకుండా తోటి మనిషికి ఎలా సాయపడాలో చెప్పే శమంత ఇలా ప్రతీ పాత్రా ఎంతో సహజంగా చిత్రీకరిస్తూ 'తల్లితండ్రులూ మీ పిల్లల నడవడికను స్వేచ్ఛ పేరుతో వదిలెయ్యకుండా ఒక కంట కనిపెడుతూ ఉండండి సుమా. ఇది పిల్లల ఎడల మీ బృహత్తర బాధ్యత' అని హెచ్చరికను కూడా ఇచ్చిన ఈ రచనకు, ప్రచురించిన మీకు హేట్సాఫ్.

–కె.ఏకాంబరేశ్వరరావు
విశాఖపట్నం

### ప్రేమించే మనసుండాలి!

*(రెండవ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)*

ఈనాడు మనం ఏ నోటవిన్నా నేటి సినిమాలే యువతను పెడదోవ పట్టిస్తున్నాయన్నది చర్చనీయాంశంగా వుంది. అయితే సినిమాల్లో మంచీ, చెడూ రెండూ వున్నా ఈ తరం మాత్రం సినిమాల్లోలాగా తీయని కలలుగంటూ ఊహల పల్లకిల్లో పయనిస్తున్నారు. అందమైన జీవితఫలకాలపై తమకు తామే చెరగని పిచ్చిగీతలు గీసుకుంటున్నారు. వారి భవిష్యత్తుపై ఎన్నో ఆశలు పెట్టుకున్న తమ తల్లిదండ్రుల ఆశాసౌధాలను కూల్చేస్తున్నారు.



మనోపరిపక్వత లేమితో, సినిమాల మోజులో పడి ప్రేమ-పెళ్లిల పట్ల సరైన అవగాహనలేక తమ 'కామ' వాంఛనే ప్రేమగా ఎంచి, ఆ ప్రేమే తన పెళ్లికి పరాకాష్టగా భ్రమించి మోసపోయిన అబల కోకిల. ఆమె జీవితాన్ని ఇతివృత్తంగా తీసుకుని అందించిన 2002 సెప్టెంబర్ చతుర నవల పాఠకులను ఆద్యంతమూ ఎంతగానో ఆకట్టుకుంది.

ప్రభు, మాధవ, కోకిల తాము చిన్నప్పుడు ఊగిన ఊయల ఒకటే అయినా, పసి పిల్లలుగా ఉన్నప్పుడు వారిది ఒకే ఉగ్గుగిన్నె అయినా, పెరిగి పెద్దయ్యాక వారివి భిన్న మనస్తత్వాలు. జీవితాన్ని ఆషామాషీగా తీసుకుని దగాపడి ఒంటరిదయింది కోకిల. ఒంటరి జీవితం ఎప్పుడూ ఓ తోడును కోరుకుంటుంది. ఆ సమయంలో ఆమెకు మాధవను బాసటగా నిల్పిన రచయిత్రి ప్రతిభ ప్రశంసనీయం. అమాయక యువతుల మనస్తత్వాలను ఎన్-క్యాష్ చేసుకుని, వారితో శారీరక వాంఛలు తీర్చుకుని అటుపిమ్మట ఏవో కుంటిసాకులతో మొహం తప్పించి వారిని వదిలేసే ఘరానా మోసగాళ్ల కోవకు చెందిన హీరో ప్రభు నవలలో కనుమరుగైనా, కోకిలకు చిన్ననాటి నేస్తం మాధవే అసలు కథానాయకుడీ నవలలో.

స్నేహం నేపథ్యంలో తన ఎమ్మోట్‌ను సైతం అటకెక్కించి కోకిల మీద అపారమైన జాలి ప్రదర్శించి, అమృతం చిలికించిన స్నేహతత్వం అతడు. వక్రించిన కోకిల జీవితాన్ని సరిదిద్దేందుకు స్వార్థరహితుడుగా కార్యోన్ముఖుడై ప్రతిఫలాపేక్షలేని సహాయసహకారాల్ని ఆమెకు పంచిన మాధవ పాఠకుల హృదయాల్లో ఓ అమృతమూర్తిగా నిల్చిపోయాడు.

కామాన్ని ప్రేమగా భావించడం సరికాదు. ప్రేమించడం అంటే ఎదుటి వ్యక్తికి తన వంతు సహాయాన్ని అందజేయడమే! కామవాంఛలతో దగ్గరయ్యే స్త్రీ-పురుషుల మధ్య మొలకెత్తేదే ప్రేమ అనుకోవడం పొరపాటు. చల్లనిచూపు, ఆప్యాయపూరితమైన స్పర్శ, ఇవన్నీ ప్రేమను వ్యక్తం చేసేవే! మనం దేశాన్ని ప్రేమిస్తాం, జన్మస్థలిని ప్రేమిస్తాం, ఊరూ వాడల్ని ప్రేమిస్తాం, పరిసరాల్ని ప్రేమిస్తాం, అమ్మానాన్నలను, కన్న బిడ్డలనే కాదు మనకిష్టమైన వస్తువులనూ ప్రేమిస్తాం. అసలు ప్రేమే ఈ సృష్టికి మూలం. అందుకే ప్రతి ప్రాణిలో ప్రేమించే మనసుండాలి. అసలీ నవలకు ప్రధాన ఇతివృత్తమే ప్రేమ.

చివరలో ఇది కేవలం కోకిల ఇల్యూజన్ మాత్రమే అని ఆ పాత్రను రచయిత్రి ఉన్నతంగా నిలిపినా ఇల్యూజన్ కాకుండా, నిజంగా జరిగిన, జరుగుతున్న సంఘటనలు ఈ రోజుల్లో ఎన్నో వున్నాయి. సాహిత్యం, సినిమాలు, బుల్లితెర... ఇవే మంచినీ, చెడునూ కూడా అందిస్తున్నాయి. అందుకే యువత తమ బుద్ధినుపయోగించి వాటిని అనుసరించాలి.

ప్రతిష్టాత్మకమైన ఎన్నో వ్యాపకాలతో సమాజసేవచేస్తూ సాహితీ క్షేత్రంలో మంచి బీజాలను నాటి చతుర పాఠకులను రచయితలుగా తీర్చిదిద్దుతున్న రామోజీరావుగారికి హృదయపూర్వక అభినందనలు. ఆయనకు ఆయనేసాటి... సరిలేరు తనకెవ్వరూ!

—రేణుకుంట్ల ఎల్లయ్య
హైదరాబాదు

## ప్రమోదంలో ప్రమాదం

*(మూడవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

ఈనాడు తామరతంపరగా విడుదలవుతున్న వెన్నెముక లేని సినిమాలు వెలువరించే సినీకాలుష్యం యువత బంగారు భవిష్యత్తుకెంతటి ప్రమాదమో మానసికరోగిగా మారిన కోకిల ఒక ఉదాహరణ! వినగవినగ చెడు చెవికెక్కినట్టు చూడగా చూడగా




సినిమా పిచ్చిపట్టి ముదిరి పోతున్నప్పుడు అదుపులో పెట్టి సరిదిద్దే తీరిక, సమయం కన్నవాళ్లకి లేకుండాపోయింది. అలాగే జీవితానుభవాలు నిండిన తాతలు, మామ్మలు బుద్ధి గరిపే పరిస్థితులు అంతరించి పోయాయి. అసలు పిల్లలికి తల్లితండ్రుల కంటే ప్రధానంగా పెద్ద తలకాయలు అందుబాటులో లేకపోవడమే గొప్ప లోటు!

ఈనాటి యువత కన్నవాళ్లిచ్చిన స్వేచ్ఛాస్వాతంత్ర్యాల్ని, ఆడామగ సమానమన్న ఉత్తమ లక్ష్యాన్ని గాలికొదిలి సినీ వ్యామోహంలో కూరుకుపోయి డైలాగులు, దృశ్యాలు, దుస్తులు, పాటల్లో లీనమైపోయి సినిమాని జీవితంగా భావించి మతిభ్రమణకి ఎరకావడం స్వయం కృతాపరాధం. ఆ దుస్థితిలో కాపాడే మానవతా మూర్తులు ఈనాడు స్నేహితుల్లో, బంధువుల్లో, వైద్యుల్లో, శ్రేయోభిలాషుల్లో అంతంత మాత్రం. ప్రస్తుతం ప్రతీ మనిషిలో తప్పించుకు తిరిగే అవలక్షణం సమృద్ధిగా ఉంటే అలాంటి వాళ్లకి మాధవ, డాక్టరు శేషాద్రి, గోవర్ధనరెడ్డి ఆదర్శం! అప్పుడు మాధవ చెప్పిన మనుష్య పశువులకోసం జూ ఏర్పాటు చేయనవసరం రాదు.

నమిలి ఊసేసినట్టు థియేటర్లో విడిచే సినిమాల్ని జీవితపరమార్థంగా ఎంచే పరిస్థితులీనాడు అనేకం. పూర్వం నాటి శతదినోత్సవ వేడుకల్ని ఈనాడు చిత్రం ఆరంభానికి, ఆడియో రిలీజుకి, పిక్చరు విడుదలకి, ఆపైన హీరో అభినందనకి జరిపి యువతని నిద్రపోనివ్వడంలేదు. ప్రమోదాన్నిచ్చే సినిమా ప్రమాదం పంచి అభంశుభం ఎరుగని యువతరాన్ని సరిదిద్దుకోలేనంత తప్పుదోవ పట్టించి విలువైన కాలాన్ని అందమైన జీవితాన్ని మంటగలుపుతున్నది. అప్పుడు సినిమా వేరు, జీవితం వేరు కాబట్టే సమస్యలు క్షణాల్లో సమసిపోవడం లేదన్న వాస్తవాన్ని గుర్తించేసరికి చేతులు కాలిపోతాయి. అప్పుడెవరెంత ఏడ్చి ఏం లాభం?

ఆకుచాటు పిందెలా ఉండే ఆడపిల్ల కోకిల, ఎడతెగకుండా చూసిన సినిమాల ప్రభావంతో అదే జీవితంగా భ్రమించి సినీ బాధల్ని తనలో తాను ఊహించుకుని చివరికి మతిభ్రమకి గురైె డాక్టరు గోవర్ధన రెడ్డి చలవతో చిత్తచాంచల్యం నుండి విముక్తురాలైంది. కోకిల సినీ ఉన్మాదానికి గురైనట్టు నవల ఆఖరి పేజీలు చదివే వరకూ తెలీదు. మధ్యలో ఎక్కడా సూటిగా ఆ ప్రసక్తి వెల్లడి కానందున ఆ పుటలు చదవగానే విస్మయం కలగదు, అసహనం కమ్ముతుంది. తర్వాత బర్నింగు సబ్జెక్టు అభినందనీయమవుతుంది. ప్రస్తుత కాలానికి అవసరమైన నవల కోకిల!

—యం.వి.యస్.లక్ష్మి
కాకినాడ-4

## మీడియా కాలుష్యం

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

ఊహ కావచ్చు కల్పనే కావచ్చు కోకిల లాంటి అమ్మాయిలు మీడియా కాలుష్యానికి ఎందరో ఆహుతి అయిపోతున్నారు. ఏదోవిధంగా భంగపడిన కోకిలకు మాధవ, శేషాద్రి లాంటివారు అందరికీ తారసపడరు. అసలు అటువంటి వ్యక్తులు వున్నారా అనే ఆలోచన కూడా రాదు. అట్టడుగు కుటుంబాలలో శమంతకలాంటి పనిమనుషులు మాత్రం చాలామంది వున్నారు. కోకిల నవల యువతరం వారికి కనువిప్పు కలిగిస్తుంది. కోకిలలోని ధైర్యం అందరి యువతులకు వుండాలి. రచయిత తన నవలను మలుపు తిప్పిన విధానం చాలా బాగుంది. చాలా ఆసక్తిగా చదివించి ముగింపు విచిత్రంగా ముగిసింది. విద్య, వైద్యం వ్యాపారకేంద్రాలు అయిన ఈ రోజుల్లో గోవర్ధనరెడ్డిలాంటి డాక్టరు చాలా

అరుదు. ఉమ్మడి కుటుంబాలు విడిపోవుట వలన భావితరం వారి భవిష్యత్ ఏవిధంగా నాశనం అవుతుందో, మీడియా ప్రభావంవలన నైతిక విలువలు ఎంత దిగజారిపోతున్నాయి అనే విషయాన్ని చాలా సున్నితంగా చెప్పగలిగారు.

ఈమధ్య చతుర నవలలో నాకు బాగా నచ్చిన నవల కోకిల. సంపాదకవర్గానికి ధన్యవాదాలు.

–సాయిప్రకాష్
విశాఖపట్నం-27

## హద్దుమీరని స్వేచ్ఛ

*(అయిదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

కోకిల స్వరం వసంత ఋతువులోనే ఆనందం కలిగిస్తుంది. అన్ని ఋతువులలో కోకిల కూస్తే? అంత మధురంగా ఉండదు. ఆడపిల్ల అణకువగా హద్దుమీరని స్వేచ్ఛ అనుభవిస్తూ, తల్లిదండ్రుల అదుపాజ్ఞల్లో ఉండి వివాహానంతరం ప్రేమిస్తే జీవితం ఎవ్వరికీ సమస్యాత్మకం గాదు. సమస్యలతో తాను నరకం అనుభవిస్తూ, కుటుంబ సభ్యులకూ, స్నేహితులకూ జీవితాంతం వేదన కలిగించడం మంచిదా? మనస్సును సమాధానపరచుకొని మనస్థాయికి తగిన కోరికలతో ప్రశాంతిగా, మనశ్శాంతిగా తానెవ్వరికీ ప్రశ్నార్థకం గాకుండా జీవించటం మంచిదా? అని నేటి యువతరాన్ని ఆలోచింపజేస్తుందీ నవల. పిల్లల గురించి మనోవేదన పడే తల్లిదండ్రులుగా శ్రీనివాసమూర్తి, రాజ్యలక్ష్మిల పాత్రలు, మానవత్వం నిండిన డాక్టర్లుగా శేషాద్రి, గోవర్ధన్ పాత్రలు అతి సహజంగా మలచబడ్డాయి. సినిమాలు చూసి నవలలు చదివి ఆ పాత్రలను తనకు ఆపాదించుకొని ప్రేమే జీవిత సర్వస్వమనీ అందర్నీ వదులుకొన్న కోకిల, ప్రేమించిన స్త్రీని సులువుగా వంచించి తన స్థాయిని పెంచుకోవాలనే నమ్మకద్రోహి ప్రభు పాత్రలు ఆధునిక యువతరపు ప్రతీకలు. మాధవ ఒకచోట 'ఆడపిల్ల గడప దాటి బయటకు వెడుతుంటే ఓ కన్నువేసి ఉంచడంలో తప్పు లేదు' అంటాడు. ఇది నూరుశాతం నిజం. అలా చెయ్యని ఎందరో తల్లిదండ్రులు ఈరోజు మనశ్శాంతి కోల్పోతున్నారు. స్త్రీ ఆకర్షణ ప్రధానమైనది. అందువలన స్త్రీకి అడుగడుగునా కుటుంబ సభ్యులు గైడ్‌గా ఉండాలి. చివరిదాకా చక్కగా నడిపించి నవల ముగింపు మాత్రం కోకిల భ్రమగానూ సైఖియాట్రిస్టల ప్రవేశంతో గజిబిజగా తయారయింది. అలాగాకుండా ప్రభు వివాహం ఆపడం, తరువాత కోకిలను ప్రవేశపెట్టి పోలీసులు, ప్రజల ఒత్తిడి ద్వారా కోకిల వివాహం ప్రభుతో జరిపిస్తే బాగుండేది. విదేశీ వ్యామోహపు అలవాట్లలో మోజు పెంచుకుంటున్న యువతీయువకులు సాంప్రదాయపు కట్టుబాట్లను తెంచుకుంటే జరగబోయే నష్టాలు కోకిల నవల ద్వారా తెలియజేసిన రచయిత్రికీ ప్రచురించిన మీకూ ధన్యవాదాలు.

–ఎన్. నాగవెంకటరావు
అల్లిపూడి-533 407

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328.
Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Chennai: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060; Cuddapah: 70011; Tadepalli gudem: 28881; Warangal: 59933. Khammam: 55661; Ongole: 56777; Nizamabad: 45661; Mahabubnagar:77438; Mumbai: 022- 4703700; Chennai: 044- 2314980; Bangalore: 080- 3503498

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78

# కొందరికి కారం అంటే మమకారం!

ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు... మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.





Mango Avakaya | Mango Thokku | Cut Mango | Tender (Vadu) Mango | Sweet Mango Chutney | Amla | Gongura | Drumstick | Lime | Tomato | Mixed Vegetable


Bitter Gourd | Green Tamarind | Ginger | Sweet Ginger | Mango Ginger | Garlic | Onion | Red Chilli | Green Chilli (Sliced) | Green Chilli (Paste) | Gongura & Red Chilli | Green Tamarind & Red Chilli




**Pickles**
ఏ పచ్చడంటే
ఆ పచ్చడి సంసిద్ధ

ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్,(ప్రియ ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంపెక్స్